ఆంధ్ర మహాభారతములో

# కృత్-తద్ధిత ప్రయోగముల విశ్లేషణము


రచయిత

కండ్లకుంట అళహసింగరాచార్యులు



1969

ఆంధ్ర మహాభారతములో

# కృత్-తద్ధిత ప్రయోగముల విశ్లేషణము

ఉస్మానియా విశ్వవిద్యాలయం
తెలుగు శాఖకు, డాక్టరేట్ పట్టము కొరకు
సమర్పింపబడిన సిద్ధాంత వ్యాసము


రచయిత

డా॥ కండ్లకుంట అళహసింగరాచార్యులు
ఉపన్యాసకుడు
ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల
హైదరాబాదు



ఈ గ్రంథము
తెలుగు విశ్వవిద్యాలయము వారి
ఆర్థిక సహాయముతో ముద్రింపబడినది



పర్యవేక్షణ
డాక్టర్ నాయని కృష్ణకుమారి
ఉస్మానియా విశ్వవిద్యాలయం

ఆంధ్రమహాభారతములో
కృత్-తద్ధిత ప్రయోగముల
విశ్లేషణము

Analys's of Kr ts & Taddh'tas
n Andhra Mahabharata

ప్రథమ ముద్రణ 1000 ప్రతులు
మార్చి 1989

F rst Ed t on 1000
March, 1989



మూల్యం : రూ. 48

Pr ce Rs. 48



ప్రాప్తిస్థానం :
ఆంధ్ర సారస్వత పరిషత్తు
హైదరాబాదు.

Cop es can be had of :
Andhra Saraswata Par shat,
Hyderabad.

ముద్రణ :
ఆర్. కె. ప్రింటర్స్,
11-2-1124, నాంపల్లి
హైదరాబాదు-500 001.

Pr nted at :
R. K. Pr nters
11-2-1124, Nampa y,
Hyderabad-500 001.

# అంకితము



నా సంస్కృత విద్యా[illegible] గురువులు

జీవన మార్గద[illegible]లు

కీ. శే. శ్రీ [illegible] ప్ర.

శ్రీమాన్ వేదాంతం వెంక[illegible]సింహాచార్యులుగారికి

ఈ గ్రం[illegible]

భక్తిపూర్వకముగా అ[illegible]పించినది.

# శుభాకాంక్ష

ఆచార్య నాయని కృష్ణకుమారి
తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం.
హైదరాబాదు

శ్రీ సింగరాచార్యులవారి యీ సిద్ధాంత గ్రంథానికి దిక్ప్రదర్శన చేసింది నేనే గనుక దీని గుణాలనుగూర్చి నేనే వ్రాయడం సబబుగా ఉండకపోవచ్చును. కాని సింగరాచార్యులవారు ప్రాచ్యవిద్యా పద్ధతిని అనుసరించి వ్యాకరణవిషయాన్ని అధ్యయనం చేసినవారు. ఆయన అధ్యయనమంతా సారభూతమై ఈ గ్రంథంలో ప్రతిఫలిస్తుండడం విజ్ఞులు గుర్తించగలరు.

వ్యాకరణ మనేది ఎంత హృదయరంజకమైన విషయమో అంత గహనమైనది కూడా. దాని బాహ్యాకారాన్నిచూచి, లోపలికి వెళ్లకుండా గుమ్మం దగ్గరనుండే వెనక్కి తిరిగివెళ్లి పోతుంటారు జనం. సాహసించి లోపలికి అడుగుపెట్టారో, ఇక అంతా కర్పూరచందన సమన్విత మధురాహ్వానమే ఎదురు వచ్చి తోడ్కొని పోతుంది

ఆ విషయం గుర్తించినవారు సింగరాచార్యులవారు. ఈయన సంపాదించుకున్న పాండిత్యాభిరుచిక ఈయన్ని లాక్షణికుడుగా మలచడం ప్రారంభించింది. భారతం ఈయన దృష్టికి సర్వలక్ష్యసంగ్రహంగా సాక్షాత్కరించటానికి అదే కారణం ఆ కారణమే ఈ సిద్ధాంత గ్రంథావిష్కృతికి హేతువు.

ఈ గ్రంథంలో కేవలం ప్రాచీన వ్యాకరణకారుల ననుసరించిన విశ్లేషణే కాక, ఆధునిక భాషాశాస్త్ర వివేచనకూడా జతపడి ఉండడం విజ్ఞులు గమనించగలరు. జ్ఞానమనేది దేశ కాలాతీతమై ఏ అడ్డుకట్టలూ లేని అవ్యాహత స్రవంతి. ఎవరెటువంటి పాత్రను కలిగిఉండే వారి కంతంత లబ్ధి.

ఇందులోని మంచి చెడ్డల నెన్నవలసినవారు సహృదయులైన పాఠకులు ఈ గ్రంథానికి ఆహ్వానం పలుకుతున్నాను.

హైదరాబాదు, నాయని కృష్ణకుమారి

2-8-1989.

# ఈ గ్రంథం గురించి....

డా కే. ఏ. సింగరాచార్యులుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయం పి.హెచ్.డి. పట్టంకోసం సమర్పించిన సిద్ధాంతవ్యాసం 'ఆంధ్రమహాభారతములో కృత్తద్ధిత ప్రయోగముల విశ్లేషణము" సింగరాచార్యులుగారు సంప్రదాయబద్ధంగా సంస్కృతంలో మహాభాష్యాంతం వ్యాకరణం చదువుకున్నారు తెలుగులో ఎం.ఏ. పూర్తిచేశారు ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాలలో అధ్యాపకత్వం నిర్వహిస్తూ చివరి సంవత్సరాలలో ఆర్థిక, ఉద్యోగాది ప్రయోజనాపేక్షా రహితంగా, కేవలం పరిశోధనా దృష్టితో మాత్రమే కవిత్రయ భారతంలోని కృత్, తద్ధిత ప్రయోగాల పరిశీలనకు పూనుకున్నారు ఈ గ్రంథం ప్రచురితం ఆయ్యేనాటికి వారి సర్వీసుకూడ పూర్తికావచ్చింది.

పందొమ్మిదవ శతాబ్దినాటికిగాని తెలుగు వ్యాకరణాలు కృత్, తద్ధితాలమీద తమ దృష్టిని కేంద్రీకరించలేదు అవి కూడా అంత సమగ్రం కాదు. ద్రావిడభాషల తులనాత్మక అధ్యయన రంగంలోకూడా నామ నిష్పాదక ప్రత్యయాలను పునర్నిర్మించే అధ్యయనం ఇంకా ఎంతో ముందుకు సాగవలసి ఉంది. 1978లో వచ్చిన గాలి సాంబశివరావుగారి సిద్ధాంతవ్యాసం 'A Compar tive Study of Drav d an Noun Derivat ons' ఈ రంగంలో జరిగిన ప్రధానమైన కృషి. మూలద్రావిడ భాషలోని ధాతువులపైన ఏర్పడ్డ నామాలు, క్రియలలో కొన్ని భాషలలో నామాలు మాత్రమే మిగలగా, కొన్నిటిలో క్రియలు మాత్రమే నిలిచాయి. అందువల్ల తెలుగు నామాలలోని ధాతువులను ప్రత్యయాలను విశేషించి చూపటం చాలా కష్టసాధ్యమైన పని. దీనికి ద్రావిడ భాషల తులనాత్మక అధ్యయనం కూడా అవసరం. ఈ పనికి సింగరాచార్యులుగారు పూనుకోవటం ఎంతో అభినందనీయం.

ఈ గ్రంథంలో మొదట సంస్కృత వ్యాకరణాలలో కృత్, తద్ధిత స్వరూపాన్ని గురించి వివరించారు. తెలుగు లాక్షణికులు వింగడించిన కృత్, తద్ధిత

ప్రత్యయాలను ఒకచోట వివరించారు తరువాత వరుసగా నన్నయ, తిక్కన, ఎఱ్ఱన రచనాభాగాలలోని కృత్ తద్ధిత ప్రయోగాలను విశ్లేషించారు ఈ విషయంలో ప్రణాళిక కొంచెం భిన్నంగా ఉంటే బాగుండునేమో అనిపిస్తుంది. కవుల క్రమంతో కాకుండా ప్రత్యయాల క్రమంలో కవుల ప్రయోగాలను చూపితే ఒకే ప్రత్యయాన్ని మూడు సార్లు చెప్పవలసిన అవసరం లేకపోయేది. ప్రణాళిక విషయం అలా ఉంచి సంప్రదాయ వ్యాకరణాలతోపాటు ద్రావిడభాషల తులనాత్మక అధ్యయనపద్ధతులను గూడ ఆచార్యులవారు ఉపయోగించుకునే ప్రయత్నం చేశారు వారు ఆధునిక భాషాశాస్త్రాన్ని ప్రత్యేక విషయంగా అధ్యయనం చేయలేదు. అయినా ఆ పరిజ్ఞానాన్ని ఉపయోగించుకోవటానికి స్వయంగా కృషి చేశారు. ఆయా ప్రత్యయాలను ప్రయోగాలను వింగడించేటప్పుడు సంప్రదాయ వ్యాకరణ రీతిలో వ్యుత్పత్తిని తెలిపి, ద్రావిడభాషల తులనాత్మక అధ్యయనాన్నికూడ ఉపయోగించుకున్నానని వారే స్వయంగా చెప్పారు రెంటికి విరోధంలేని చోట వ్యాకరణ మార్గాన్ని అనుసరించానని, ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరీ (D. E. D.) ప్రమాణం కూడ దొరకని చోట స్వతంత్ర మార్గాన్ని అనుసరించానని కూడ చెప్పారు. కవిత్రయ కృత్ తద్ధితాలను గురించి వెలికి తీయవలసిన అంశాలు ఇంకా చాలా ఉన్నాయని కూడా ఆచార్యులవారు సూచించారు. ద్రావిడభాషల తులనాత్మక అధ్యయన రంగంలో భావిలో ఇంకా జరిగే కృషిపై ఇది ఆధారపడి ఉంది

ఈ సిద్ధాంతగ్రంథంలో కొత్తగా ప్రతిపాదించిన అంశాలు, దానితోపాటు పునరాలోచించవలసిన అంశాలూ ఉన్నాయి. అంతమాత్రాన సింగారాచార్యులుగారి కృషి రిత్త పోయేదికాదు. ఇటువంటి అధ్యయనానికి తొలి ప్రయత్నాలలో ఇది ఒకటి. భావిలో ఈ రంగంలో ఇతర ప్రాచీన కవులను కూడా లక్ష్యంగా చేసుకొని విస్తృతంగా పరిశోధన సాగటానికి ఈ కృషి ఎంతగానో ఉపయోగిస్తుందని ఆశించవచ్చు

ఆచార్య కె. కె. రంగనాథాచార్యులు
హైదరాబాదు విశ్వవిద్యాలయం

"ఇదమంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్,
యది శబ్దాహ్వయం జ్యోతిరాసంసారం న దీప్యతే."

# ప్రస్తావన

సంస్కృత వ్యాకరణమును అభిమాన విషయముగా గ్రహించి విద్యాభ్యాసము సాగించిన నేను తెలుగు వ్యాకరణాంశముపై పరిశోధన చేయుటకు సంకల్పించితిని. ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యభాషా కళాశాలలో పనిచేయుచున్న నన్ను ఆప్తులు, శ్రేయోభిలాషులు అగు కొందరి ప్రేరణ, సహాధ్యాపకుల పరిశోధనా కృషి, వెన్నుతట్టి కార్యరంగములోనికి దింపినవి.

పరిశోధనా విషయము కొఱకు అన్వేషించుచున్న నాకు డా అమరేశం రాజేశ్వర శర్మగారు, 'ఆంధ్రమహాభారతములో కృత్తద్ధిత ప్రయోగముల పరిశీలన" అను వ్యాకరణాంశమును సూచించి ఆ విషయములో కొన్ని సూచనలిచ్చినారు. పి.హెచ్.డి లో ప్రవేశించినప్పుడు మొదట కొంతకాలము ఆయన నాకు పర్యవేక్షకులుగా నుండిరి.

నేను స్వీకరించిన ఈ విషయము కష్టసాధ్యమైనప్పటికి, వ్యాకరణము నందున్న అభినివేశముచేత ముందుకు సాగినాను సంపూర్ణ భారతము పరిశోధనా పరిధి అగుటవలన కార్యక్షేత్రము విస్తృతమైనది.

తరువాత నాకు పర్యవేక్షకురాలుగా నియమితులైన డా నాయని కృష్ణ కుమారిగారు భాషా శాస్త్రదృష్టితోగూడ పరిశోధన జరుపుట మంచిదని సలహా ఇచ్చినారు. ఆధునిక భాషా శాస్త్రములో ఇంతకుముందు తగినంత ప్రవేశము, పాండిత్యము లేకున్నను, వ్యాకరణ ప్రక్రియానుసారముగా, పదముల విశ్లేషణము ప్రధానముగా జరుపుచు, విశేష పరిశ్రమ కోర్చి భాషాశాస్త్రపరముగా కూడ పరిశీలనచేసినాను

భాషా శాస్త్రముతో అంతగా పరిచయములేని నాకు, అందలి ప్రాథమిక విషయములను, ముఖ్యాంశములను తెలిపి, D.E.D.వంటి కొన్ని ఉపయుక్త గ్రంథములనందించి, మా కళాశాల ప్రిన్సిపాల్ డా. కె. కె. రంగనాథాచార్యులుగారు ఎంతో

సహకారి మందించినారు ఆయనకున్న కార్యభారమువలన, పొందవలసినంత సహాయ మును నేను పొందలేకపోతిని.

డా నాయని కృష్ణకుమారిగారు పరిశోధనా విషయంలో అనేకములైన మార్గదర్శక పద్ధతులను, భాషాతత్త్వమునకు సంబంధించిన అంశములను, ఆయా సమ యాలలో వివరించి నన్ను తొందరపెట్టి నాచే ఈ కృషిని నిర్వర్తింపచేసినారు. ఈ విషయములో ఆమె నాయెడల ప్రదర్శించిన సౌజన్యము, సహకారము ప్రశంస నీయములు.

సిద్ధాంత వ్యాసమును వ్యావహారిక భాషలో వ్రాయదలచితిని. వ్యాకరణము వంటి విషయములనుగూడ వ్యావహారికములో రచించుట మంచిదని నమ్మువాడను నేను. కాని నా పూర్వపు విద్యావాతావరణము దాని సంస్కారము నన్ను వీడనందున అచ్చ మైన వ్యావహారికములో రచింపజాలనని తలచి, మధ్యమ మార్గముగా శిష్టవ్యావహారిక ముతో వ్రాయుటకు పూనుకున్నాను.

అందువలన ఉద్ధరణములలో తప్ప అరసున్నలు, శకటరేఫలు ఇందులో ఉండవు. వీలయినంతవరకు వినంధి పదలి పాటించినాను.

నన్నయ విభాగమునకు సంబంధించినంతవరకు పదప్రయోగ కోశముతో పాటు భారత భాగమునుగూడ క్షుణ్ణముగా పరిశీలించినాను. ఎఱ్ఱన భారతమునకు పద ప్రయోగకోశము లేనందున ఆ భాగమును చాల క్షుణ్ణముగా అధ్యయనముచేసి పదముల నేరుకున్నాను

తిక్కన భాగము చాల పెద్దదగుటవలన, అన్ని పర్వములను పెలుమారులు క్షుణ్ణముగా పఠించుట సాధ్యము కానందున, ఆ భాగమునకు ప్రధానముగా పదప్రయోగ కోశములపై ఆధారపడినాను. మూలరచననుగూడ యథావకాశముగా పరిశీలించితిని. అందువలన విస్తృతమైన తిక్కన రచనలోని ఏవైనా కొన్ని పదములు తప్పిపోయి ఉండవచ్చును. తిక్కన్న శైలి తెలుగుదనముతో నిండినందున, కృత్తులు, తద్ధిత ప్రత్య యములు కలిసిన రూపాలు చెప్పటికి పైగా లభించినవి.

కవి త్రయములో ఒకరి భాగములో చర్చించబడిన ప్రత్యయరూపములను గూర్చి వేరొకరి భాగములో మరల ప్రసావించలేదు. ఆ ప్రత్యయములతో చేసిన నూతన ప్రయోగములను, క్రొత్తగా లభించిన ప్రత్యయాలనుగూర్చి మాత్రము విశ్లేషణ జరిపినాను.

లాక్షణికుల నిర్వచనము ప్రకారము కృత్తులనగా— "ధాతువులమీద చేరు క్రియావిభక్తి భిన్నప్రత్యయము"లని యర్థము. వాటిలో క్త్వార్థక, తుమున్నర్థకాది ప్రత్యయములు గూడ చేరును. కాని నా యీ సిద్ధాంతవ్యాసములో "నామ నిష్పాదకము"లైన కృత్తులనే గ్రహించినాను. అందువలన "చేసి", చేయక, చేయుడున్, చేయుచున్" వంటి పదము లీ పరిధిలోనికి రాలేదు.

తద్ధితముల విషయములో గూడ పై సూత్రమునే పాటించి, నామ నిష్పాదకములనే స్వీకరించినాను. కావున విశేష్య, విశేషణ రూపనిష్పాదకములగు తద్ధిత ప్రత్యయములు విశ్లేషింపబడినవి.

తెలుగు వ్యాకరణకర్తలు పేర్కొనని కృత్తులు, తద్ధితములు కవిత్రయ భారతములో చాల కన్పించుచున్నవి. నన్నయ క్రియారూపములో మాత్రము ప్రయోగించిన పెక్కింటికి కృదంత రూపములను తిక్కన ప్రయోగించినాడు. అనేక శబ్దములకు ఒక్కొక్క ప్రయోగమే కనబడుచున్నది. పాఠాంతరమువలన కొన్నిచోట్ల నిర్దిష్టరూపములను నిర్ణయింపజాలకున్నాము.

ఆ యా ప్రత్యయములను, ప్రయోగములను విశ్లేషించునపుడు మొదట సంప్రదాయ వ్యాకరణ రీతిలో వ్యుత్పత్తిని తెలిపి, తరువాత భాషాశాస్త్రపద్ధతిలో తులనాత్మక పరిశీలనతో చర్చించినాను. రెండింటికి భేదము లేనిచోట వ్యాకరణ మార్గమునే అవలంబించితిని.

కొన్ని శబ్దముల వ్యుత్పత్తి సంక్లిష్టముగా ఉండి D.E.D వంటి ప్రామాణిక గ్రంథములు గూడ నిశ్చితముగా చెప్పనిచోట్ల స్వయంవ్యక్తమార్గము ననుసరించితిని.

కవిత్రయ భారతములోని వ్యాకరణమును, ముఖ్యముగా కృత్తద్ధిత ప్రయోగములను గూర్చి పరిశోధించి వెలికి తీయవలసిన రహస్యము లిప్పటికిని కొన్ని మిగిలి యుండవచ్చును. భావికాలములో మరికొన్ని అంశములు వెలువడుటకు నా యీ కృషి ఏ కొంచెమైనను తోడ్పడగలదని ఆశింతును.

కం. అ. సింగరాచార్యులు

# కృతజ్ఞతలు

విద్యాబోధన ద్వారా నాలో జ్ఞానజ్యోతిని వెలిగించిన ఆచార్యవర్యులకు—

నాకు పరిశోధన యందాసక్తిని కలిగించిన ఆప్తమిత్రులు, సహచరులు సహాధ్యాపకులకు—

శీర్షికను సూచించి తొలుత పర్యవేక్షకులుగానున్న డా. అమరేశం రాజేశ్వర శర్మ గారికి—

పి.హెచ్ డి.లో ప్రవేశము కల్పించిన తత్కాల తెలుగు శాఖాధ్యక్షులు డా. బి. రామరాజుగారికి—

అత్యధిక కాలము పర్యవేక్షకురాలుగా నుండి తగిన మార్గదర్శకత్వముతో నాచే ఈ కార్యభారమును నిర్వర్తింపజేసిన డా. నాయని కృష్ణకుమారి (అప్పటి తెలుగు శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము) గారికి—

పరిశోధన కుపయోగించు అమూల్య గ్రంథముల నందించి, భాషాశాస్త్రముఖ్య సూత్రములను తెలిపి సహకరించిన మా ప్రిన్సిపాల్ డా. కె. కె. రంగనాథాచార్యులుగారికి—

గ్రంథముద్రణకు రూ. 5000 ల ఆర్థిక సహాయము నందించిన తెలుగు విశ్వవిద్యాలయమువారికి—

వదాన్యతతో కొంత చేయూత నిచ్చిన శ్రీ వై. బి. రెడ్డిగారికి—

శుద్ధప్రతిని అందముగా సిద్ధముచేసి సకాలమున కందించిన శ్రీ కె. యస్. రామానుజాచార్యులు గారికి—

లేఖనకార్యములో నాకు తోడ్పడిన చి కె. విజయలక్ష్మి(ఎమ్.ఎ.) కె. ఎస్. మాధవీలతకు, కే. వేణుగోపాల్ కు

సకాలములో చక్కగా ముద్రించి ఇచ్చిన ఆర్. కె. ప్రింటర్స్ వారికి—

ఇంకా నాకు సహాయమందించిన అనేకులకు—

అందరికీ నా హార్దిక కృతజ్ఞతలు.

కం. అ. సింగరాచార్యులు

# విషయానుక్రమణిక

సంకేత వివరణ

## 1. గ్రంథ నామములు :

1. ఆది, సభా, మొదలగునవి ఆ యా పర్వములకు సంజ్ఞలు
2. ఆం. భా. భూ. ఆంధ్రభాషా భూషణము
3. ఆం. శ. చిం. ఆంధ్రశబ్దచింతామణి
4. ఆం. భా. శా. ఆంధ్రభాషానుశాసనము
5. ఆం. వ్యా. సం. స. ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము
6. క. శి. భూ. కవిశిరోభూషణము
7. కా. చూ. కావ్యాలంకారచూడామణి
8. తి. ప. ప్ర. కో. తిక్కనపదప్రయోగకోశము
9. తె. వ్యు. కో. తెలుగు వ్యుత్పత్తి కోశము
10. త్రి. శ. శా. త్రిలింగశబ్దానుశాసనము
11. న. ప. కో. నన్నయపదప్రయోగకోశము
12. ప్రౌఢ. ప్రౌఢ వ్యాకరణము
13. బా. వ్యా. బాలవ్యాకరణము
14. ము. ల. కౌ. ముక్తలక్షణకౌముది
15. వై. చం. వైకృత చంద్రిక
16. వ్యా. భా. వ్యా. వ్యావహారికాంధ్రభాషావ్యాకరణము
17. శ. చం. శబ్దార్థ చంద్రిక
18. సూ. రా. ని. సూర్యరాయాంధ్రనిఘంటువు
19. సూ. వ్యా. సూత్రాంధ్రవ్యాకరణము
20. D. E. D. Dravidian Etymological Dictionary
21. T. V. B. Telugu Verbal Bases

సంకేత వివరణ

## 2. భాషా నామములు :

కన్న—కన్నడము
తమి—తమిళము
మల—మలయాళము
మూ. ద. ద్రా —మూలదక్షిణద్రావిడభాష (P S Dr)
మూ. ద్రా—మూలద్రావిడభాష (P Dr)
కొడ—కొడగు

## 3. లిపి సంకేతము :

<u>త</u>—దంత మూలీయ స్పర్శము
ట—తమిళములోని 'కి' వంటి ఉచ్చారణ కలిగి ప్రాచీన శాసనాల్లో లభించే వర్ణము

—ం—వర్గాక్షరముల ముందు ఆ యా వర్గ పంచమాక్షరముగాను, పదాంతములో మకారముగాను పలుకబడును.

క, చ, ట, త, ప—ఇవి తమిళ మలయాళ భాషలలో అచ్చుల మధ్య, శిథిలోచ్చారణతో గ, స, డ, ద, వలు గాను, పదాదిలో శ్వాసములుగాను, అనునాసికాక్షరము తరువాత గ, జ, డ, ద, లుగా ఉచ్చరింపబడును.

# ప్రథమ ప్రకరణము

## సంస్కృత వ్యాకరణములో కృత్తద్ధిత స్వరూపము

సంస్కృత వ్యాకరణములలో పాణినీయ వ్యాకరణము ప్రముఖమైనది. దానికి పూర్వము కూడ వ్యాకరణము లుండెడివి. అవి-

"ఐన్ద్రం, చాన్ద్రం కాశకృత్స్నం కౌమారం శాకటాయనమ్
సారస్వతం చాపిశలం శాకలం పాణినీయకమ్". అని

హేమచంద్రుని శబ్దానుశాసన పీఠికలో పేర్కొనబడినవి.

వేదాంగములారింటిలో వ్యాకరణమొకటి. పాణినీయ వ్యాకరణమాధారముగా సంస్కృతభాషలో రచింపబడిన వ్యాఖ్యాన గ్రంథములు, ఇందన మందన కృతు లసంఖ్యాకములు.

పాణినీయ వ్యాకరణము అత్యద్భుతమేధాసంపదకు నిదర్శనమని, ప్రపంచములోని ఏభాషకు కూడ ఇంత సుసంపన్నమైన వ్యాకరణము లేదని పాశ్చాత్యభాషా తత్త్వకోవిదులభిప్రాయ పడినారు.

సంస్కృత వ్యాకరణము ప్రకారము శబ్ద నిష్పాదక వృత్తులయిదు. అవి "కృత్, తద్ధిత, సమాస, ఏకశేష, సనాద్యంతధాతు."-రూపములు. వానిలో మొదటిది కృద్వృత్తి.

"కృదతిఙ్[1]" అను పాణిని సూత్రానుసారము ధాతువులమీద విధింపబడునది, 'తిఙ్' కంటె భిన్నమైనది, అగుప్రత్యయము 'కృత్' అనబడును.

---

1. అష్టాధ్యాయి. 3-1-93

క్రియలను బోధించు మూల ప్రకృతిరూపములకు ధాతువులని పేరు. 'తిఙ్' అనునది ప్రత్యాహారము. అది క్రియావిభక్తులను బోధించును. "తి ప్తస్ఝి .. మహిఙ్[2]" అనుసూత్రములోని మొదటి వర్ణమగు 'తి' అనుదానిని, అంత్యేత్సంజ్ఞమైన 'ఙ' కారముతో చేర్చిపలుకగా 'తిఙ్' అను ప్రత్యాహారమేర్పడును. 'ఆదిరన్త్యేన సహేతా[3]" అను పాణిని సూత్రము ప్రత్యాహారస్వరూపమును ప్రతిపాదించినది.

ధాతువునకు పరముగా వచ్చు ప్రత్యయములలో తిఙ్ ప్రత్యయాలను-అనగా క్రియావిభక్తులను వదలి, తక్కినవి కృత్తులని వ్యవహరింపబడునని పైనిర్వచనముననర్థము.

రెండవది తద్ధిత వృత్తి. పాణిని తన అష్టాధ్యాయిలో "తద్ధిత" సంజ్ఞను నిర్వచింపలేదు. సుబంతశబ్దములమీద భావాద్యర్థములందు విధింపబడు ప్రత్యయములు తద్ధితములు. "తద్ధితాః" అను అధికార సూత్రమొదలు "యూనస్తిః" అను సూత్రము వరకు విధింపబడిన ప్రత్యయములు తద్ధితము లనబడును.

"తేభ్యః ప్రయోగేభ్యః హితాః తద్ధితాః" అను అన్వర్థ సంజ్ఞాలాభము కొరకు మహాసంజ్ఞాకరణము దీనివలన తద్ధితములు ప్రయోగముల ననుసరించియే వచ్చునని అర్థము లభించును." అని ఆంధ్రభాషావికానము[4]లో వ్యుత్పత్తి ప్రదర్శింపబడినది.

శ్లో "విభక్త్యాదిత్రికాదన్యః ప్రత్యయస్తద్ధితో మతః,
నామప్రకృతికోనైవ మతివ్యాప్త్యాది దోషతః ।
విభక్తి ధాత్వంశ కృద్భ్యోన్యః ప్రత్యయస్తద్ధితః
"విగ్రహ పూర్వికా తద్ధితో వృత్తిః" అని భాష్యకారుని వచనము.

---

2. అష్టాధ్యాయి. 3-4-78
3. అష్టాధ్యాయి. 1-1-71.
4. ఆం. భా. వి. పుట. 550.

1 తస్మై సమాసస్య హితః=తద్ధితః; యద్వా "తేషా పూర్వోక్తానాం నామ దీనా" మర్థాంతర ప్రకాశనేన హితః=తద్ధితః అని చంద్రకీర్తివ్యాఖ్య.

2. తేభ్యః పూర్వోక్తేభ్యః నామపదేభ్యః అర్థాంతరప్రతిపాదన శక్తిపరత్వేన హితః=తద్ధితః " అనిప్రసాదటీక.

3. తద్ధితః-పుం. వృత్తివిశేషే-తద్ధితాః ఇత్యధికార విహితప్రత్యయేషు. తేచ ద్వివిధాః. ప్రాత్యర్థ భిన్నార్థాః స్వార్థికాశ్చ తేభ్యః ప్రయోగేభ్యః హితః"

—శబ్దార్థ చింతామణి

4. తేభ్యః ధాత్రేభ్యః హితః సుకరత్వాత్, నానాపద వ్యుత్పాదకత్వాచ్చ=తద్ధితః.

ఇవి తద్ధిత శబ్దమునకు కొన్ని ప్రముఖ నిర్వచనములు.

భరతముని నాట్యశాస్త్రములోను, యస్కుని నిరుక్తములోను, వాజసనేయి ప్రాతిశాఖ్యాదులలోను తద్ధితపదము ప్రయోగింపబడినది[5]

వృత్తులైదింటిలోను మొదటి రెండు మాత్రము ప్రస్తుత పరిశోధనాంశ విషయములు కనుక వానిని మాత్రము ప్రస్తావించుట జరిగినది.

భావము—అనగా ధాత్వర్థము; సిద్ధావస్థాపన్నము, సాధ్యావస్థాపన్నము.—అని రెండు విధములు. క్రియావిభక్తులగు తిజ్ ప్రత్యయములు సాధ్యావస్థాపన్న భావమును బోధింపగా, కృత్ ప్రత్యయాలు సిద్ధావస్థాపన్న భావమును బోధించును.

లింగసంఖ్యలతో అన్వయింపనిది సాధ్యావస్థ అని, లింగసంఖ్యాన్వయము నకు తగినది సిద్ధావస్థ అని, కృత్ ప్రత్యయవాచ్యమైన భావము ద్రవ్యమువలె లింగ సంఖ్యాన్వయము కలిగి ఉండునని గ్రహింపబడెను.

---

5. (1) విభక్త్యంజనయుక్తైః—నాట్యశాస్త్రము

(2) అథ తద్ధితసమాసేషు..... నిరుక్తమ్.

(3)

"కరోతి ఇతి కృత్"-ధాతువులనుండి ప్రాతిపదికరూపములను సిద్ధము చేయునది 'కృత్' ప్రత్యయము అని వ్యుత్పత్తి విచారము.

"A dictionary of Sanskrit grammar" కృత్ పదము నీవిధముగా నిర్వచించినది.

"कृत्"-a term used in the grammars of Panini and others for affixes applied to roots to form verbal derivations. कृत् and तद्धित appear to be the ancient Pre-paninian terms used in the Nirukta and the Prati-Sakhya works in the respective senses of root-born and noun-born words. (कृदन्त and तद्धितान्त according to Paninian terminology) and not in the sense of mere affixes.

1. सन्त्यल्पप्रयोगाः कृतोऽप्यैकपदिकाः । निरुक्त I

2. अथापि भाषिकेभ्यो धातुभ्यो नैगमाः कृतो भाष्यन्ते । निरुक्त II

3. तिङ् कृत्तद्धित समासाः शब्दमयम् । वाजसनेय प्रातिशाख्यम् I

ఈ విధముగా పలురీతుల నిర్వచింపబడిన కృత్ప్రత్యయములు ధాతువులకు పరముగా, సాధారణముగా కర్తృ. కర్మ భావార్థాలతో ప్రవర్తించును. "కర్తరికృత్[6]" అనుపాణిని సూత్రానుసారము; కృత్ ప్రత్యయములు కర్త్రర్థములో వచ్చునని సామాన్యముగాచెప్పి "తయోరేవ కృత్యక్తఖలర్థాః[7]" అను విశేష సూత్రముతో కృత్ సంజ్ఞగల ప్రత్యయములు, క్త ప్రత్యయము, ఖలర్థక ప్రత్యయాలు- భావకర్మార్థములందే వచ్చునని నియమము చేయబడినది. కృత్ ప్రత్యయములలోనే కొన్నిటికి కృత్యసంజ్ఞ చెప్పబడినది. "క్త", "ఖలర్థ" ప్రత్యయాలు కూడ కృదంతర్గతములే.

---

6. అష్టాధ్యాయి. 3-4-67

7. అష్టాధ్యాయి. 3-4-70

కావున పైరెండు సూత్రములను సమన్వయముచేసిచూడగా, కృత్య, క్త, ఖలర్థక ప్రత్యయములు కృత్తులయినను, అవి భావకర్మార్థములందు చేరునని, తక్కిన కృత్తులు కర్త్రర్థములో వచ్చునని సారాంశము తేలును

ఇంతేకాక, "కృత్యల్యుటో బహుళమ్[8]" అను సూత్రములో బహుళ శబ్ద ప్రయోగమువలన కర్తృ కర్మ భావార్థములందేకాక, కరణము, అపాదానము, సంప్రదానము, అధికరణమువంటి ఇతర కారకార్థములలోగూడ ఆయా ప్రత్యయములు గోచరించుచున్నవి.

"దానీయః" అనుచోట అనీయర్ ప్రత్యయము సంప్రదానార్థములోను, "స్నానీయమ్" అనుపదములో ఆ ప్రత్యయమె కరణార్థములోను, సమావర్తనీయాది శబ్దములలో అపాదానార్థమందును, స్నానీయాదిశబ్దములందధికరణార్థములోను ప్రవర్తించుచున్నవి. అట్లే ఇతర కృత్యప్రత్యయముల విషయము కూడ గమనింపదగును.

పాణిని అష్టాధ్యాయి ప్రకారము కృత్ ప్రత్యయములు మొత్తము 110 వరకు ఉన్నవి. వీనిలో 7టికి కృత్యప్రత్యయాలని సంజ్ఞగలదు. అవి-తవ్యత్, తవ్య, అనీయర్, కేలిమర్, ణ్యత్, యత్, క్యప్ అనునవి ఇవి భావకర్మార్థములలో ధాతువులపై చేరును.

ధాతువులు అకర్మకములు. సకర్మకములని రెండువిధములు. కర్మాకాంక్ష కలిగించుక్రియను బోధించునవి సకర్మకధాతువులు; తద్భిన్నముల కర్మకములు. ఒక క్రియను గూర్చి వినగానే, 'దేనిని", "ఎవరిని" ఇత్యాదిరూపకర్మాకాంక్ష కలిగినచో ఆధాతువు సకర్మకమని గ్రహింపవలెను. తిను, చూచు, చంపు మొ అర్థముగలధాతువు లట్టివంటివి.

పైకృత్య ప్రత్యయములు అకర్మకధాతువులమీద భావార్థములోను, సకర్మకధాతువులపైన కర్మార్థములోను వచ్చిచేరును. "కర్తవ్యమ్", "కరణీయమ్" అనునవి. 'తవ్యత్', 'అనీయర్' ప్రత్యయాంతరూపములు. 'కృ' ధాతువు సకర్మకము

---

8. అష్టాధ్యాయి. 3-3-113

కనుక దానిమీద కర్మార్థములో పై ప్రత్యయములు చేరగా "కర్తవ్యమ్" కరణీయమ్' అను రూపములు నిష్పన్నములయినవి.

'క్త', 'క్తవతు' అను రెండు కృత్ ప్రత్యయములకు 'నిష్ఠా[9]' అని పాణినీయ సంజ్ఞ. కృతమ్, పఠితమ్, లిఖితమ్ మొదలగునవి క్త ప్రత్యయాంత శబ్దములు. కృతవాన్, పఠితవాన్ వంటివి క్తవతు ప్రత్యయాంతాలు. క్త ప్రత్యయము 'తయోరేవ' అను సూత్ర నియమమువలన భావకర్మార్థములందురాగా, క్తవతు ప్రత్యయము కర్త్రర్థములో ప్రవర్తించును. 'గ్రామం గతః' వంటి కొన్ని ప్రయోగములలో క్త ప్రత్యయము కర్త్రర్థమును బోధించుటకూడ కలదు.

ఈ క్త ప్రత్యయములో కకారము ఇత్సంజ్ఞవలన లోపించగా 'త' అను భాగముమాత్రము మిగులును. కొన్ని ధాతువులమీద ఈ నిష్ఠాతకారము రూపాంతరము పొందుటకలదు

పచ్ ధాతువు మీద క్త ప్రత్యయముచేరి పచ్ + త = పక్వ అని వకారము గాను, శుష్ + త = శుష్క అనుచోట కకారముగాను గ్లా + త = గ్లాన అను శబ్దములో నకారముగాను, నిష్ఠాతకారము మార్పు చెందినది భిన్నః, జీర్ణః మొ॥ శబ్దాలు కూడ రూపాంతరముచెందిన క్త ప్రత్యయాంతరూపములే.

శతృ శానచ్ ప్రత్యయములు రెండింటికి కలిపి 'సత్[10]' అన సంజ్ఞ పాణిని చేత విధింపబడినది. ఇవి వర్తమానార్థములో, ధాతువుమీది లట్ స్థానములో ఆదేశములుగా వచ్చును. పరస్మైపది ధాతువులమీద 'శతృ' ప్రత్యయము, ఆత్మనేపది ధాతువులమీద 'శానచ్' ప్రత్యయము వచ్చును.

ధాతువులు పరస్మైపదులని ఆత్మనేపదులని, వానిమీదచేరు తిఙ్ ప్రత్యయములను బట్టి రెండు విధములు ఈ రెండు రకముల ప్రత్యయములు చేరిన ధాతువులను ఉభయపదములందురు. అటువంటి ధాతువులపై శతృ, శానచ్ ప్రత్యయములు రెండుకూడ చేరును. గచ్ఛత్, పచత్, దీవ్యత్, మొదలగునవి శతృప్రత్యయాంతములు. పచమానః, శయానః, రమమాణః, వంటివి శానచ్ ప్రత్యయాంతరూపములు.

---

9 అష్టాధ్యాయి. 1·1-26

10 తౌ సత్. అష్టాధ్యాయి. 3-2-127

"కానచ్, క్వసు" అను రెండు ప్రత్యయాలు కూడ లకారస్థానములో ఆదేశముగా వచ్చును.

ప్రత్యయములలో ఆదివర్ణాలైన ల, శ, క వర్ణాక్షరములు, చవర్గ, టవర్గాక్షరములు ఇత్సంజ్ఞను పొందును. తద్ధిత ప్రత్యయాలకు మాత్రము ల, శ, క వర్ణలు ఇత్తులుకావు[11]. ప్రత్యయాంతమందలి పొల్లు హల్లు ఏదైనను ఇత్సంజ్ఞకమగును[12]. ఈ ఇత్సంజ్ఞకల వర్ణాలు లోపించుటవలన లక్ష్యాలలో కన్పించవు. ఆయా వర్ణముల నిత్సంజ్ఞకములుగా అనుబంధించి చెప్పుటవలన ఇతరప్రయోజనములు సిద్ధించును. గుణము, వృద్ధి, ఉపధా దీర్ఘమువంటివి ఆప్రయోజనములు.

సర్వలోపికృత్ ప్రత్యయాలు ఏడున్నవి. అవి–క్విప్, క్విన్, విట్, విచ్, ణ్వి, లిట్, లోట్, అనునవి. ఈ ప్రత్యయములలోని వర్ణములన్నియు లోపించి ప్రకృతిభూతమగు ధాతువు మాత్రము మిగులును.

ప్రత్యయాదులలో మొదట పఠింపబడి, తరువాత లక్ష్యములలో కన్పించక ఉండపోవువర్ణములకు 'ఇత్' అను సంజ్ఞను పాణిని విధించినాడు. "తస్య లోపః[13]" అను సూత్రముద్వారా ఇత్సంజ్ఞకవర్ణాలకు లోపము చెప్పబడినది.

పై సర్వలోపి ప్రత్యయములలోని వర్ణములన్నింటికి ఆయా సూత్రముల ద్వారా ఇత్సంజ్ఞ కలిగి లోపించుటవలన ప్రకృతి మాత్రము శేషించినప్పటికి కృదంతములుగా పరిగణింప బడుచున్నవి. తెలుగు భాషలో ఇటువంటి రూపములు చదువు, తిట్టు, ఉబ్బు, పొంగు, వంటి వానిని ఎక్కువగా మనము చూడగలము.

ప్రత్యయమువచ్చి లోపించినను, ప్రత్యయాంతముగా వ్యవహరించుట వ్యాకరణ సంప్రదాయము. ప్రాతిపదికత్వ, పదత్వ సిద్ధికొరకు ఆయా ప్రత్యయములుచేరి లోపించినవని చెప్పవలసి ఉండును. కృత్ ప్రత్యయాంతమైనగాని ప్రాతిపదికత్వము

---

11. లశక్వతద్ధితే అ. 1-3-8
12. హలన్త్యమ్ అ. 1-3-3
13. అష్టాధ్యాయి. 1-3-9

రాదు. కేవల ధాతువు ప్రాతిపదికము కాదు. కనుక దానిమీద సుప్ విభక్తులు చేరవు. రాట్, జలముచ్, తనుత్యజ్, దివిషద్ మొదలగు శబ్దములలో ప్రకృతి మాత్రము శేషించినప్పటికి సుబంతత్వము చెప్పటవలన పదత్వము సిద్ధించును.

కృత్ ప్రత్యయములు కొన్ని ఆయా శబ్దముల లింగవ్యవస్థకు కారణములగు చున్నవి. "ఘఞ్, అచ్, అప్" ప్రత్యయాంతములైన శబ్దములు పుంలింగములో ఉండును. భావార్థక 'క్త' ప్రత్యయము, 'ల్యుట్' ప్రత్యయము చేరిన శబ్దాలు నియతముగా నపుంసక లింగములుగను, 'క్తిన్, క్యప్, శ' ప్రత్యయాంతాలు నియత స్త్రీ లింగములుగాను ఉండునని లింగానుశాసనము చెప్పుచున్నది.

ఈ లింగానుశాసనము పాణిని విరచితమని చెప్పి భట్టోజీ దీక్షితుడు తన సిద్ధాంత కౌముదిలో దానిని చేర్చి వృత్తిని గూడ రచించినాడు. లింగానుశాసనము భాషలోని శబ్దములకు సాధారణముగా ప్రత్యయమూలకముగాను, సమాసాది నిమిత్తముగాను లింగవ్యవస్థను తెలిపినది కొన్ని ద్విలింగములు. త్రిలింగములు అగు శబ్దములను కూడ ఇది ప్రతిపాదించినది. "యాఙ్ఞా స్త్రియామ్" "అభ్రం నపుంసకమ్" "శంకుః పుంసి" మొదలగు సూత్రములద్వారా చాలావరకు ఆయా శబ్దములను పేర్కొని లింగవిధానము చేయబడినది. మొత్తముమీద లింగము లోక వ్యవహారమాత్రాధీనమని భాష్యకారుడు పతంజలి "లింగమశిష్యం లోకాశ్రయత్వాల్లింగస్య" అని చెప్పినాడు.

కృత్ ప్రత్యయములు చేరినప్పుడు వాని ప్రకృతులైన ధాతువులలోను, ప్రత్యయములలోను ఎన్నోమార్పులు కలుగుచున్నవి. కొన్ని ప్రత్యయములు పరమగునపుడు ధాతువు చివరనున్న ఇ, ఉ, ఋ వర్ణములకు గుణము ఆదేశమగును. 'అ, ఏ, ఓ' వర్ణములకు 'గుణ' మని పాణినీయ సంజ్ఞ[14], 'జి' ధాతువుమీద అచ్ ప్రత్యయము చేరినపుడు ధాత్వంతమగు ఇకారమునకు గుణము (ఏకారము) వచ్చి జే + అ = జయ అను ప్రాతిపదిక మేర్పడును. ఇ కారమునకు ఏ కారము, ఉ కారమునకు ఓ కారము, ఋ కారమునకు అర్ అనునది స్థాన సామ్యమునుబట్టి గుణాదేశములుగా వచ్చును.

---

14. అదేఙ్గుణః. అ. 1-1-2

లఘూపధ ధాతువులలోని ఉపధాక్షరములైన ఇ, ఉ, ఋ లకు గూడ గుణమాదేశమగును. 'ఉపధ' అనగా అంత్యవర్ణమునకు పూర్వవర్ణము. లఘువైన ఇ, ఉ, ఋ వర్ణము ఉపధగా కలిగియున్న ధాతువు లఘూపధము.

భుజ్ ధాతువులో ఉకారము ఉపధాక్షరము. అది లఘువు కనుక ధాతువు లఘూపధము. దానిమీద 'ణ్యత్' ప్రత్యయము చేరినప్పుడు ఉకారమునకు గుణము రాగా "భోజ్యమ్" అను శబ్దము నిష్పన్నమగుచున్నది.

కొన్ని అజంత ధాతువుల చివరి వర్ణమునకు వృద్ధికూడ వచ్చును. 'వృద్ధి' అనగా 'ఆ, ఐ, ఔ' వర్ణములు. కృత్ ప్రత్యయములో ఞ కారము కాని, ణ కారము కాని ఇత్తుగా ఉన్నప్పుడే వృద్ధి జరుగుచున్నది. 'కృ' ధాతువుపై కర్మార్థములో 'ణ్యత్' ప్రత్యయము చేరగా ధాత్వంతమైన ఋకారమునకు 'ఆర్' అనునది వృద్ధిగావచ్చి కార్య శబ్దమేర్పడును. హార, కారక, నాయకాది శబ్దములుకూడ ఇటువంటి వృద్ధివలన నిష్పన్నమైనవే.

అకారోపధ ధాతువులకు గూడ వృద్ధివచ్చి భాగః, నాశః, తాపః, మొ రూపములు కలుగుచున్నవి. ఇవి భజ్, నశ్ తప్ అను ధాతువుల నుండి పుట్టినవి. ఞ, ణ కారము అప్వర్ణములుగా ఉన్న ప్రత్యయములు పరమైనప్పుడే ఈ వృద్ధి కలుగుచున్నది.

ధాతువుల అంతమందున్న అనునాసికాక్షరము, 'క్త' మొ ప్రత్యయములకు ముందు లోపించును. నమ్ + త = నత; మన్ + త = మత, గమ్ + త = గత; ఇత్యాది రీతిలో శబ్దములు ఏర్పడుచున్నవి. 'క్త' ప్రత్యయములో కకారము ఇత్సంజ్ఞచే లోపింపగా 'త' మాత్రము నిలుచును.

అజాది ప్రత్యయములు పరమగునప్పుడు అనునాసికాక్షరములు లోపించవు. గమ్ + అనమ్ = గమనమ్, మన్ + అ > మాన్ + అ = మానః ఇత్యాదులను లక్ష్యములుగా గమనింపవచ్చును.

ధాతువుల అంతమందున్న చవర్గాక్షరములకు కవర్గాక్షరములాదేశము లగుట కృత్ ప్రక్రియలోని మరొవిశేషము. 'భుజ్' ధాతువునుండి భోగః, రంజ్ ధాతువునుండి రాగః పచ్ ధాతువునుండి పాకః మొ చోట్ల పైమార్పును చూడవచ్చును. పైరూపములలో చ, జ,ల స్థానములో కకారగకారము లాదేశములైనవి.

ఇంతవరకు ప్రకృతిలో కలిగిన మార్పులను మనము పరిశీలించినాము. ఇక ప్రత్యయభాగములో కలుగు మార్పులను గూడ గమనింతము.

ప్రత్యయ భాగాలైన 'యు, వు' అనువానికి క్రమముగా 'అన, అక, అను నవి ఆదేశములగును. ల్యుట్, ణ్వుల్ ప్రత్యయాలలో ఇత్సంజ్ఞకవర్ణాలు పోగా యు, వు అనుభాగాలే మిగులుచున్నవి. 'గమ్' ధాతువుమీద భావార్థములో ల్యుట్ ప్రత్యయము చేరి దానిలో శేషించిన 'యు' స్థానమున 'అన' ఆదేశముకాగా గమ్+అన='గమన' శబ్దమేర్పడుచున్నది. అట్లే 'పూ' ధాతువుపై కర్త్రర్థములో ణ్వుల్ ప్రత్యయము వచ్చి నప్పుడు దానిలోని 'వు' స్థానమున 'అక' ఆదేశముకాగా పూ+అక>పౌ+అక= 'పావక' శబ్దము నిష్పన్నమగుచున్నది.

నిష్ఠాసంజ్ఞ గల క్త, క్తవతు ప్రత్యయములలోని తకారము భిన్నస్థలాలలో వేరువేరు మార్పులను పొందుచున్నది. పచ్ధాతువుమీది నిష్ఠాతకారము వకారముగా మారి పక్వశబ్దమేర్పడుట చెప్పబడినది. అదేవిధముగా శుష్ధాతువుమీది దానికి కకారము, ఛిద్ ధాతువునకు పరమైనప్పుడు నకారము. క్షైధాతువుమీద చేరినప్పుడు మకారము ఆదేశమగుచున్నవి. పచ్ధాతువులోని చకారమునకు కకారాదేశము. క్షైధాతువులోని ఐకారమునకు ఆకారాదేశము ప్రకృతిగతవికారములు.

కృత్యప్రత్యయములలోని 'తవ్యత్, తవ్య' అను రెండు ప్రత్యయములు భిన్నములైనప్పటికి, వానివలన నిష్పన్నములగు శబ్దములు సమానములుగనే ఉండును. తవ్యత్ప్రత్యయములోని చివరి తకారము ఇత్సంజ్ఞవలన లోపించగా 'తవ్య' అనునది మాత్రమే లక్ష్యములలో కనిపించును. 'కృ' ధాతువు మీద 'తవ్యత్' తవ్య ప్రత్యయములలో ఏది చేరినను 'కర్తవ్యమ్' అనురూపమే కలుగుచున్నది.

అయితే రెండు ప్రత్యయములు ప్రత్యేకముగా ఎందుకు చెప్పబడినవను ప్రశ్న కలుగును. వైదికభాషలో తవ్యత్ ప్రత్యయానికి, తవ్యప్రత్యయానికి స్వరభేదము కలుగును. 'తవ్యత్' ప్రత్యయము తకారము ఇత్తుగా కలది కనుక తిత్ స్వరము[15] స్వరితము కలుగును. తవ్యప్రత్యయము 'తిత్' కాదు కనుక ఆ స్వరమురాదు.

ఈ స్వరభేదము వేదభాషకు మాత్రము పరిమితము. అయినను పాణిని చాలావరకు వైదిక లౌకిక భాష సాధారణముగా సూత్రములను రచించినాడు కనుక, ఆ ప్రయోజనము కొరకే రెండు భిన్నప్రత్యయములను చెప్పినాడు. అష్టాధ్యాయిలో వేదభాషకే సంబంధించిన వ్యాకరణాంశాలు కూడ సూత్రబద్ధమైయున్నవి.

'ణ్యత్, యత్, క్యప్' అను మూడు ప్రత్యయములలోను 'య' మాత్రము శేషించి లక్ష్యములలో గోచరించును. కాని ఇత్సంజ్ఞల 'ణ్యత్' లోని ణ కారము, 'క్యప్' లోని కకారము కూడ తమ ప్రత్యేక ప్రయోజనములను కలిగి ఉన్నవి. 'ణ్యత్' లోని ణకారము వృద్ధిని కలిగింపగా 'క్యప్' లోని కకారము గుణనిషేధమునకు కారణమగుచున్నది.

'ధాతోః'[16] అను అధికారమువలన కృత్తులు ధాతువులమీదనే వచ్చుట సహజము. కాని 'వర్ణాత్కారః', 'రాదిఫః', 'మత్వర్థాచ్ఛః' అనుసూత్రములద్వారా కార, ఇఫ, ఛప్రత్యయములు ధాతుభిన్న ప్రకృతులమీద చేయుచున్నవి. అకారః, ఇకారః వంటి చోట్ల వర్ణ వాచక శబ్దాల మీద కారప్రత్యయము, రేఫశబ్దములో ఇఫ ప్రత్యయము, 'మత్వర్థ' శబ్దము మీద 'ఛ' ప్రత్యయము చేయగా మత్వర్థీయః అను శబ్దమేర్పడుచున్నది. నిజముగా వీనిని కృదంత ప్రకరణములో చేర్చవలసినది కాదు. 'ఛ' ప్రత్యయము తద్ధితప్రకరణములో చెప్పదగినది

---

15 తిత్ స్వరితమ్ అ. 6-1-185

16. అ. అ. 3-1-91

కృత్తులలో కొన్ని, ప్రత్యేక ధాతువులను పేర్కొని విధింపబడినవి కాగా, సర్వధాతు సాధారణముగా వర్తించు ప్రత్యయములే ఎక్కువగా ఉన్నవి. అయినను భాషలో మహాకవి ప్రయోగములను బట్టి ఆయా కృదంతరూపాలను స్వీకరింప వలసి ఉండును.

ధాతువులమీద భిన్నార్థాలలో వివిధ ప్రత్యయాలు విధింపబడినప్పటికి, అన్ని ధాతువులమీద అన్ని ప్రత్యయములు వచ్చిన రూపములు భాషలో కన్పించవు కర్తృ, కర్మ భావార్థాలలో నిర్దేశింపబడిన ప్రత్యయాలు ఇతరార్థాలలో కూడ కన్పించుచున్నవి. కొన్ని ధాతువుల మీద కొన్ని కృదంతరూపాలు కవిప్రయుక్తములుగా లేవు.

ఒక ధాతువుమీదనే, ఒక అర్థములోనే, అనేక ప్రత్యయములుకూడ చేరుట కలదు 'వచ్' ధాతువుమీద కర్త్రర్థములో 'ణ్వుల్' ప్రత్యయము వచ్చినపుడు 'వాచకః' అనియు, అదే అర్థములో 'తృచ్' ప్రత్యయము చేరుట వలన 'వక్తృ' శబ్దము ఏర్పడుచున్నవి.

అంతేకాక ఒక ప్రత్యయమే ఒక ధాతువుపై ఒక అర్థములోను, వేరొక ధాతువు మీద ఇతరార్థములోను వచ్చుటకూడ కలదు. ఎట్లనగా 'క్త' ప్రత్యయము సాధారణముగా కర్మార్థములో చేరును. కాని స్నాతానులిప్తః, గ్రామగతః వంటి పదాలలో క్త ప్రత్యయము కర్త్రర్థమును బోధించుట గమనింపవచ్చును. ఇట్లే కృత్ ప్రత్యయములలో ఎన్నో విచిత్రములు కలవు.

సంస్కృత వ్యాకరణములో నామ నిష్పాదకములు కాని కృత్తులు కూడ చాల ఉన్నవి. వానిలో అసమాపక క్రియార్థాన్ని బోధించు 'క్త్వ' ప్రత్యయము, తుమున్, శతృ, కానచ్, శానన్, చానశ్, ణముల్, ఖముఞ్ వంటి ప్రత్యయములు అంతమందుగల శబ్దములు అవ్యయములుగా పరిగణింపబడుచున్నవి- కృత్వా, గత్వా మొదలగునవి క్త్వ ప్రత్యయాంత శబ్దాలు. సమాన కర్తృకములైన రెండు క్రియలలో మొదట జరిగిన క్రియను బోధించు ధాతువుమీద క్త్వా ప్రత్యయము వచ్చునని పాణిని సూత్రించినాడు [17]

17. సమాన కర్తృకయోః పూర్వకాలే 3-4-21 అష్టాధ్యాయి.

క్రియార్థమైన వేరొక క్రియ ఉపపదముగా నుండగా ధాతువుపై తుమున్ ప్రత్యయము వచ్చును. కర్తుమ్, భోక్తుమ్, గన్తుమ్ మొద తుమున్ ప్రత్యయాంతములు. భోక్తుం ఇచ్ఛతి అనగా భుజించుటకు కోరుచున్నాడని అర్థము. ఇక్కడ రెండు క్రియలున్నవి. తినుట, కోరుట, అనునవి. కోరు క్రియ తినుటకు ఉద్దేశింపబడినది కనుక అది క్రియార్థమైన క్రియ. అది ఉపపదముగానున్నందున భుజ్ ధాతువుపై తుమున్ ప్రత్యయము వచ్చి 'భోక్తుమ్' అనురూపమేర్పడినది.

శతృ, శానచ్ ప్రత్యయాంత శబ్దములు అవ్యయములు కావు.కాని అవి క్రియా జన్యవిశేషములుగానే ఉండును స్వతంత్రముగా నామపదములని చెప్పదగినవి కావు.

'ణముల్' ప్రత్యయము అభీక్ష్ణ్యార్థములో విధింపబడినది. ఆభీక్ష్ణ్యమనగా పౌనఃపున్యము. అనగా క్రియ మాటిమాటికి జరుగుట అని అర్థము. ఈ 'ణముల్' చేరినప్పుడు ప్రకృతిభూతధాతువు ద్విత్వమును పొందును. స్మారం స్మారం, శ్రావం శ్రావమ్ మొదలగునవి ఉదాహరణములు. తలచి తలచి, విని విని అను పై మాటలు పౌనః పున్యార్థమును బోధించుచుండును.

ఇతరార్థములో కూడ 'ణముల్' ప్రత్యయము కొన్నిచోట్ల వచ్చును. అప్పుడు ధాతు ద్విత్వము రాదు. స్వాదుంకారమ్, అగ్రే భోజమ్ వంటి రూపములుండును. 'ణముల్' ప్రత్యయాంతరూపములు కూడ ణమురంతములవలెనే ఉండును. కాని 'క్త్వా' ప్రయోజనములుండవు.

ఈ విధముగా పైన తెలిపిన 'క్త్వా, తుమున్' మొదలైన ప్రత్యయములంతమందున్న శబ్దాలు కూడ ధాత్వధికారములో చెప్పబడినందున పాణిని నిర్వచనము ననుసరించి కృదంతములే అగుచున్నవి అయినను అవి అవ్యయములుగాను, విశేషణములుగాను ఉన్నందున వానిని నామములుగా పరిగణించవలేము. అవ్యయములుగా రూపొందు కృదంతములమీద గూడ పదత్వ సిద్ధి కొరకు సుప్ ప్రత్యయములు చేరి తరువాత లోపమును పొందుచున్నవి. "కృత్తద్ధిత సమాసాశ్చ" అను పాణిని సూత్రము చేత కృదంతములకు ప్రాతిపదిక సంజ్ఞ చెప్పబడినది గాన వానిమీద సుప్పులు చేరును.

కత్వ, కానచ్ మొదలగు ప్రత్యయములు చేరిన శబ్దములు విశేషణములుగా రూపొందుచున్నవి

పాణిని తాను స్వయముగా చెప్పిన కృత్తులనే కాక శాకటాయన ప్రణీతము లైన ఉణాది ప్రత్యయాలను కూడ 'ఉణాదయో బహుళమ్' [18] అను సూత్రముద్వారా ఆమోదించినాడు. ఈ ఉణాది ప్రత్యయములు 5 పాదములలో ప్రతిపాదింపబడి యున్నవి.

పాణినిచేత సాధింపబడని ఎన్నో రూపాలు సాధు, ఇష్టు రిష, అఙ్కుర, మరుత్, తరఙ్గ, విప్ర, వత్సర, వేతన, తనయ, ఈశ్వరాదులు-ఉణాది ప్రత్యయములచే సాధింపబడినవి అందువలన వీనిని కృత్ ప్రత్యయములుగానే భావింపవలసి యుండును. కనుకనే భట్టోజీ దీక్షితుడు సిద్ధాన్త కౌముదిలో, పూర్వోత్తర కృదంత ప్రకరణములకు మధ్యభాగములో ఉణాదులను చేర్చిచెప్పినాడు.

ఉణ్ మొదలగు ప్రత్యయాలు వర్తమానార్థములో, సంజ్ఞయందును బహుళ ముగా వచ్చునని పాణిని ఒక్కసూత్రముతో వీని నన్నింటిని స్వీకరించినాడు.

భోజుని సరస్వతీ కంఠాభరణములో అలంకార, రసాది విషయాలతోపాటు వ్యాకరణాంశములుకూడ విస్తృతముగా ప్రతిపాదింపబడినవి. సూత్రరచన చాల వరకు పాణినీయమును పోలి ఉన్నది. కొన్ని సూత్రములు పూర్తిగా నరూపములుగా ఉన్నవి.

ప్రథమాధ్యాయము మూడవ, నాల్గవ పాదములలో కృత్తులు నిరూపింప బడినవి. తవ్యప్రత్యయమునుండి 'టప్' కు పూర్వమువరకు కృత్తులని మొదట చెప్ప బడినది.

వాస్తవ్య, ప్రవచనీయ, ఉపస్థానీయ, రమణీయాది శబ్దములు అనీయర్ ప్రత్యయాంతములుగా నిపతింపబడినవి. అనీయర్ ప్రత్యయము ప్రవచనీయాది

18. అష్టాధ్యాయి 3-3-1

శబ్దములందు కర్త్రర్థములోను, స్నానీయాదులందు కరణార్థములోను, దానీయాదులలో సంప్రదానార్థమునందును, ఇట్లే అపాదానాధికరణార్థములందు మరికొన్నిచోట్ల ప్రవర్తించునని సరస్వతీ కంఠాభరణము చెప్పుచున్నది.

దీనిలో చాలవరకు పాణిని చెప్పిన కృత్ప్రత్యయములే ప్రతిపాదింపబడినవి. పెక్కు శబ్దములు నిపాతములుగా చూపబడినవి.

రెండవ అధ్యాయము పూర్తిగా ఉణాది ప్రక్రియను నిరూపించుచున్నది

అచ్చముగా పాణిని సూత్రములను పోలియున్న కొన్ని కృత్ప్రకరణ సూత్రములను చూపుచున్నాను.

| | పాణిని అష్టా. | స. కంఠా. |
|---|---|---|
| 1. పోరదుపధాత్. | 3-1-98 | 1-3-139 |
| 2 వహ్యం కరణమ్ | 3- - 02 | 1-3-144 |
| 3. అర్యః స్వామివైశ్యయోః | 3-1-103 | 1-3-145 |
| 4. ఉపసర్యా కాల్యా ప్రజనే | 3-1-.04 | 1-3-146 |
| 5. చరేష్టః | 3-2-16 | 1-4-26 |

ఇదికాక ఇంకను ఎన్నియో సరూపసూత్రములను సరస్వతీకంఠాభరణములో చూడగలము.

కృత్తులమధ్యలో లట్, లిట్, లఙ్, లుఙ్, లృట్ మొదలగు లకారములు కూడ ప్రతిపాదింపబడినవి. కాని ఇవి ధాతువులమీద వర్తమానాది కాలములను, విధి, ప్రార్థన, ఆశీస్సు మొదలగు అర్థవిశేషములను బోధించునవే కాని కృత్ ప్రత్యయములుగా పేర్కొన దగినవి కావు.

## తద్ధితవృత్తి :-

నామవాచక, సర్వనామ, విశేషణాలమీద, అపత్య, భావ, సమూహ మత్వర్థాదులలో వచ్చు ప్రత్యయములు తద్ధితములనబడును. పాణిని ఈ సంజ్ఞను నిర్వచింపలేదు.

శబ్దార్థచింతామణిలో తద్ధిత నిర్వచన మీరీతిగా చేయబడినది.

"తద్ధితః-పుం. వృత్తివిశేషే. "తద్ధితాః" ఇత్యధికార విహిత ప్రత్యయేషు. తే చ ద్వివిధాః ప్రకృత్యర్థ భిన్నార్థాః, స్వార్థికాశ్చ తేభ్యః ప్రయోగేభ్యః హితః".

"తద్ధితములు ప్రకృత్యర్థభిన్నార్థములని, స్వార్థములని రెండు విధములు. ఈ రెండువిధముల ప్రయోగములకు హితమైనది తద్ధితవృత్తి అని పై వాక్యముల సారాంశము.

" A dictionary of Sanskrit grammar " లో తద్ధితస్వరూప మిట్లు వివరింపబడినది.

"तद्धित – A term of ancient Pre-paninian grammarians used by Panini; Just like सर्वनामन् or अव्यय without giving any specific definition of it. The term occurs in the Nirukta of Yaska and the Vajasaneyi Pratisakhya ; of : अथ तद्धितसमासेषु एकपर्वसु चानेकपर्वसु पूर्वपूर्वमपरमपरं प्रविभज्य निर्ब्रूयात् । दण्ड्य. पुरुष दण्डमर्हतीति वा दण्डेन सम्पद्यते इति वा । निरुक्त II –2

Also of :– " तिङ्कृत्तद्धितचतुष्टय समासाः शब्दमयम्"
वाजसनेयप्रातिशाख्यम् I-27

ఈ గ్రంథములోనే "తద్ధిత" సంజ్ఞను ప్రాచీనవైయాకరణులు 'యత్' మొదలగు ప్రత్యయము లంతమందుగల సముదాయపరముగా వాడినారనియు, పాణిని మాత్రము ప్రత్యయపరముగానే తద్ధిత సంజ్ఞను ప్రయోగించినాడ"ని తెలుపబడినది.

పాణిని అష్టాధ్యాయిలో తద్ధిత ప్రత్యయాలు అనంఖ్యాకముగా చెప్పబడినవి. భట్టోజీదీక్షితుడు తన సిద్ధాంతకౌముదిలో తద్ధితప్రకరణములో 16 అవాంతర ప్రకరణములను కల్పించినాడు.

1. అపత్యాధికారము.
2. రక్తాద్యర్థక ప్రకరణము.

3. చాతురర్థిక ప్రకరణము
4. శైషిక ప్రకరణము
5. ప్రాగ్దీవ్యతీయ ప్రకరణము
6. ఠగధికార ప్రకరణము
7. ప్రాగ్ఘితీయ ప్రకరణము
8. ఛయదధికారము
9. ఆర్హీయ ప్రకరణము
10. కాలాధికారము
11. ఠఞధికారము
12. భావకర్మార్థ ప్రకరణము
13. పాంచమిక ప్రకరణము
14. మత్వర్థీయ ప్రకరణము
15. ప్రాగ్దిశీయ ప్రకరణము
16. స్వార్థిక ప్రకరణము

ఈ ఉపవిభాగములలో ఒక్కొక్క దానియందు అనేకార్థాలలో ప్రత్యయములు విధింపబడినవి. తెలుగు వ్యాకరణములలో తద్ధిత ప్రక్రియ చాల స్వల్పముగా ఉండగా, సంస్కృతములో మాత్రము అది బహువిస్తృతముగానున్నది.

పాణిని అష్టాధ్యాయి ప్రకారము 200 కు పైగా తద్ధిత ప్రత్యయములున్నవి సమాసాంత ప్రత్యయాలను గూడ తద్ధితాధికారములో పఠించుటవలన, అవి కూడ తద్ధిత సంజ్ఞ కలిగి ఉండును.

ఇత్సంజ్ఞా వర్ణాలలో కృత్తులకు, తద్ధితాలకు భేదమున్నది. ల, శ, క వర్ణాక్షరములు ఆదిలో ఉన్నట్లైతే కృత్తులలో ఇత్తులగుచుండగా, తద్ధితములలో ఆ సంజ్ఞ కలుగదు.

ఏ ప్రత్యయమైనా ప్రకృతికి పరమగావచ్చుట సామాన్యము. కాని తద్ధిత ప్రత్యయములలో కొన్ని విశేషము లున్నవి.

'బహుచ్' అను ప్రత్యయము తక్కినవానికంటె భిన్నముగా ప్రకృతికి పూర్వ భాగమున చేరుచున్నది. ఈషదూనః, పటుః అను అర్థములో పటు శబ్దానికి ముందు భాగములో 'బహుచ్' ప్రత్యయమున వచ్చి 'బహుపటుః' అనురూపమేర్పడు చున్నది. తద్ధిత ప్రత్యయము లన్నిటిలో ముందుభాగమున చేరు ప్రత్యయమిది ఒక్కటే.

ఇదే విధముగా 'అకచ్' ప్రత్యయము పరముగా చేరక ప్రకృతి మధ్య భాగములో చేరుచున్నది అవ్యయములకు, సర్వనామశబ్దములకు వచ్చే యీ ప్రత్యయము ఆ శబ్దములోని 'టి' భాగమునకు పూర్వము చేరును. అజంత శబ్దములలో చివరి అచ్చునకు, హలంత శబ్దములలో చివరి హల్లుతోగూడిన పూర్వాచ్చునకు 'టి' అను సంజ్ఞ వ్యాకరణ ప్రసిద్ధము అనగా- రామ, హరి మొ శబ్దాలలో వాని చివరి అచ్చులైన 'అ, ఇ' లు 'టి' సంజ్ఞకాలు. రాజన్, మనస్ వంటి హలంత శబ్దాలలో అన్, అస్ అనునవి 'టి' అనబడును.

'ఉచ్చైస్' అనునది ఒక అవ్యయము. దీనికి 'అకచ్' ప్రత్యయము చేరునప్పుడు, దీనిలోని 'టి' సంజ్ఞకమైన 'ఐస్' కంటె ముందువచ్చి 'ఉచ్చ్ + అక + ఐస్ = ఉచ్చకైస్ > ఉచ్చకైః అను రూపము కలుగుచున్నది. సర్వనామ శబ్దమైన సర్వ శబ్దమునకు 'అకచ్' చేరగా, 'సర్వ్ + అక + అ = సర్వక' అను శబ్దము నిష్పన్నమగుచున్నది. ఈ బహుచ్, అకచ్ ప్రత్యయాలుకాక తక్కిన తద్ధితాలన్నీ పరముగా వచ్చునవే.

తద్ధిత ప్రత్యయములు చేరినపుడు సాధారణముగా ప్రకృతి భాగానికి ఆదివృద్ధి కలుగుచుండును. ఆదివృద్ధి అనగా ఆశబ్దములోని మొదటి అచ్చునకు వృద్ధివచ్చుట. 'ఆ, ఐ, ఔ,' లకు వ్యాకరణములో వృద్ధి సంజ్ఞకలదని ముందే చెప్పుకున్నాము- మొదటి అచ్చు అకారమైన ఆకారము, ఇవర్ణమైన యెడల ఐకారము, ఉ, ఋ వర్ణములైనచో ఔ, ఆర్ అనునవిఆదివృద్ధిగా వచ్చును.

పరమందున్న తద్ధిత ప్రత్యయములో క, ఞ, ణ వర్ణాలు ఇత్సంజ్ఞ కలిగి యున్నపుడే ఆది వృద్ధి జరుగుచున్నది. దశరథ శబ్దముపైన ఇఞ్ ప్రత్యయము చేరగా

ఆదివృద్ధి వలన 'దాశరథి' అనుశబ్దము, దితి శబ్దముమీద 'ణ్య' ప్రత్యయము చేరినప్పుడు 'దైత్య' శబ్దము, 'వినతా' శబ్దముపై 'ఢక్' ప్రత్యయము వచ్చినప్పుడు ఆదివృద్ధివలన 'వైనతేయ' శబ్దము నిష్పన్నము అగుచున్నవి పై మూడు ప్రత్యయములలో క్రమముగా ఞ, ణ, క కారములు ఇత్సంజ్ఞాకములై ఉన్నవి. మన నిత్యవ్యవహారములో ఆది వృద్ధితో కూడిన తద్ధితాంత పదములనేకములుగా ఉన్నవి. గౌరవమ్, ప్రాముఖ్యమ్, వైజ్ఞానికమ్, ధార్మికః, ఇత్యాదులు

ఆదివృద్ధిని కలిగించని తద్ధిత ప్రత్యయములుకూడ కొన్ని ఉన్నవి. యత్, మతుప్, తసిల్, త్వ, తల్, తరప్, తమప్ వంటి ప్రత్యయాలు పరమగునప్పుడాయా శబ్దాలకు ఆదివృద్ధిరాదు. ఎందుకనగా వృద్ధికి నిమిత్తములైన క, ఞ, ణ వర్ణము లా ప్రత్యయములలో లేవు. అందువలన పయస్ శబ్దముపై 'యత్' ప్రత్యయముచేరి 'పయస్యమ్' అని ఆది వృద్ధి రహితరూపమే కలుగుచున్నది. ఇట్లే ధీమాన్, గురుత్వమ్, లఘుతరః సర్వతః మొదలగు మతుబాద్యంతశబ్దాలు ఆదివృద్ధి రహితాలుగానే ఉన్నవి.

ఒకే అర్థములోనే, ఒక శబ్దము మీద అనేక తద్ధిత ప్రత్యయములు వచ్చుట కూడ కలదు. ఈ లక్షణము కృత్ ప్రత్యయములలో మనము గమనించి ఉన్నాము.

భావార్థములో త్వ, తల్ ప్రత్యయములతో పాటు ష్యఞ్ మొదలగు ప్రత్యయములు కూడ వచ్చి బ్రాహ్మణత్వమ్, బ్రాహ్మణతా, బ్రాహ్మణ్యమ్, అను భిన్న రూపాలేర్పడుచున్నవి. గో శబ్దముమీద వికారార్థములో యత్, మయట్ ప్రత్యయములుచేరి గవ్యమ్ అను రూపములు కలుగుచున్నవి.

అదే విధంగా ఒక ప్రత్యయము అనేక భిన్నార్థములలో వేర్వేరు శబ్దములపై చేరుటను మనము గమనింపవచ్చును. 'అణ్' ప్రత్యయము-అపత్యము, దేవత, సంబంధించినది, భావము, రంగువేయబడినది, ప్రణీతమైనది, కనుగొనబడినది, మొదలగు పెక్కు అర్థాలలో కనబడుచున్నది. 'వాసిష్ఠః' అనుచోట అపత్యార్థమును, 'ఐన్ద్రమ్' అను పదములో దేవతార్థమును, 'కాషాయమ్' అనుచోట రంగువేయబడినది అను అర్థమును 'అణ్' ప్రత్యయము తెలుపుచున్నది.

ఒకటి, రెండు అర్థములయందు మాత్రము ప్రవర్తించు తద్ధితములు కూడ ఉన్నవి. 'మతుప్' ప్రత్యయము కలవాడు, కలది, అను అర్థమును మాత్రము తెలుపును. ఇట్లే తరప్, తమప్, దఘ్నచ్, ద్వయసచ్, కల్పప్, దేశ్య దేశీయర్ వంటి ప్రత్యయాలు ఒకటి లేక రెండు అర్థములందు మాత్రము ప్రవర్తించుచున్నవి.

ఒక ప్రత్యయమే కొన్ని శబ్దములమీద ఒక అర్థములోను, ఇతరత్ర మరొక అర్థములోను వచ్చుటకూడ కలదు. యత్ ప్రత్యయము 'గవ్యమ్' అనుచోట వికారార్థమును, 'దన్త్యమ్' మొ చోట్ల భవార్థమును బోధించుచున్నది. 'కన్' ప్రత్యయము క్రీతార్థములో సంఖ్యావాచక శబ్దములమీదను, 'హ్రదక' మొ శబ్దములలో కుత్సార్థములోను విధింపబడినది. తల్ ప్రత్యయము 'గోతా మొ పదములందు భావార్థమును, 'గ్రామతా, జనతా, బంధుతా' శబ్దములతో సమూహార్థమును బోధించుచున్నది. ఇట్లే మరికొన్ని ప్రత్యయములు కూడ ఈ విధమైనవి మనకు గోచరించును.

తద్ధిత ప్రత్యయములు ప్రాతిపదికమీద కాక సుబంత శబ్దాలమీద చేరును. సమాసమున లోపించినట్లు తద్ధిత ప్రక్రియలో కూడ విభక్తులు లోపించును. సందర్భము ననుసరించి కొన్నిచోట్ల ప్రథమాంత శబ్దములమీదను, మరికొన్నిచోట్ల ద్వితీయాది విభక్త్యంతముల మీదను తద్ధిత ప్రత్యయములు చేరను.

ఆది వృద్ధిని గూర్చి ఇంతకుముందు చెప్పుకున్నాము. అది ప్రకృతి ఏక పదముగా ఉన్నప్పుడు సంభవించునది. కొన్ని స్థలాలలో ప్రకృతిభాగము రెండు పదములు కలిగి ఉన్నప్పుడు ఉభయపదవృద్ధి కన్పించుచున్నది. అనగా రెండు పదముల లోని మొదటి అచ్చునకు వృద్ధి జరుగుచున్నది. ''ఐహలౌకికమ్'' అనుచోట 'ఇహ' 'లోక' అనురెండు శబ్దములకు ఆదివృద్ధి జరిగినది. ఇట్లే "పారలౌకికమ్", "ఆధిభౌతికమ్", సార్వభౌమ మొదలగునవి ఉభయపదవృద్ధి కలిగిన రూపములు కలవు. అనుశతికాది గణములో ఇటువంటి శబ్దములనుచేర్చి పాణిని చెప్పినాడు.

వృత్తులలోవలె తద్ధితప్రత్యయాలలో కూడ నామనిష్పాదకాలు కానివి కొన్ని ఉన్నవి. తసిల్; [illegible] థాల్, అధునా, దానీమ్‌వంటి ప్రత్యయాలుచేరిన శబ్దములు అవ్యయములుగా పరిగణింపబడుచున్నవి. సర్వతః, తత్ర, ఏకదా, ఏతర్హి,

అధునా, తదానీమ్ వంటివి అట్టి శబ్దములు. అధునా అనునది ప్రత్యయము. అది మాత్రము శేషించి ప్రకృతిలోపించి అధునా అనునది పదముగా నిలిచినది. ఇటువంటి ప్రత్యయమాత్రశేషరూపములు అరుదుగా ఉండును.

సరస్వతీ కంఠాభరణములో చతుర్థ, పంచమాధ్యాయములు రెండింటిలో తద్ధిత ప్రక్రియ నిరూపింప బడినది. దీనిలో కూడ దాదాపు పాణినీయములోవలె అణ్, ఞ్య, అఞ్, యఞ్ మొదలగు తద్ధిత ప్రత్యయములు చూపబడినవి. "పితృవ్యమతుల మాతామహపితామహాః" 4-2-86 అని పాణిని నిపాతములుగా పేర్కొన్న పితృవ్యాది శబ్దములకు భోజుడు ప్రక్రియను తెలిపినాడు.

ప్రత్యయ వర్గములకు ఇత్సంజ్ఞా విధానము ఆదివృద్ధి మొదలగు కార్యములు దీనిలో కూడ పాణినీయ తుల్యములే. కొన్ని ప్రత్యయముల స్వరూపములో కొంచెము భేదము ఉన్నది. కొన్ని భిన్న ప్రత్యయములు అరుదుగా కాన్పించును.

ఈ ప్రకరణములో అష్టాధ్యాయితో సారూప్యము కల కొన్ని సూత్రములు:-

| | పాణి | స. కం. |
|---|---|---|
| 1. కన్యాయాః కనీనచ | 4-1-116 | 4-1-98 |
| 2. వామదేవాడ్డ్యడ్డ్యౌ | 4-2-9 | 4-2-12 |
| 3. వృద్ధాచ్ఛః | 4-2-114 | 4-3-87 |

సరస్వతీకంఠాభరణము కృత్తులను, తద్ధితాలను చెప్పుటలో అధ్యాయసంఖ్యను కూడ పాణినీయము ననుసరించి గ్రహించినది. కృత్తులను తృతీయాధ్యాయములోను, తద్ధిత ప్రత్యయాలను చతుర్థ, పంచమాధ్యాయములలోను భోజపాణిను లిరువురు ప్రతిపాదించినారు.

జీవగోస్వామి ప్రభుపాదులు శ్రీ హరినామామృత వ్యాకరణమను పేరుతో ఒక సంస్కృత గ్రంథమును రచించినారు.

దీనిలో సంజ్ఞలు, ఉదాహరణములు సాధ్యమ[illegible]ముగా చూపబడినవి.

1227వ సూత్రమునుండి 1692వ సూత్రమువరకు కృత్ ప్రత్యయముల ప్రక్రియ; 400 పైగా సూత్రములద్వారా ప్రతిపాదితము.

'క్త, క్తవతు' ప్రత్యయములకు పాణిని 'నిష్ఠా' సంజ్ఞను విధించగా, ఈ వ్యాకరణము 'విష్ణునిష్ఠా' అనుసంజ్ఞను చెప్పినది. అధికారసూత్రమునకు 'విధిః' అని. వృద్ధికిబదులుగా 'వృష్ణిసంజ్ఞిః' అని, ప్రత్యయమునకు 'నృసింహః' అనియు, విష్ణుపరముగా సంజ్ఞాకల్పనము చేయబడినది. "త్రివిక్రమః", "ఉపేన్ద్రమధవః" ఇత్యాది సంజ్ఞలుకూడ కల్పితములు.

తద్ధితప్రకరణములో మొదట 90 సూత్రములలో తద్ధిత కార్యములను వివరించి, తరువాత 2157వ సూత్రమునుండి 3192వ సూత్రమువరకు తద్ధితప్రత్యయాల ప్రక్రియ నిరూపింపబడినది

ఈ ప్రకరణములో ముందుగా సమాసాంత ప్రత్యయములు, తరువాత "లక్ష్మీప్రకరణము" అనుపేరుతో స్త్రీప్రత్యయప్రకరణము, ఆ పిమ్మట తద్ధిత ప్రత్యయములు ప్రతిపాదితములు.

దీనిలోని సూత్రములకు చాలవరకు పాణిని సూత్రాలతో సారూప్యము ఉన్నది. ప్రక్రియావిధానము కూడ భిన్నముగాలేదు సంజ్ఞలను విష్ణుపరముగా చెప్పుటలో మాత్రము వైశిష్ట్యము కాన్పించును.

జీవగోస్వామి గొప్పపండితుడు. విష్ణుభక్తిపూర్ణుడు. ఈయన మరికొన్ని గ్రంథములను కూడ రచించి ప్రసిద్ధిగాంచినాడు.

సారస్వత వ్యాకరణము అత్యల్ప సూత్రసంఖ్యకలిగి ఉన్నది. దీనిలో మొత్తము 594 సూత్రములే ఉన్నవి. వానిలో అల్పాక్షర సూత్రములే ఎక్కువ. పాణిని అష్టాధ్యాయిలోని నాలుగువేలసూత్రాలతో పోల్చినప్పుడు సారస్వతము చాల క్లుప్తమనకతప్పదు. శర్వవర్మరచించిన కాతంత్ర వ్యాకరణము దీనికంటె పెద్దది.

[illegible] ధ్యభాగములో సారస్వతవ్యాకరణరచన జరిగినట్లు తెల్లియుచున్నది. దీనికర్త [illegible] స్పష్టముగా తెలియదు. అనుభూతిస్వరూపాచార్యులనే

గొప్పపండితుడు, దీనికి ప్రక్రియాక్రమములో వ్యాఖ్యానము వ్రాసి ప్రచారము కలిగించి నాడు. ఈయిన సారస్వత వ్యాకరణకర్త అని కొందరు భావించుచున్నారు.

సారస్వతవ్యాకరణములో తద్ధిత ప్రకరణములో, 31 సూత్రములున్నవి. అణ్, ఇఞ్, వత్, త, త్వ, మొదలగు ప్రత్యయములు చెప్పబడినవి. 'కతి' మొదలగు శబ్దములు నిపాతములని చివరి సూత్రములో పేర్కొనబడినవి. ప్రత్యయములు, వాని ప్రక్రియ సామాన్యముగా పాణినీయ వ్యాకరణరీతిలోనే ఉన్నవి. తద్ధితప్రకరణము కంటె కృత్ ప్రకరణము లోని సూత్ర సంఖ్య ఎక్కువగా నున్నది.

కృత్ ప్రకరణములో 87 సూత్రములున్నవి. 'లోకాచ్ఛేషస్య సిద్ధిః' అని అంతిమ సూత్రములో మిగిలిన రూపములను లోకవ్యవహారమువలన తెలియవలెనని చెప్పబడినది. దీనిలో ''హ్రస్వస్య పితి కృతి తుక్'', ''యువోరనాకౌ'' అను సూత్రములు పాణినీయ సూత్రప్రతిరూపములే.

కొన్ని వైదిక ప్రయోగములకు సంబంధించిన వార్తికములు చేర్చి 'దేవాసః' 'కర్ణేభిః' వంటి ప్రయోగాల నిష్పత్తిని గూడ దీనిలో సాధించినాడు అనుభూతి స్వరూపాచార్యుడు. లఘుభాష్యకర్త రఘునాథపండితుడు స్వీకరించిన సూత్ర పాఠము ననుసరించి ఇది ముద్రింపబడినది. వ్రాతప్రతులలో అక్కడక్కడ కొన్ని పాఠభేదములున్నవి.

ప్రచురప్రయోగము గల పదముల రూప నిష్పత్తిని అక్లిష్టప్రయోగసరణిని తెలుపుచు కావ్యాదిపఠనసామర్థ్యమును కలిగించుటే సారస్వతవ్యాకరణ లక్ష్యము.

సౌలభ్యదృష్టితో చూచినప్పుడు కాతంత్రముకంటె సారస్వత వ్యాకరణము మిన్న.

భాషాశాస్త్రాధ్యయనానికి, శాస్త్రముగా వ్యాకరణము నేర్పుటకు, పాణినీయ వ్యాకరణమత్యంతోపయోగి. వ్యాకరణములో ప్రాథమిక జ్ఞానమునుపొంది, కావ్యదర్శ

నాదిగ్రంథముల అధ్యయనములో ప్రవృత్తులయ్యేవారికి కాతంత్ర సారస్వత వ్యాకరణాలు చక్కగా ఉపయోగించును.

శర్వ వర్మ రచించిన కాతంత్ర వ్యాకరణములో 855 సూత్రములున్నవి. అయితే దీనిలో కృత్ ప్రకరణము వ్రాయబడలేదు. తరువాత వరరుచి. 546 సూత్రములతో కృత్ ప్రకరణమును దానికి చేర్చినాడు.

భాషలో ప్రవేశమును మాత్రముద్దేశించి, మూరుమూలపదములతోలికిపోకుండా, కృదంతతద్ధితాంత శబ్దాలను లోకవ్యవహారమునుండి గ్రహించవచ్చునని తలచి, నామరూప, క్రియారూప ప్రక్రియలు, సంధి, కారక, సమాసములను మాత్రము శర్వవర్మ తన కాతంత్రవ్యాకరణములో ప్రతిపాదించినాడు ఈ వ్యాకరణము మన దేశములోనే కాక, టిబెట్టు, మధ్యాసియా, సింహళదేశములలో గూడ వ్యాపించినది.

దీనిలో నాలుగు ప్రకరణాలున్నవి—1. సంధిః 2. నామ్నిచతుష్టయమ్. 3. ఆఖ్యాతమ్. 4. కృతః అని క్రమముగా వానిపేర్లు. ప్రతిప్రకరణములోను పాద విభజనము చేయబడినది.

రెండవప్రకరణములోని 6వ పాదము పూర్తిగా తద్ధితప్రక్రియను ప్రతిపాదించినది. నాల్గవప్రకరణములో కృత్తులస్వరూపము వాని ప్రక్రియ వివరింపబడినవి.

కాతంత్రముతోపాటు బోపదేవుని ముగ్ధబోధవ్యాకరణము కూడ ప్రక్రియా కౌముదిలో పేర్కొనబడినది. బోపదేవుడు క్రి.శ. 13వ శతాబ్దపువాడు. దీనిలో 5 అధ్యాయములున్నవి.

1. సంజ్ఞాధ్యాయము
2. అజన్తాధ్యాయము
3. హనన్తాధ్యాయము
4. స్యాద్యన్తాధ్యాయము
5. కృదన్తాధ్యాయము

పైవిభాగములో 4వ అధ్యాయములో స్త్రీప్రత్యయ, కారక, సమాస, తద్ధిత ప్రకరణములున్నవి. చివరి అధ్యాయము కృత్తుల ప్రక్రియను విపులముగా ప్రతిపాదించినది.

ముగ్ధబోధములో సంజ్ఞలు, పాణిని పరిభాషకు భిన్నముగా ఉన్నవి ధాతు సంజ్ఞకు బదులుగా ''భ్వాదేర్ఘుః'' అని ''ఘు'' సంజ్ఞచెప్పబడినది. ప్రత్యయమునకు 'త్య' అనియు, హ్రస్వదీర్ఘప్లుతములకు క్రమముగా 'స్వ', 'ర్ఘ', 'ప్లు' సంజ్ఞలు గుణ వృద్ధులకు 'ఞు' 'వ్రి' అను సంజ్ఞలును చెప్పబడినవి.

సాధారణముగా సంజ్ఞలన్నియు ఏకాక్షరములుగానే ఉన్నవి. పాణిని ''స్త్రీపుంసాభ్యాం నఞ్ స్నఞౌభవనాత్'' అని రెండు ప్రత్యయములను విధింపగా బోపదేవుడు ''నన్ పుంస్త్రియోః'' అని ఒక్క ప్రత్యయముతోనే రూపములను సాధించినాడు.

ఇట్లే ఎన్నో విధముల లాఘవము పాటింపబడినది. గణములు శ్లోకరూపముగ గాని గద్యరూపముగగాని వివరింపబడినవి.

జైనమతావలంబియగు హేమచంద్రుడు శబ్దానుశాసనమను పేర సంస్కృత వ్యాకరణమును రచించినాడు దీనిలో పాణినీయమునవలె 8 అధ్యాయములు, 32 పాదములు కలవు. మొత్తము సూత్రసంఖ్య 5 వేలకుపైగా ఉన్నది.

పాణిని స్వరప్రయోజనముకొరకు 'తవ్యత్' తవ్యప్రత్యయములను రెంటిని చెప్పగా హేమచంద్రుడు 'తవ్య' ప్రత్యయము నొక్కదానినే చెప్పినాడు.

ణ్యత్‌కు మారుగా 'ఘ్యణ్', ణ్వుల్ స్థానములో 'ణక' 'ష్వున్'కు బదులుగా 'అకట్' ప్రత్యయాలు చెప్పబడినవి. దీనివలన 'యువోరనాకౌ' అనుసూత్రముతో పని లేక ప్రక్రియాలాఘవము కలిగినది.

ఇదే విధముగా ప్రత్యయ స్వరూపములో కూడ భేదము చూపి లాఘవము కల్పింపబడినది.

పాణిని చెప్పని కొన్ని రూపములకు హేమచంద్రుడు సూత్రములను చెప్పినాడు.

6వ అధ్యాయము 'తద్ధితోఽణాదిః' అను సూత్రముతో ప్రారంభమై తద్ధిత ప్రక్రియ 7వ అధ్యాయము చతుర్థపాదము 71వ సూత్రము వరకు కొనసాగినది.

'అత ఇఞ్' పాణ్డోర్డ్యణ్', 'మధ్యాన్మః''ప్రావృష ఏణ్యః' వంటి పాణినీయ సరూపసూత్రములు శబ్దానుశాసనములో కనిపించును.

కృత్ ప్రకరణములో గూడ చరేష్టః, క్విప్ వంటి సరూపసూత్రములు స్త్రియాం క్తిః ''నన్దిగ్రహి పచాదిభ్యో ల్యుణిన్యచః''''సంమద ప్రమదౌ హర్షే''''పురోఽగతోఽగ్రే సర్తేః'' అను కించిద్రూపభిన్నసూత్రములున్నవి

శాకటాయన వ్యాకరణము ప్రస్తుతము లభ్యమగుచున్నది. మహాశ్రమణ సంఘాధిపతి యైన శాకటాయన ప్రణీతము.

దీనిలో ''ఇ కాద్యాయాత్తద్ధితః'' 1-1-42 అను సూత్రము ప్రకారము 'ఇచ్' ప్రత్యయము నుండి 'ఆయ' ప్రత్యయమువరకు- రెండవ, మూడవ అధ్యాయ ఉలలో తద్ధితప్రత్యయాలు వివరింపబడినవి. మొదట సమాసాంత ప్రత్యయములు కొన్ని తద్ధితాలుగా చెప్పబడినవి.

''ఘ్యాద్యటిజ్కృత్'' 1-1-43 అనసూత్రము ద్వారా 'ఘ్యణ్' మొదలు కొని'టిజ్' వర్గముగా ధాతువుపై విధింపబడిన కృత్తులనబడునని చెప్పి "ఘ్యణ్" 4-3-60 అనుసూత్రమునుండి కృదంతప్రక్రియ ప్రతిపాదితము. పాణిని చెప్పిన ణ్యత్ ప్రత్యయానికి మారుగా దీనిలో ఘ్యణ్ చెప్పబడినది. కృత్ ప్రత్యయములు నిర్దిష్టార్థములకంటె ఇతరార్థములలో కూడ బహుళముగా ప్రవర్తించునని "కృద్బహుళమ్[17]" అనుసూత్రము చెప్పుచున్నది.

---

17. శాకటాయన వ్యాక 4 3-58

స్వరభేదము కొరకు పాణిని, తవ్యత్-తవ్య అను రెండు భిన్న ప్రత్యయాలను చెప్పగా శాకటాయనుడు ఒక్క 'తవ్య' ప్రత్యయమునే చెప్పినాడు. ఇటువంటి కొన్ని స్వల్పభేదము లున్నప్పటికి ప్రక్రియా విధానము సాధారణముగా పాణినీయము ననుసరించియే యున్నది.

ఉణాదిసూత్రనిర్మాత శాకటాయనుడు, జైనశాకటాయనుడు భిన్నులు. మొదటివ్యక్తి పాణినికి పూర్వుడు కాగా, రెండవవాడు అర్వాచీనుడు.

ఇంతవరకు పరిశీలింపబడినవేకాక మరికొన్ని సంస్కృత వ్యాకరణ గ్రంథములుకూడ ఉన్నట్లు తెలియుచున్నది. వానిలో చాలవరకు అముద్రితములు, అలభ్యములు

ప్రధానములైన సంస్కృత వ్యాకరణగ్రంథములను, సాధ్యమయినంతవరకు పరిశీలించి కృత్తద్ధిత ప్రత్యయస్వరూపము వివేచింపనైనది.

— o —

# ద్వితీయ ప్రకరణము

## తెలుగు లాక్షణికులు వింగడించిన కృత్తద్ధిత స్వరూపము

కృత్తులు, తద్ధితాలు భాషకు జీవనాడులైన ప్రత్యయాలు. ఈ సంజ్ఞలు సంస్కృత వ్యాకరణమునుండి గ్రహింపబడినవే. సంస్కృత వ్యాకరణాలలో కృత్తద్ధిత ప్రత్యయాలస్వరూపమేవిధముగా ప్రతిపాదింపబడినది పూర్వప్రకరణములో స్థూలముగా వివరించి ఉన్నాను. ఈ ప్రకరణములో తెలుగు వ్యాకరణకర్తలు తమ గ్రంథాలలోకృత్తుల, తద్ధితాల స్వరూపమునేరీతిగా ప్రతిపాదించినారో పరిశీలింతును.

తెలుగు భాషకు సంబంధించిన వ్యాకరణములను ముందుగా రెండువర్గములుగా విభజింపవచ్చును.

1. సంస్కృత భాషలో వ్రాయబడిన తెలుగు వ్యాకరణగ్రంథములు.
2. తెలుగు భాషలో రచింపబడిన తెలుగు వ్యాకరణ గ్రంథములు.

ఇవికూడ, సూత్రరూపములో వ్రాయబడినవి; ఛందోబద్ధముగా వ్రాయబడినవి. అని ఒక్కొక్కటి మరల రెండువిధములుగా వర్గీకరింపదగును.

మొదట, సంస్కృతములో వ్రాయబడిన తెలుగు వ్యాకరణములగూర్చి ముచ్చటింతును. ఆ వర్గములో చేరుగ్రంథములివి-

1. ఆంధ్రశబ్దచింతామణి
2. త్రిలింగశబ్దానుశాసనము.
3. వికృతి వివేకము.
4. కవిశిరోభూషణము.
5. ఆంధ్రకౌముది.

6. రాజ్య వ్యాకరణము.
7. బార్హస్పత్య వ్యాకరణము.
8. ఆంధ్ర వ్యాకరణము.
9. వైకృత చంద్రిక.
10. సూత్రాంధ్ర వ్యాకరణము.
11. హరికారికలు.
12. హరికారికాశేషము.
13. నృసింహ పండితీయము.

పైవానిలో ఛందోబద్ధముగా రచింపబడినవి, సూత్రరూపములో వ్రాయబడినవికూడ చేరియున్నవి. ఈ గ్రంథములన్నిటిలో ప్రముఖస్థానమాక్రమించిన 'ఆంధ్ర శబ్దచింతామణి" ఆర్యాఛందస్సులో రచితమై సూత్రరూపముగా విరచియింపబడినది. చింతామణి కర్తనుగూర్చి దాని రచనాకాలమును గూర్చి విద్వాంసులలో మతభేదము లున్నప్పటికినీ, దాని ప్రామాణికత్వ విషయములో వివాదములేదు.

ఆంధ్రశబ్దచింతామణిలోని "స్యాదుపకృతిః కృదస్తా[1]" అనుసూత్రము, కృదంత సంజ్ఞను పేర్కొన్నది క్రియలకు-ఉపకృతి, పరిణతి, సంవృతి రూపములుగా మూడు భేదములనుచెప్పి, కృత్ ప్రత్యయము లంతమందుగల క్రియ "ఉపకృతి" విభాగములో చేరునని చింతామణిప్రతిపాదనము పోష, నుతి, స్తుతి మొదలగు కృదంత శబ్దములు ప్రకృతిగాగల పోషించు, నుతించు స్తుతించు, వంటివి ఉపకృతి క్రియలన బడునని భావము. చింతామణిలో కృదంత శబ్ద ప్రస్తావనము ఇంతవరకే పరిమితమై ముగిసినది. 'కృత్' సంజ్ఞను నిర్వచించుటగాని, దానిస్వరూపమును ప్రతిపాదించుట కాని, తెలుగులోని కృత్ ప్రత్యయాలను పేర్కొనుట కాని, దానిలో కానరాదు. ఇక తద్ధిత ప్రత్యయముల పేరుకూడా దానిలో మనకు గోచరించదు అందువలన ఆంధ్ర శబ్దచింతామణి కృత్, తద్ధితాల పరిశీలనలో ఏమాత్రము తోడ్పడదని చెప్పవలసి యుండును.

---

1. ఆం-శ-చిం-క్రియా-5

ఆంధ్రవిష్ణువు కాలములో రచింపబడినట్లు భావింపబడుతున్న కాణ్వ వ్యాకరణముతోపాటు భార్గవ్రత్యవ్యాకరణము. నృసింహపండితీయము కూడ ప్రస్తుత మలభ్యములు. కణ్వుడు ఆంధ్రభాషకు వ్యాకరణము రచించినట్లు ఆంధ్రకౌముది కర్త మంద లక్ష్మీనరసింహాచార్యుడు, త్రిలింగశబ్దానుశాసనకర్త అధర్వణుడు కూడ పేర్కొన్నారు. త్రిలింగశబ్దానుశాసనములో కాణ్వవ్యాకరణములోనివని కొన్ని సూత్రములు చూపబడినవి. కాని ఆ సూత్రములద్వారా కృత్తద్ధితాలకు సంబంధించిన విషయము లేవియు మనకు తెలియవు. కాణ్వవ్యాకరణమే ప్రథమాంధ్ర వ్యాకరణమని డా అమరేశం రాజేశ్వర శర్మగారు నిశ్చయించినారు [2] "అధర్వణకారికావళియే కాణ్వవ్యాకరణము కాని వేరుకాదు" అని శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు వ్రాసినారు[2] కాని త్రిలింగశబ్దానుశాసనములో, కణ్వవ్యాకరణ సూత్రములనిచెప్పి చూపబడినవి మాత్రమధర్వణకారికావళిలోనివి కావు అందువలన కాణ్వవ్యాకరణము, అధర్వణకారికావళికంటె భిన్నమని తలచుటే సమంజసము.

త్రిలింగశబ్దానుశాసనము, అధర్వణుడు సంస్కృతభాషలో వ్రాసిన తెలుగు వ్యాకరణగ్రంథము. ఆంధ్రకౌముదీకర్త, అప్పకవికూడ, అధర్వణని లక్షణకర్తగా పేర్కొన్నారు. "అధర్వణాచార్య విరచితే" అని గ్రంథములోనే స్పష్టముగా చెప్పబడి యున్నది. ఈ పుస్తకములో 10 కాండములున్నవి. పంచమకాండములో తద్ధితప్రత్యయములనుగూర్చి ఎనిమిది శ్లోకాలలో చెప్పబడినది. దశమకాండములో కృదంతప్రక్రియ స్థూలముగా ప్రదర్శింపబడినది. సాధారణముగా వ్యాకరణకర్తలు చెప్పెడి విషయము లన్నియు దీనిలో సంగ్రహముగ చెప్పబడినవి. లేఖకదోషము లెక్కువగా ఉండుటవలన చాలసూత్రములకర్థము దుర్బోధమై యథార్థస్వరూపము తెలిసికొనజాలకున్నాము. దీనిఒక్కప్రతిమాత్రమే మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగరములో లభ్యమగుచున్నది. రెండవప్రతి లభించలేదు. ఆ ఒక్కప్రతికూడ ముద్రితమైనదికాదు. ఏవండితు లును పరిష్కరించి సాధుపాఠములతో దానిని ప్రకటించలేము. దానికి టీకగాని, లక్ష్య ప్రదర్శనగాని కూర్చబడలేదు. ఈ కారణములవలన దీనిలోని సూత్రములకర్థము తెలిసి

---

2. ఆంధ్రవ్యాకరణవికాసము భా-1 పు...160-226

2. ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక సం-3_సంచిక.2

కానుట దుస్తరముగా నున్నదని డా రాజేశ్వరశర్మగారు తమసిద్ధాంతవ్యాసము లో తెల్పినారు [3]

త్రిలింగశబ్దానుశాసనములోని తద్ధితప్రకరణములో "ధర్మిణస్త్వేనగుణ్యేన గాడ్వారీత్యాదయో మతాః" అని "గాడు", "అరి" అను ప్రత్యయములు ప్రాకృతపది కము మీద ధర్మార్థములో రాగలవని చెప్పబడినది. "ఎడుః ప్రస్థాదికస్యాత్ సేపుః కాలస్య సమ్మతః" అని "ఎడు", "సేపు" అను ప్రత్యయములను కూడ పేర్కొనుట జరిగినది. దీనిలో "ఎడు" ప్రత్యయమును చాలమంది లాక్షణికులు చెప్పినారుకాని 'సేపు' ప్రత్యయమును ఇతర లాక్షణికులెవ్వరును చెప్పలేదు. నన్నయనాటినుండి ప్రయోగములలో కన్పించుచున్న ఈ 'సేపు' ప్రత్యయమును ఎందువల్లనో ఇతర వ్యాకర్తలు పేర్కొనలేదు. "కొంతసేపు చెలగి పోరాడిరి" అని నన్నయ ప్రయోగము [4] నన్నెచోడుడు కూడ 'సేపు' ప్రత్యయమును ప్రయోగించినాడు. ఇది సమయ వాచక శబ్దమైనప్పటికి, ప్రత్యేక ప్రయోగాలు లేనందున, త్రిలింగ శబ్దానుశాసనము చెప్పినట్లు ప్రత్యయముని భావించుటే సముచితము.

కృదంతప్రక్రియ ఈ గ్రంథములో చాల సంగ్రహముగా చెప్పబడినది. కాని ఆ భాగము లేఖకదోషాలతో దుర్బోధముగా ఉన్నందున, వానిస్వరూపము తెలియ రాకున్నది. ఈ త్రిలింగ శబ్దానుశాసనము పండిత పరిష్కరణతో ముద్రింపబడవలసిన అవసరమెంతయో కలదు.

ఆంధ్రశబ్ద చింతామణికి గల వ్యాఖ్యలలో కవిశిరోభూషణము ముఖ్యమైనది. దీని రచయిత అహోబిలపండితుడు. అందుచేతనే దీనికి అహోబిలపండితీయమనుపేరు ప్రసిద్ధమై ఉన్నది. అహోబిలుడు తర్క వ్యాకరణాది శాస్త్రములలో గొప్ప పండితుడు. అతని వ్యాఖ్యాగ్రంథమువలన ఈ విషయము మనకు స్పష్టమగును.

చింతామణిలో కృదంత, తద్ధితాంత ప్రకరణ విభాగము లేకున్నను దాని వ్యాఖ్యానమైన కవిశిరోభూషణములో, అహోబిలుడు కృదంత శబ్దములను 150 వరకు

3. ఆంధ్ర వ్యాకరణ వికాసము భా-1 పుట-217-225

4. భారతం అర. 2-894

ధాతు ప్రకృతికము లను పేరుతో ఉదాహరించినాడు. వానిలో కొన్ని ముఖ్యశబ్దములిక్కడ చూపబడుచున్నవి.

1. అలుక, 2. అంపకము, 3. చొఱవ, 4. దాపరము, 5. కూటమి 6. కలయిక, 7. వినికి, 8. దుక్కి, 9. వేకువ, 10. ఆకికోలు, 11 కలగుండు, 12. నిల్కడ, 13. నొప్పి, 14. తెంపన, 15. తెలివి, 16. తెలివిడి, 17. పట్టువు 18. ఒవిగిల్లు.

ఇవి కాక నర్వంలోపి ప్రత్యయములు చేరిన 45 ఇతర రూపములు కూడ ఉన్నవి. అనగా ధాతురూపము మాత్రము వాడుకలో నుండి, కృత్ ప్రత్యయములు లోపించినట్లు వ్యాకర్తలు పేర్కొను శబ్దములని భావము. వెలుగు, పొంగు, చదువు, ఒమరు, తిట్టు మొదలగు శబ్దములీతరగతికి చెందినవి. తెలుగు మొదలగు సంయోగాత్మక భాషలలో, ఒక పదమే క్రియార్థ, నామార్థములను బోధించుట సహజము. కాని కేవల ప్రకృతికాని, కేవల ప్రత్యయముకాని ప్రయోగార్హము కాదను వ్యాకరణ సంప్రదాయము ననుసరించి, ఆటువంటి శబ్దములలో కూడ ప్రత్యయమువచ్చి లోపించినట్లు చెప్పుట పరిపాటి. తెలుగు ధాతువులు సాధారణముగా ఉకారాంతములు కనుక వానిమీద ఉకార రూప ప్రత్యయముచేరి, సంధివలన ప్రకృతి మాత్రము శేషించినదని భావింపవలెను.

అహోబలుడు ధాతుప్రకృతికము లను పేరుతో 'అలుక' మొదలగు 160 రూపములను చెప్పుటవలన కృదంత రూపముల విషయములో ఈతని గ్రంథము కొంత మార్గదర్శకముగా ఉన్నది. కాని తద్ధిత ప్రత్యయాల విషయములో మాత్రమిదియే మాత్రముపకరించదు.

వికృతి వివేకము అథర్వణ కృతమని అహోబలపతి స్పష్టముగ పేర్కొన్నాడు. దీనిని గూర్చి మొట్టమొదట లోకమునకు తెలిపినది కూడ అతడే. వికృతి వివేకము అథర్వణ కారికావళి, రెండు అభిన్నములని, నన్నయ్య ప్రథమాచార్యుడుకాగా, అథర్వణుడు ద్వితీయాచార్యుడని అహోబలపతి గట్టివిశ్వాసము. వికృతి వివేకము చింతామణికి శేషగ్రంథమనుటలో ఎవ్వరికిని విప్రతిపత్తిలేదు. కాని దీని కర్తృత్వము, కాలము, విషయములలో మాత్రము మత భేదములున్నవి.

ఆంధ్రకౌముది అనుపేరుతో రెండువ్యాకరణ గ్రంథములున్నవి. ఒకటి సంస్కృత భాషలో మంద లక్ష్మీనరసింహాచార్యులచేత రచింపబడగా, రెండవది గణపవరపు వేంకట కవిచే తెలుగులో పద్యరూపమున రచింపబడినది. సంస్కృతములోని ఆంధ్రకౌముదీ కర్త అప్పకవికి ఇంచుమించు సమకాలికుడు

ఈ ఆంధ్రకౌముదిలో సంజ్ఞా, సంధి, అజంత, హలంత క్రియాప్రకరణము లని 5 భాగములున్నవి. ఈ విభజన చింతామణి ననుసరించి చేయబడినప్పటికిని చింతామణిలోలేని విశేషాలు కొన్ని చెప్పబడినవి. కృత్తులు, తద్ధితాల స్వరూపముకాని, వాటిప్రక్రియ కాని దీనిలో ప్రస్తావింపబడలేదు

'వైకృతచంద్రిక' సంస్కృత భాషలో రచింపబడిన తెలుగు వ్యాకరణము లలో ఒక విశిష్టమైన గ్రంథము. దీని రచయిత మంచెళ్ళ వాసుదేవకవి. ఇది యిటీవల 1975వ సం న ముద్రింపబడినది. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి పుస్తక భండాగారములోను, తిరుపతిలోని విశ్వవిద్యాలయ గ్రంథాలయములోను దీని వ్రాతప్రతు లున్నవి.

దీనిలో మొత్తము 11 ప్రకరణములున్నవి. కృత్తులు, తద్ధితాలు ప్రత్యేక ప్రకరణములలో వివరముగా వివరింపబడినవి

వైకృతచంద్రిక ప్రకారము పదములమీద సంస్కృత తద్ధిత ప్రత్యయములు చేరి, తరువాత వాని స్థానములో తెలుగు తద్ధితము లాదేశముగా వచ్చును. కనుకనే 'తద్ధితాదేశప్రకరణమని ఆ ప్రకరణమును పేర్కొన్నాడు గ్రంథకర్త.

'అరిమీమ్కామోమతుపః' అను మొదటి సూత్రము 'మతుప్' ప్రత్యయ స్థానమున అరిమ్, ఈమ్, కామ్ అను ప్రత్యయము లాదేశమగునని చెప్పుచున్నది. ఇతర లాక్షణికులు అరి, ఈ, కా అని చెప్పిన ప్రత్యయములను వైకృతచంద్రికా కర్త మకారాంతములుగా చెప్పినాడు.

దీనిలో అరిమ్, ఈవ్, కామ్, అమ్, తుమ్, ఇడిమ్, ఎడుమ్, బరిజిమ్, కమ్, అర, ఇర, ఇరిస్, అవస్, ఉటస్, అమస్, అస్, అసమ్, పుమ్, ండమ్, ?, అవమ్, యు, తసమ్, ట, ఇమి, రికస్, ందమ్, టుక్, పుడు, ంలే- అను తద్ధిత

ప్రత్యయములు చెప్పబడినవి. వీనిలో అవమ్, యు, ందుమ్, టుక్, వుడు, ంత ప్రత్యయాంతాలు అవ్యయాలుగా ఉండును. కలిమి, లిమి శబ్దములను కృదంత ప్రకరణములో చెప్పుట బాహ్యము. వీనితోబాటు 'ట' ప్రత్యయాంతమైన 'పరగుట' శబ్దము కూడ తద్ధిత ప్రకరణములో చూపబడినది. సముచ్చయార్థకమైన 'యు' ను ప్రత్యయముగా చెప్పనక్కరలేదు. అది విడిగా అవ్యయరూపములోనే సముచ్చయార్థమును తెలుపగలదు.

దేవ, వేగ అను తత్సమ శబ్దములమీద అర, ఇర ప్రత్యయములు చేరి దేవర, వేగిరము అను శబ్దములు నిష్పన్నమగునని చెప్పబడినది. దేవ శబ్దముమీద స్వార్థములోను, వేగ శబ్దముమీద భావార్థములోను పై ప్రత్యయములు వచ్చినట్లు తోచును. ఈ దేవర, వేగిర శబ్దముల నిష్పత్తిని చిన్నయసూరి కాని, ప్రౌఢ వ్యాకరణ కర్త కాని చెప్పలేదు.

'చందమామ' శబ్దమునకు రూపనిష్పత్తి 'చంద్రమస్' శబ్దముపైన 'ఆమస్, ప్రత్యయము చేరుటవలన కలిగినట్లు చెప్పబడినది. అప్పుడు చంద్రమస్ శబ్దములోని రేఫను, చివరనున్న అస్ అను భాగమునకు లోపము గలిగి ఏర్పడిన 'చందమామ' అను రూపము నిపాతముగా భావింపవలసి ఉన్నది.

బలిమి, ఎలిమి అను రూపములను 'బలహేలాభ్యామిమిః' అను సూత్రము వలన బల, ఎల శబ్దములమీద 'ఇమి' ప్రత్యయము వచ్చుటవలన నిష్పన్నమైనవిగా వైకృతచంద్రిక సాధించినది. బల శబ్దము తత్సమము. 'హేలా' అను సంస్కృత శబ్దమునకు వైకృతరూపము ఏల. దానిమీద 'ఇమి' చేరగా 'ఎలిమి' శబ్దమేర్పడును. కాని కవి ప్రయోగములలో 'ఎలమి' అను రూపమే కన్పడుచున్నది. 'ఎలిమి' రూపము లేదు వైకృత చంద్రిక వ్యాఖ్యాతలీ విషయమును తెలిపినారు. ఎలిమి శబ్దప్రయోగము నెక్కడైన చూచి యీ సూత్రమును వైకృతచంద్రికా కర్త రచించి ఉండవచ్చును. అట్టి ప్రయోగము లభించునేమో పరిశీలింపవలసి ఉన్నది.

'రిక' ప్రత్యయము ఈ గ్రంథములో సాధురేఫముతోనే నిర్దేశింపబడినది. ఇతర లాక్షణికులందరు ఇంచుమించుగా శకటరేఫమునే చూపినారు. ఈ విషయములో

ఇది ఒక ప్రత్యేకతగా కన్పించును. కాని ప్రాచీన కవులు సాధురేఫముతో "రిక" ప్రత్యయమును ప్రయోగించినట్లాధారములు లేవు.

కృదంత విభాగములో వైకృతచంద్రికలో 36 సూత్రాలున్నవి. అవి: ట, వు, వ, వుక్, విశ్, వుశ్, వ్పి రవ, తజ్, డిత్, కుషజ్, క, టుక్ రిర్, ఇకి, ఇక, ఉడు, మి, ఉ, ఎడు, ఎపి, ని, న, ఇ – అని ఇరువదినాలుగు కృత్ ప్రత్యయాలను పతిపాదించినవి.

వీనిలో కృత్తుల ప్రక్రియ మూడు విభాగములుగా చూపబడినది.

1. వుక్ ప్రత్యయము నుండి 'రిర్' అను ప్రత్యయము వరకు 14టిని ధాత్వంత వర్ణముల కాదేశములుగా వచ్చునని, వీనిలోని విశ్, వుశ్ అనునవి ధాత్వంత నంయుక్తాక్షరముల కాదేశములగునని చెప్పబడినది.

ప్రత్యయము ఎప్పుడైనను ప్రకృతికి పరముగా వచ్చునేకాని ఒక వర్ణమున కాదేశముగా రాదు. 'ప్రత్యయః' 'పరశ్చ' అని పాణిని సూత్రముల ప్రకారము సంస్కృత వ్యాకరణ సంప్రదాయమది. తెలుగు వ్యాకర్తలు కూడ పెక్కుమంది ఆ నంప్రదాయమునే పాటించినారు అందువలన ధాతువు చివరి వర్ణములకు కృత్ప్రత్యయాలాదేశముగా వచ్చునని చెప్పుట లాక్షణిక నంప్రదాయానికి భిన్నమైయున్నది. 'ఎఱుక' మొదలగుచోట్ల 'క' వర్ణకము ధాత్వంత వర్ణమునకాదేశమగునని వైకృతచంద్రిక వ్యాఖ్యాతలు వివరించుట కూడ అనంగతముగా ఉన్నది.

2. 'ఇకి' ప్రత్యయము నుండి చివరిదైన 'ఇ' ప్రత్యయము వరకు ధాతువునకాయా ప్రత్యయములు వచ్చునని చెప్పబడినది. అనగా ఆయా ధాతువులకు పరముగా ప్రత్యయములు చేరునని భావము. పైవానివలె ఇచ్చట ప్రత్యయములనాదేశములుగా చెప్పలేదు. కొన్నిచోట్ల ఆదేశములుగాను, మరికొన్నిచోట్ల ప్రకృతికి పరముగాను ప్రత్యయములు వచ్చుననుట ఎట్లు పొసగునో తెలియకున్నది.

3. 'షచ్ఛనొచ్ఛయోఃప్పిక్' అను సూత్రములో ప్రచ్ఛ, నొచ్ఛ ధాతువుల అంత్యవర్ణమునకు లోపముకలిగి 'ప్పిక్' అనునది ఆగమముగా చేరునని చెప్పబడినది ఇది కూడ అసంగతమే. ఎందుకనగా ప్రత్యయము ప్రక్కన వచ్చి చేరినను, దానినాగ

మముగా వ్యవహరించుట లాక్షణిక సంప్రదాయము కాదు. ఆగమము దేనికి వచ్చునో దాని అవయవముగా భావింపబడును. ఇక్కడ 'ప్పి' ఆగమమన్నచో అది ధాతువుల అవయవమని చెప్పవలసి యుండును. అట్లైన అది ప్రత్యయము కాజాలదు. ధాతువులోని ఏకదేశము ప్రత్యయమని చెప్పుట కుదురదు కదా!

కావున పై మూడు విధములలో రెండవది మాత్రమే వ్యాకరణ సంప్రదాయానుగుణముగా ఉన్నది. తక్కిన రెండు రీతులు సమర్థనీయములు కావు. మొదటి విభాగములో చూపిన 11 ప్రత్యయములను ధాతువులకు పరముగా వచ్చునని చెప్పి, ఆ ప్రత్యయములు పరముగునప్పుడు ధాత్వంత వర్ణములు లోపించునని చెప్పుటే సరియగు పద్ధతి. బాలవ్యాకరణాదులలో ఆ రీతిగనే చెప్పబడినది.

మూడవ విభాగములోని సూత్రమున కూడ పుచ్చ, నొచ్చ ధాతువులకు పరముగా 'ప్పి' అను ప్రత్యయము చేరుననియు, ధాత్వంతములో 'చ్చ' అనుదానికి లోపము కలుగునని చెప్పుటే సముచితముగాని, ఆగమమని చెప్పుట సరికాదు.

ఆంధ్ర భాషానుశాసనములో గూడ ఇదే విధముగా ప్రత్యయముల నాదేశ రూపముగా చెప్పుట జరిగినది. ఈ విషయములో ఈ రెండింటికి సామ్యము కనిపించుచున్నది.

ట, ఎడు, ఎడి, ని, న- అను ప్రత్యయము లంతమందున్న శబ్దములు క్రియాజన్య విశేషణములుగాను, 'ఇ, క' అను ప్రత్యయములు క్త్వార్థ, తద్వ్యతిరేకార్థములలో వచ్చి అవ్యయ నిష్పాదకాలగుచున్నవి.

ఈ రీతిగా వైకృతచంద్రిక, తద్ధితాలను, కృత్తులను గూర్చి కొంత విపులముగనే ప్రతిపాదించినది. దీని ప్రక్రియా విధానములో కొంత నూతనత్వము కూడ ఉన్నది

## సూత్రాంధ్రవ్యాకరణము

చిన్నయసూరి మొదట సంస్కృతభాషలో రచించిన తెలుగు వ్యాకరణము సూత్రాంధ్ర వ్యాకరణము. దీని రచనా కాలము క్రీ. శ. 1842 ప్రాంతము. ఆంధ్ర సాహిత్య పరిషత్తు (కాకినాడ) దీనిని క్రీ శ. 1931లో ముద్రించినది.

దీనిలో సంజ్ఞా, సంధి అజంత, కారక, సమాస, తద్ధిత పరిచ్ఛేదాలున్నవి.

తద్ధిత పరిచ్ఛేదములో తనజ్, టిక, ఇమి, స, టిమిజ్, ఇక, ఉక, అఱ, అరి, ఇ, కాష్, కత్తియ, అష్, అడి, ఈష్, మారి, పోతు, తుష్, అడి, త, ఇండి, పడి, ఎండు, ఇద, నజ్, అటిమి, కార, అరజ్ – అను ప్రత్యయములు చెప్పబడినవి. ఆయా ప్రత్యయములకుదాహరణములు కూడ చూపబడినవి.

దీనిలో సూత్రరచన సరళముగా, ధారాళముగా సాగినది. బాలవ్యాకరణము లోని సూత్రములు సూత్రాంధ్ర వ్యాకరణము శైలిననుసరించి వ్రాయబడినట్లు తోచును. 'టికం చిన్నాదిభ్యో బహుళమ్' మిండత, గుబ్బెత, ముట్టుత,విటి 'యువతీ,రజస్వలాః' అను సూత్రములను మచ్చునకు బా-వ్యా-తో పోల్చి చూడవచ్చును.

తద్ధిత ప్రత్యయాలను చెప్పుటలో చిన్నయసూరి బాలవ్యాకరణ సూత్రాంధ్ర వ్యాకరణాలలో కొంత భిన్నత్వము చూపినాడు. 'త్వార్థే తనజ్' అని సూత్రాంధ్ర వ్యాకరణములో జిత్తుగా నిర్దేశించి, బాలవ్యాకరణములో 'తన వర్ణకంబు త్వార్థంబు నందగు' అని అనుబంధ రహితముగా నిర్దేశించినాడు. 'మగాది భ్యష్టిమిజాదయః' అని సూత్రాంధ్ర వ్యాకరణములో 'టిమిజ్' మొదలగు ప్రత్యయాలను చెప్పగా, బాలవ్యాకరణము మాత్రము 'మగంటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' అని నిపాత శబ్దములుగా పేర్కొన్నది.

ముందు శబ్దముమీద 'అఱ' ప్రత్యయము, పగ శబ్దముమీద 'తుష్' ప్రత్యయము, 'కొంత, ఒక' మొదలగు శబ్దములమీద పడి ప్రత్యయము, ఉబ్బు మొదలగు శబ్దాలపైన 'అరజ్' ప్రత్యయము – ఇవి సూత్రాంధ్రవ్యాకరణములో ప్రత్యేకముగా చెప్పబడినవి. బాలవ్యాకరణములో ఈ ప్రత్యయముల ప్రసక్తి ప్రత్యేకముగా లేదు.

కాష్, అష్, ఈష్ అని షకారానుబంధముతో సూత్రాంధ్రవ్యాకరణము నిర్దేశించిన ప్రత్యయాలను చిన్నయసూరి బాలవ్యాకరణములో 'కా, అ, ఈ' ప్రత్యయాలుగా పేర్కొన్నాడు.

పరిమాణార్థములో బాలవ్యాకరణము నిరూపించిన ఐంజి, కొలఁది ప్రత్యయాల ప్రసక్తి సూత్రాంధ్ర వ్యాకరణములో లేదు

'సర్వత్రతాన్నీల్యేమంటాడిభ్యోమూరిః', "పాన్యాదిభ్యః పోతుః" అని సూత్రాంధ్ర వ్యాకరణములో ప్రత్యేకముగా చెప్పబడిన మూరి, పోతు ప్రత్యయములతో పాటు మరికొన్ని ప్రత్యయములను కలిపి బాలవ్యాకరణము 'అర్థవిశేషంబుల వర్ణకాంతరములును మహత్ప్రయోగంబుల నెఱుఁగునది' అని సూత్రించినది.(బాల-తద్ధిత-28) దీని క్రింద మంట మూరి, 'తిండిపోతు' అను శబ్దములతోపాటు అడప, పెండ్లము, బెడుగఁడు, దుడుకఁడు, నిడుపఁడు మొదలగు శబ్దముల నుదాహరించినాడు. అడప మొదలగు శబ్దములు మత్వర్థకమైన 'అ' వర్ణకాంతములని చెప్పినాడు సూరి. (అడపము + అ=అడప) (బెడుగు + అ=బెడుగఁడు) పెండ్లము శబ్దమును 'పెండ్లి + అ' అని విగ్రహించినచో దానిమీద 'ము' వర్ణకము వచ్చుట కుపపత్తిని చూపవలసి యున్నది.

"నందోఽడిః వ్యతిరేకే, మందాన్మన్దరాయామ్" అను సూత్రములలో నందు, మంద శబ్దములమీద అడి ప్రత్యయము చేరుటవలన నందడి, మందడి అను శబ్దాలేర్పడునని సూత్రాంధ్ర వ్యాకరణములో చెప్పగా, బాలవ్యాకరణమీ శబ్దములను గూర్చి ప్రస్తావించలేదు.

అదే విధముగా ఒప్పిదము, ఎల్లిదము, క్రొవ్విదము, బెట్టిదము, పెల్లిదము అను శబ్దములు 'ఇది' ప్రత్యయాంతములని సూత్రాంధ్ర వ్యాకరణములో ప్రదర్శింపబడినది కాని సూత్రము చెప్పబడలేదు. బాలవ్యాకరణములో 'ఇద' ప్రత్యయము కనబడదు. ప్రౌఢ వ్యాకరణములో "ఒప్పు, తప్పు, పెల్లులకు స్వార్థంబునందును, బెట్టు క్రొవ్వులకు మతుబర్థంబునందును" ఇద ప్రత్యయము వచ్చునని చెప్పబడినది.

ఉబ్బు మొదలగు శబ్దములమీద "అర" ప్రత్యయముచేరి ఉబ్బరము, ఇంటరము, దాపరము మున్నగు శబ్దములేర్పడినవని సూత్రాంధ్రవ్యాకరణములో చెప్పిన చిన్నయసూరి, బాలవ్యాకరణములో ఆ విషయము ప్రస్తావించలేదు.

ఈ రీతిగా బాలవ్యాకరణము, సూత్రాంధ్ర వ్యాకరణము రెండునూ చిన్నయసూరి కృతులే అయినప్పటికి, రెండిటిలో కొంత భేదము కనిపించును.

ఒకదానిలో చెప్పని విషయాలను మరొకదానిలో చెప్పుట గోచరించును. మొత్తముమీద రెండింటికి సామ్యమెక్కువగా ఉన్నదనుటలో విప్రతిపత్తిలేదు.

చిన్నయసూరి సంస్కృతభాషలోగూడ సూత్రరచనను నైపుణ్యముతో చేసినాడు. చింతామణి, అథర్వణకారికావళులను పరిశీలించి వానిని మార్గదర్శకములుగా స్వీకరించినప్పటికి, బాలవ్యాకరణము ప్రామాణికత్వమును పొందుటకు చిన్నయసూరి రచనా ప్రణాళిక, సూత్ర రచనాశైలి, లక్ష్యప్రదర్శన-ముఖ్య కారణములని చెప్పక తప్పదు.

సూత్రాంధ్ర వ్యాకరణ రచన అసంపూర్ణముగా నిలిచిపోవుట తెలుగువారి దురదృష్టము.

ఇంతవరకు సంస్కృత భాషలో వ్రాయబడిన తెలుగు వ్యాకరణాలను పరిశీలించినాము. ఇక తెలుగు భాషలో పద్యరూపములోను, సూత్రరూపములోను రచింపబడిన వ్యాకరణాలను పరిశీలింతము. వానిలో—

1) ఆంధ్రభాషా భూషణము

2) కావ్యాలంకార చూడామణి

3) ఛందో దర్పణము

4) కవి చింతామణి

5) కవి జన సంజీవని

6) ఆంధ్ర కౌముది

7) సర్వలక్షణసార సంగ్రహము

8) కవి సంశయ విచ్ఛేదము

9) నారాయణీయాంధ్ర వ్యాకరణము

అనునవి పద్యరూపములో రచింపబడిన తెలుగు వ్యాకరణాలు. ఈ అన్నింటిలోను కేతన రచించిన ఆంధ్రభాషాభూషణము మొట్టమొదటిది. తెనుగు భాషకు తనకంటె పూర్వమెవ్వరును వ్యాకరణము వ్రాయలేదని, తానే మొదటి వ్యాకరణ రచయితనని

కేతన చెప్పుచున్నాడు. ఈ కేతన తిక్కనకు శిష్యుడు. ఆయనకు తన దశకుమార చరిత్ర నంకితమిచ్చినాడు. కనుక 13వ శతాబ్దపు వాడని స్పష్టము.

ఆంధ్రభాషా భూషణము కృత్, తద్ధిత ప్రకరణ విభాగమునుకాని, వాని ప్రక్రియనుకాని చూపలేదు. కాని కృత్ ప్రత్యయములు కొన్ని, తద్ధిత ప్రత్యయములు కొన్ని కలగలుపుగ చెప్పబడినవి.

1. కాఁడు-గోనబుకాఁడు, బలిమికాఁడు, కొంటెకాఁడు మొ వి.
2. ఈఁడు- కన్నడీడు(భాష) కపటీఁడు (గుణము) సాలీఁడు (కులము)
3. ఇండి-అభావార్థమాలో-ముక్కిండి, తెరపిండి, వాయిండి, ముప్పిండి.
4. ఆఁడు-బొంకులాఁడు, తగవులాఁడు, జంకులాఁడు
5. అరి-పెంటివెనపరి, ముందరి, తుంటరి, కల్లరి
6. అమి-అభావార్థకము-కానమి-వినమి.
7. మి, ఇమి-భావార్థకము-తాల్మి, కూరిమి.
8. తన-ధర్మవాచకము-మంచితనము, లోభితనము.
9. అడు, ఈడు, కర్తె, కర్త్రర్థకాలు.
బోఁడి-స్త్రీ వాచకము
అట్టివాఁడు, ఇట్టివాఁడు మొదలగు శబ్దములకు మారుగా, అట్టీఁడు, ఇట్టీఁడు, ఎట్టీఁడు.
10. ఇన-భూతార్థకము-పండినవాఁడు, పొడిచినవాఁడు.
11. మానెఁడు, కానెఁడు-పరిమాణార్థకములో ఎఁడు ప్రత్యయము.
12. తింట, కొంట, కంట, వింట, అంట అను రూపములు తినుట, కొనుట మొదలగువానికి బదులుగా వ్యవహారములో ఉన్నవనికూడ ఆంధ్రభాషా భూషణము పేర్కొన్నది.

పైవానిలో కాఁడు, ఈఁడు, ఇండి, ఆఁడు, తన, ఎఁడు, అరి ప్రత్యయాలు తద్ధితాలు, కాఁడు, ఈఁడు మత్వర్థములోను, ఆఁడు ప్రత్యయము, తాచ్ఛీల్యార్థములోను

6-ఆం-భా-భూ-161వ పద్యంనుండి

ఇంచి అనునది అభావార్థములోను వచ్చునని వానికిచ్చిన లక్ష్యములవలన తెలియు చున్నది. ఇతర లాక్షణికులు 'ఇఁడి' అని అర్ధానుస్వారయుక్తముగా చెప్పిన ప్రత్యయ మును కేతన 'ఇంచి' అని పూర్ణానుస్వారయుక్తముగా చెప్పినాడు. -

అమి, ఇమి, ఇన, ట అను ప్రత్యయాలు కృత్తులలో చేర్పదగినవి. అమి, ఇమి, ట ప్రత్యయాలు నామనిష్పాదకాలు కాగా, 'ఇన' ప్రత్యయము క్రియాజన్యవిశే షణముల నందించును.

ఓనుట మొదలగు శబ్దములకు ఓంట మొ రూపాంతరములున్నట్లు అనాడికే గుర్తించి, ఆ ప్రయోగాలకు ప్రామాణికత్వము నంగీకరించుట గమనార్హము. తాల్మి, కూరిమి అని రెండు విధముల ఉదాహరణములను చూపుటద్వారా, ఇమి ప్రత్యయము లోని 'ఇ' కారము పాక్షికముగా లోపించునను విషయము నిరూపించబడినది.

ధర్మవాచకమైన 'తన' ప్రత్యయము ఆచ్ఛికములమీద, తత్సమముల మీద కూడ చేరు ననుటను మంచితనము, లోభితనము అను లక్ష్యములద్వారా చూపినాడు కేతన.

ఆంధ్రభాషా భూషణము ప్రతిపాదించిన ప్రత్యయాలలో కపటీఁడు, లోభి తనము అను శబ్దములలోని ఈఁడు, తన ప్రత్యయాలు మాత్రము, తత్సమ ప్రకృ తుల మీద వచ్చినవి. తక్కిన అన్ని ఉదాహరణములు దేశ్య ప్రకృతితో కూడినవి. కపటీఁడు అను శబ్దము సూర్యరాయాంధ్ర నిఘంటువులో లేదు.

కేతన అభావార్థములో 'ఇంచి' ప్రత్యయమును చెప్పి, ముక్కించి, వెరవించి అని ఉదాహరించినప్పటికి, తరువాతి వ్యాకర్తలందరు 'ఇఁడి' ప్రత్యయమునే చెప్పినారు. ఓక్కన భారతములో వెరవిఁడి (ద్రోణ- 2-48) కట్టిఁడి (భీష్మ 1-68) వంటి ప్రయోగములున్నవి. శ్రీనాథుడు 'ఉప్పించి' అను పదమును ప్రయోగించినాడు. కాని ఇది అభావార్థము కాదు.

ఆంధ్రభాషాభూషణము ఈ విధముగా కృత్తులను, తద్ధితాలను కలగలిపి సంకీర్ణముగా ప్రతిపాదించినది. దీనివలన అప్పటికి ఇంకను తెలుగు వ్యాకరణములో కృత్తద్ధితాల విషయములో స్పష్టమైన వివేచన ఏర్పడలేదని గమనించవచ్చును.

## కావ్యాలంకార చూడామణి

ఇది విన్నకోట పెద్దన రచించిన లక్షణ గ్రంథము. దీనిలో వ్యాకరణాంశాలతో పాటు అలంకారశాస్త్రమునకు సంబంధించిన విషయాలు కూడ కొన్ని చెప్పబడినవి.

పెద్దన కృత్తులను ప్రత్యేకముగా పేర్కొనలేదు. తద్ధిత ప్రత్యయాలను మాత్రమే—

"అరియిఁడి కాఁడాఁడు అయన
ధరలోనొక కొన్ని చెల్లుఁ దద్ధిత పదముల్
వరుసన్ వాని నెఱుంగుట
పరమ పవిత్రము మంత్రి భాషా కవితన్"

అని ఒక పద్యములో చెప్పినాడు. ఈ ప్రత్యయాలకు మరొక సీస పద్యములో ఉదాహరణములను చూపినాడు. అరి, ఇఁడి, కాఁడు, ఆఁడు, అయి — అను అయిదు తద్ధితాలను మాత్రము చెప్పి వానికే లక్ష్యముల నిచ్చినాడీ గ్రంథకర్త.

నూఁటరి, ముంటరి, కత్తరి మొదలగునవి అరి ప్రత్యయమునకు. ఉప్పిఁడి, ప్రాయిఁడి మొదలగునవి ఇఁడి ప్రత్యయమునకు, నీటుకాఁడు ఉమదులాఁడు. దబ్బలి మున్నగు శబ్దాలు ఆఁడు, అయి ప్రత్యయాలకు ఉదాహరణములుగా చూపబడినవి.

కావ్యాలంకార చూడామణిలో చప్పిఁడి, శబ్దము ఇఁడి ప్రత్యయానికుదాహరణముగా చెప్పబడినది. కాని నిఘంటువులలో చప్పిడి శబ్దము అర్థానుస్వారరహితముగ కనబడుచున్నది. 'తప్పిఁడి, చిక్కిఁడి' అను శబ్దములు దీనిలో "ఇఁడి" ప్రత్యయాంతాలుగా చూపబడినవి. కాని నిఘంటువులలో ఈ శబ్దములు కాన్పించవు.

పై ప్రత్యయాలలో ఏది ఏ అర్థములో వచ్చునను విషయమును గూర్చి ఈ గ్రంథములో వివరణ లేదు. తన, ఱిక వంటి ప్రసిద్ధ తద్ధిత ప్రత్యయాల ప్రసక్తి దీనిలో కానరాదు.

మొత్తము మీద కావ్యాలంకార చూడామణిలో కృత్తులను స్పృశించక విడుచుట, తద్ధితాలను అసమగ్రముగా ప్రతిపాదించుట మనము చూడగలము. ఇది ప్రధాన

ముగా అలంకారశాస్త్రమును ప్రతిపాదించు గ్రంథము కనుక వ్యాకరణాంశములు చాలా సంగ్రహముగా తెలుపబడినవి.

## కవిచింతామణి

వెల్లంకి తాతంభట్టు రచించిన "కవి చింతామణి" అముద్రితము. ఇప్పుడు లభ్యమైన దీని భాగములో భాషా లక్షణాధికారము, వర్ణనిర్ణయాధికారము, వళిప్రాసాధికారము, దోషాధికారము అను నాలుగు ప్రకరణాలున్నవి. వీనిలో మొదటిరెండు వ్యాకరణానికి సంబంధించినవి. ఈ ప్రకరణాలలో తత్సమాది విషయములను, సమాసములను, శకటరేఫ విషయములను, కారకములను గూర్చి శాస్త్రీయముగా చర్చజరిగినది. తాతంభట్టు సంస్కృతవ్యాకరణములో విశేషపాండిత్యము కలవాడు.

లభ్యమైన భాగము కాక, మరికొంత గ్రంథము తప్పక ఉండి యుండునని పరిశీలకుల తలంపు. లబ్ధభాగములో కృత్తద్ధిత ప్రత్యయాల ప్రస్తావన లేదు.

వ్యాకరణము, ఛందస్సు, అలంకారశాస్త్రములకు సంబంధించిన విషయాలను ఒకే గ్రంథములో చేర్చి, రచించుట అప్పటి సంప్రదాయముగా కనబడుచున్నది. ఇవన్నియు ఒక విభాగమునకు చెందినవి గానే వారు భావించినట్లు తోచును. కావ్యరచనకు, అధ్యయనానికి గూడ పై మూడు విషయముల నెరుగుట అత్యావశ్యకమై యుండెడిది.

అప్పకవీయము ప్రధానముగా ఛందోగ్రంథమైనప్పటికీ, దానిలో వ్యాకరణ విషయాలు స్వల్పముగానైనను చోటుచేసుకున్నవి. ఆంధ్రభాషాభూషణము, కావ్యాలంకార చూడామణి, చింతామణి, కవిజన సంజీవని మొదలగు గ్రంథములన్నియు వ్యాకరణ విషయాలతో ఇతర విషయములను జోడించి రచింపబడినవే.

## ఆంధ్రకౌముది

గణపవరపు వేంకటకవి తెలుగులో పద్యరూపమున "ఆంధ్ర కౌముది"ని రచించినాడు. ఈయన క్రీ. శ. 17వ శతాబ్దమువాడు. వేంకటకవి "సర్వలక్షణ

ిరోమణి" అనుమహాగ్రంథమును రచింపగా, దానిలోని తృతీయోల్లాసము మాత్రము వ్యాకరణ విషయాలను ప్రతిపాదించునదిగా ఉన్నది. దానికే ప్రత్యేకముగా "ఆంధ్ర కౌముది" అని పేరు పెట్టబడినది.

గణపవరపు వేంకటకవి తెలుగులోని ఆంధ్రభాషా భూషణము, కావ్యాలంకార చూడామణి, కవిచింతామణి గ్రంథాలను చక్కగా పరిశీలించి వాని ప్రభావముతో ఈ గ్రంథమును రచించినాడు. భట్టోజీదీక్షితుడు రచించిన "సిద్ధాన్తకౌముది" అను సంస్కృత గ్రంథముతో కూడ ఈయనకు చాలినంత పరిచయమున్నట్లు తెలియుచున్నది. ఆంధ్రకౌముదిలోని విషయప్రణాళిక, భాషాభూషణాదులకంటె విశాలముగా ఉన్నది. అంతేకాక, పూర్వవ్యాకరణాలలో చూపింపబడని ఆంధ్రకవుల ప్రయోగాలు దీనిలో ఆయా సందర్భాలలో ప్రదర్శింపబడినవి.

ఆంధ్రకౌముదిలో—ఆంధ్రోద్భవకారణము, పంచవిధాంధ్రభాషా స్వరూపము, సంజ్ఞాప్రకరణము మొదలగు 15 విభాగములలో ఆయా విషయములు విపులముగా చర్చింపబడినవి. ప్రస్తుత పరిశోధనా విషయములైన కృత్తద్ధితములను గూర్చి కూడ వేంకటకవి ప్రత్యేకముగా వివరించినాడు.

"తద్ధితపదనిష్పత్తి" అను ప్రకరణములో మతుబర్థకములైన కాఁడు, గాఁడు, ఆఁడు, వాఁడు, అరి, ఈఁడు, ఇఁడి అను ప్రత్యయాలను మాత్రము చెప్పి వానికి లక్ష్యములను చూపినాడు. కాఁడు, గాఁడు మొదలగు వానిలో 'డు' ప్రథమైక వచన ప్రత్యయము కనుక 'కా, గా' అనువానినే ప్రత్యయములని భావించుట సము చితముగా తోచును. పరిమాణార్థకమగు 'ఎఁడు' ప్రత్యయము, ఈ ప్రకరణములో చెప్ప దగినవి. ఇంతేకాక, భావార్థక, స్వార్థబోధక, తాచ్ఛీల్యార్థకములైన తద్ధిత ప్రత్యయము లను గూర్చి ఈ ప్రకరణములో ప్రస్తావించలేదు. ఆంధ్రభాషాభూషణములో చెప్పిన ప్రత్యయములే ముఖ్యముగా దీనిలో ప్రతిపాదింపబడినవి. కాని, ఎందుచేతనో ధర్మి వాచకమైన తన ప్రత్యయము వదలివేయబడినది. టిక, తన ప్రత్యయాంత శబ్దములను కృదంత సందర్భములో చెప్పినాడు గ్రంథకర్త. కృత్తులను, తద్ధితాలను కలగలుపుగా చేసి చెప్పెడి, సంప్రదాయమాంధ్రభాషాభూషణము నాటినుండి కనపడుచున్నది.

దీనిలో "కృదంత ప్రత్యయరీతి భావార్థ ప్రతిపాదనము" అనుపేరితో 18వ ప్రకరణమున్నది. ఈ ప్రకరణములో కృదంత రూపములు, భావార్థక ప్రత్యయాంత ములు కూడ వివరింపబడినవి. వు, త ఇక మొదలగు కృత్తులను, వలపు, కోతవంటి లక్ష్యములతో గూడ వేంకటకవి ప్రదర్శించినాడు.

భావార్థకముగా ఇతర లాక్షణికులు 'ట' ప్రత్యయమును చెప్పగా ఆంధ్ర కౌముది కర్త 'ఉట' ప్రత్యయమనుట విశేషము. సాధారణముగా తెలుగు ధాతువులు ఉకారాంతములై ఉండును. కనుక దీనివలన భేదమేమియు కలుగదు

కోరదము, కొనరదము మొదలగు అద ప్రత్యయాంతములకు సాధుత్వము నంగీకరించుట, అట్లే తిరుగుడు, పొడుగుడు వంటి శబ్దములను 'ఉడు' ప్రత్యయాంత ములని చెప్పి వానిని సాధువులుగా స్వీకరించుట వేంకటకవి భాషాపరిణామదృష్టికి నిదర్శనాలు.

కినుట మున్నగువానికి కంట మొదలగు రూపాంతరాలున్న వని ఈయనకూడా తెలిపినాడు.

కృదంత ప్రక్రియను గూర్చి వేంకటకవి కంటె పూర్వలాక్షణికులెవ్వరు కూడ, ఇంత విపులముగా వివరించలేదు. తరువాత కూడ చిన్నయసూరి తప్ప మరెవ్వరును ఇంత విస్తరముగా చర్చించలేదు.

దుక్కి-శబ్దము 'కి' ప్రత్యయాంతమని, ఇతర వ్యాకర్తలెవ్వరు చెప్పని విష యము నాంధ్ర కౌముది ప్రతిపాదించినది.

వ్యవహారములో కనిపించు కోరదము, కొనరదము, తిరుగుడు, పొడుగుడు వంటి శబ్దములను గూడ వ్యాకరించి, ప్రాచీన లాక్షణికులు సాధుత్వము చెప్పని వానిని గూడ స్వీకరించి ఆంధ్రకౌముదీ కారుడు నవీన దృక్పథమును ప్రదర్శించినాడు.

ఈ విధముగా గణపవరపు వేంకటకవి తన ఆంధ్రకౌముదిలో తనకు ముందున్న వ్యాకరణ గ్రంథాలలో లేని ఎన్నో విషయాలను ప్రతిపాదించి ఉన్నాడు. ఈతనికి సంస్కృత వ్యాకరణ పరిచయము కూడ ఉన్నందున ఈ గ్రంథమునకు కొంత

వైలక్షణ్యము కలిగినది. పద్య వ్యాకరణ కర్తలలో ఆంధ్ర కౌముదీ కర్తకొక ప్రత్యేక స్థానమున్నది.

## నారాయణీయాంధ్ర వ్యాకరణము

పర్ణ నారాయణశాస్త్రి చింతామణ్యథర్వణ కారికలమార్గమునననుసరించి పద్య రూపములో దీనిని రచించినాడు. దీనికి వారి కుమారుడు గణపతి శాస్త్రి వివరణము వ్రాసినాడు. దీనిలో కృదంత, తద్ధిత ప్రకరణములు ప్రత్యేకముగా సమకూర్పబడినవి.

కృదంత ప్రకరణములో 30కి మించి కృత్ ప్రత్యయాలను గ్రంథకర్త పేర్కొన్నాడు. వానిలో బాలవ్యాకరణములో చెప్పబడిన 21 ప్రత్యయములు ప్రౌఢ వ్యాకరణములోనివి 7 చేరి ఉన్నవి. ఇవికాక పై రెంటింటిలోను కనిపించని 'అలి', 'దు', ఇత, అను మూడు ప్రత్యయములు అధికముగా చెప్పబడినవి.

కాచు, పీచు, తిరుగు ధాతువులమీద 'అలి' ప్రత్యయమువచ్చి, కాచు, పీచుల చకారానికి వకారమాదేశమై 'కావలి', 'పీవలి' శబ్దములు నిష్పన్నమగునని నారాయణీయము చెప్పుచున్నది. ప్రౌఢవ్యాకరణములో కాచు, పీచుల మీద 'వలి' ప్రత్యయమగునని చెప్పి ధాత్వంత 'చు' లోపముతో రూపసాధన చేయబడినది. కాని 'తిరుగలి' శబ్దము కొరకు 'అలి' ప్రత్యయమును చెప్పుట అవశ్యకము కనుక 'వలి, అలి అను రెండు ప్రత్యయములను చెప్పుటకంటె నారాయణీయకర్త చెప్పిన విధానమే లాఘవముతో కూడి ఉన్నది.

ఈ విధానములో ఒక్క 'అలి' ప్రత్యయముతోనే రూపసిద్ధి జరుగును కాచు పీచుల చకారమునకు వకారాదేశము మాత్రము చెప్పిన చాలును.

అమ్ముడు, క్రమ్ముడు, ద్రెంచుడు మొదలగు రూపములు భావార్థక 'డు ప్రత్యయాంతములుగా ఈ గ్రంథములో చూపబడినవి. ఇటువంటి ప్రయోగాలను కవిత్రయము చేయకన్నను, అనంతర కవులు చేసినారు.

బాలవ్యాకరణములో అనంతర్యార్థమున 'దున్' ప్రత్యయమును చెప్పి "జాబిలితో తెంపుడుంగువలయంబులు వికసించె" అని ఉదాహరణమీయబడినది. కాని పై ప్రత్యయమునకు, దీనికి అర్థములోను, స్వరూపములోను భేదము కలదు. అనంతర్యార్థక 'దు' ప్రత్యయాంతములవ్యయములుకాగా, భావార్థక 'దు' ప్రత్యయాంతములు నామవాచకములగుచున్నవి.

నారాయణీయములో వైకృత శబ్దాలు వ్యుత్పన్నములు, అవ్యుత్పన్నములని రెండు రకములుగా విభజింపబడినవి. గోడ, మేడ, వేరు, బావి మొదలగునవి అవ్యుత్పన్న శబ్దములవి, ఆక, రాక, మొలక, ఏలిక వంటి శబ్దములు కర్తృ కర్మాద్యర్థములలో వ్యుత్పన్నములని వివరింపబడినది.

కృత్ ప్రత్యయస్వరూపము "ధాతువులకు విధింపబడి క్రియావిశేషములు కాకుండునవి కృత్తులనబడును" అని నిర్వచించినది నారాయణీయము. ఇది చిన్నయసూరి బాలవ్యాకరణములో చెప్పిన లక్షణమునకు దాదాపు ప్రతిరూపముగా ఉన్నది.

ఈ వ్యాకరణము ప్రధానముగా చింతామణిని, అథర్వణ కారికలను సమన్వయించుచు వ్రాయబడినదే కాని, బాలవ్యాకరణమునకు గాని, ప్రౌఢ వ్యాకరణమునకు గాని పూరకముగా లేక సవరణగా వ్రాయబడినది కాదు. ఇది పద్యమయ వ్యాకరణమైనప్పటికీ, అచటచట కొంతభాగము మాత్రవక్క్యలో గూడ రచింపబడినది.

తద్ధిత ప్రత్యయ లక్షణమును నారాయణీయమీవిధముగా ప్రతిపాదించినది.

"తత్సమ, తద్భవదేశ్యము లందు విభక్త్యంతములగు విశేష్య విశేషణంబుల మీద భావాద్యర్థంబులందు వచ్చు ప్రత్యయములు తద్ధిత ప్రత్యయములనబడును. కొంత దీర్ఘముగా ఉన్నప్పటికీ లక్షణము సమగ్రముగా ఉన్నదని చెప్పవచ్చును.

నారాయణీయములో, తన, క, కాడు మొదలగు తద్ధిత ప్రత్యయములు సోదాహరణముగా ప్రతిపాదింపబడినవి. వీనిలో బాలవ్యాకరణము చెప్పిన 17 తద్ధితాలు చేరి ఉన్నవి. 'తు' ఆచే ఆ, అము, ఉక్, అను 5 ప్రత్యయములు బాలవ్యాకరణములో

చెప్పబడినవి దీనిలో కన్పించవు. ఉక ప్రత్యయానికి బదులు 'క' ప్రత్యయమును చెప్పినట్లు తోచును.

చిన్నయసూరి చెప్పని ఇత, టి, అర, కార, గార, ఆఁడు, ఇరి, అసి, కోరు, దారు, ర, ఏసి, మయట్, క, ఇద అను 15 ప్రత్యయములను నారాయణీయ కర్త అధికముగా ప్రతిపాదించినాడు. వీనిలో ఆఁడు, ఇరి, కార, ఇత, టి, మయ' అను 7 ప్రత్యయములు మాత్రము ప్రౌఢ వ్యాకరణములో చెప్పబడినవి.

పై ప్రత్యయములలో కార-గార, ఇత-ఇద, కా-కాఁడు, అనుజంటలు ఒకే ప్రత్యయముయొక్క భిన్నరూపములని తలవవచ్చును. చిన్నయసూరి 'కా, ఆ, ఈ ప్రత్యయాలుగా పేర్కొన్న వానిని ఇతర లాక్షణికులు కాఁడు, ఆఁడు, ఈఁడు అని పేర్కొన్నారు.

## సూత్రాత్మక రచనలు

సూత్రాత్మక రచనల్లో మొట్టమొదట పేర్కొనదగినది బాలవ్యాకరణము. దీనిని చిన్నయసూరి రచించినాడు ఆయన సంస్కృత ద్రావిడాంధ్ర భాషలలో తగినంత పాండిత్యము గలవాడు. చిన్నయసూరి కంటె ముందు తెలుగులో వ్యాకరణ గ్రంథాలు లేకపోలేదు. కాని బాలవ్యాకరణములో ఉన్న స్పష్టత, సమగ్రత వీనిలో లేవు.

చిన్నయసూరి తనకు పూర్వమున్న చింతామణిని, దాని వ్యాఖ్యలను, ఆంధ్ర భాషా భూషణాది వ్యాకరణములను బాగుగా పరిశీలించి సరియైన ప్రణాళికతో వ్యాకరణ మును రచించినాడు. అది సర్వసమగ్రము కాకపోయినను, అనాటికి వచ్చిన తెలుగు వ్యాకరణము లన్నింటిలో తలమానికమని చెప్పదగి యున్నది. పండితుల మన్ననలంది, ప్రామాణిక వ్యాకరణ గ్రంథముగా గుర్తింపును పొందినది. ఈనాటికి కూడ దాని స్థానము సమున్నతముగానే ఉన్నది.

సూరి చెప్పక విడిచిన విషయాలను తరువాత ప్రౌఢవ్యాకరణము, ముక్త లక్షణకౌముది, ఆంధ్ర భాషాను శాసనము వంటి వ్యాకరణ గ్రంథాలు ప్రతిపాదించి ఆలోటును పూరించినవి.

చిన్నయసూరి బాలవ్యాకరణ రచనకు ముందు శబ్దలక్షణ సంగ్రహము, ఆంధ్ర శబ్దాను శాసనము, పద్యాంధ్ర వ్యాకరణము, అక్షరగుచ్ఛము, విభక్తిబోధిని— అను వ్యాకరణ గ్రంథాలను రచించినాడు. సంస్కృత భాషలో "సూత్రాంధ్ర వ్యాకరణము"ను రచించిన విషయము నింతకు పూర్వమే చెప్పి ఉన్నాను.

ఈ విధముగా ఒక చక్కని ప్రణాళికతో ధృఢ దీక్షతో తెలుగు వ్యాకరణ రచన కాయన పూనుకున్నాడు. సంస్కృతములో రచింపబడిన సూత్రాంధ్ర వ్యాకరణమునకే ఆంధ్ర శబ్దానుశాసనమని నామాంతరమున్నట్లు డా అమరేశం రాజేశ్వర శర్మ తెలిపినారు.[7] వారే ఆగ్రంథములో మరొకచోట "కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారు సూత్రాంధ్ర వ్యాకరణము, ఆంధ్రశబ్దానుశాసనములతో కలిపి పద్యాంధ్ర వ్యాకరణమును ముద్రించినా"రని తెలిపినారు.[8] ఈ వాక్యము వలన సూత్రాంధ్ర వ్యాకరణము, ఆంధ్ర శబ్దాను శాసనములు భిన్నములని చెప్పినట్లైనది.

పై రెండు వాక్యములకు సమన్వయము కుదురకున్నది. ఆంధ్ర శబ్ద శాసనమను పేరుతో మరొక పుస్తకమున్నది. దానినే వారు ప్రమాదవశమున ఆంధ్ర శబ్దాను శాసనమని పేర్కొని యుండవచ్చును.

## శబ్ద లక్షణ సంగ్రహము

సంస్కృతములోని సూత్రాంధ్ర వ్యాకరణమును చిన్నయ సూరి తెనిగించి దానికి శబ్దశాసనమని పేరుపెట్టి తరువాత దానిని మరికొంత సంస్కరించి, క్రీ. శ. 1853 లో "శబ్ద లక్షణ సంగ్రహ" మను పేరుతో ముద్రించినాడని శ్రీ దువ్వూరి వెంకటరమణ శాస్త్రి రమణీయ గ్రంధావతారికలో తెలిపినారు.

శ్రీనిడదవోలు వెంకటరావు "శబ్దలక్షణ సంగ్రహములోనివిగా పేర్కొన్న సూత్రములు పరిషత్తువారు ముద్రించిన ఆంధ్రశబ్దాను శాసనములో ఉన్నవి. కనుక కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారు ముద్రించిన ఆంధ్రశబ్దాను శాసనమే శబ్ద

---

7 ఆంధ్ర వ్యాకరణ వికాసము భా-2. పుట 241

8 ఆం-వ్యా-వికాసము భా-2. పుట 238

లక్షణ సంగ్రహమని తేలుచున్నది." అని అభిప్రాయపడినారు. పేర్లలో కొంత తిక మక ఉన్నప్పటికీ, చిన్నయసూరి తెలుగులో సూత్రరూపములో రచించిన వ్యాకరణ గ్రంథము బాలవ్యాకరణము కంటె భిన్నమైనది మరొకటున్నదను విషయము స్పష్టము. అదే శబ్దలక్షణ సంగ్రహము

కొండపీటి వెంకటకవి, 'కవిరాజ గ్రంథమాల పొన్నూరు' వారిద్వారా ప్రచు రించిన ప్రతి నాకు లభించినది. ఇది క్రి. శ. 1958 సం లో ముద్రితమైనది.

దీనిలో పంచమ పరిచ్ఛేదము తద్ధిత ప్రక్రియను ప్రతిపాదించినది- ఎఁడు, అరి, ఇ, ఇఁడి, త, కత్తియ, కాఁడు, తనము, మి, అికము, స, క,' అను ప్రత్య యాలను చెప్పి "మతుబర్థాదులందు లాఁతులుం బెక్కులు గలవు" అని సూత్రించి నాడు గ్రంథకర్త.

"ఉగ్మలి, ముత్యము, జోస్యము, అప్ప, ఇష్ట, ఎప్ప, కాయ్వు, చెయ్వి, ఎద్దుట, చెద్దుము-అను శబ్దాలు నిపాతములుగా ఒక సూత్రములో చెప్పబడినవి. వీనిలో జోస్యము శబ్దము తద్భవము. ఉగ్మలి శబ్దమును తిక్కన ప్రయోగించినాడు. 'చెయ్వు' శబ్దము బహువచన రూపము "చెయ్వులు". చెయ్వి శబ్దమును కూడ తిక్కన ప్రయోగించినాడు.

అరమరిక మొదలగు శబ్దముల సాధనకు ఇక ప్రత్యయమును విడిగాచెప్పక, చిఱుతాదుల మీద స్వార్థములో వచ్చు 'క' ప్రత్యయమునే గ్రహించి "అరమరాదుల కిత్వంబగు" అను సూత్రములో అంత్యవర్ణమున కిత్వము సూత్రము విధించినాడు శబ్ద లక్షణ సంగ్రహకర్త. దీనివలన ప్రక్రియా లాఘవము కలిగినది.

"కదల్యాదుల కిత్వంబగు" అను సూత్రముద్వారా 'కదలు' శబ్దముపైన మత్వర్థములో 'ఇ' ప్రత్యయమును చెప్పి 'కదలి' శబ్దరూపమును సాధించుట సముచిత ముగా ఉన్నది.

చతుర్థ పరిచ్ఛేదములో కృత్తులను గూర్చిన ప్రస్తావన స్వల్పముగా ఉన్నది. "వికృతిం బెక్కులు కృదర్థకి వికారంబులు గలవు" అని మొదట సూత్రించి, తరు

వాటి సూత్రములలో ట, మి వర్ణకాలు భావార్థములోను, వ్యతిరేకార్థములోను క్రమముగా వచ్చునని చెప్పబడినది. ఇతర కృత్ ప్రత్యయాల ప్రసక్తి దీనిలో లేదు.

ఈ శబ్దలక్షణ సంగ్రహము కూడ అసంపూర్ణ రచన అని భావింపవలసి ఉన్నది ఈ గ్రంథము చిన్నయసూరి కృతము కాదని కట్టెసం మూర్తిశాస్త్రి "ఆంధ్ర ధాతుమాల" పీఠికలో వ్రాసినారని, వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి తెలిపినారు.

దీనిని మొట్టమొదట ఏలూరు మంజువాణీ ముద్రణాలయమువారు ప్రచురింపగా తరువాత కవిరాజ గ్రంథమాల వారు వారు పునర్ముద్రణ కావించినారు. ఈ పుస్తకమునకు వ్యాఖ్యలేకపోవుటచేత కొన్ని సూత్రముల కర్థము దుర్బోధముగా ఉన్నది.

బాలవ్యాకరణములో లేని పెక్కు విషయాలు సూత్రాంధ్ర వ్యాకరణము లోను, శబ్దలక్షణ సంగ్రహములోను ఉన్నవి. వీనితో పాటు పద్యాంధ్ర వ్యాకరణము, ఆంధ్రశబ్దానుశాసనము ఇవి అన్నీ చేరి బాలవ్యాకరణమొక ప్రామాణికమైన వ్యాకరణముగా అవతరించుటకు దోహదాలయినవని చెప్పవచ్చును.

## బాలవ్యాకరణము

చిన్నయసూరి దీనిలో ఇతర ప్రకరణాలతో పాటు 'కృత్', 'తద్ధిత' ప్రకరణాలను కూడ ప్రత్యేకముగా విపులముగా ప్రతిపాదించినాడు. ఈయన కృత్సంజ్ఞను, "ధాతువునకు విహితంబగు దుజ్భిన్న ప్రత్యయంబు కృత్తనంబడు[9]" అని నిర్వచించినాడు. "డుజ్, రు, వు, రు, ను, ముఙ్" అనునవి తెలుగు ధాతువుల మీద చేరు క్రియావిభక్తి ప్రత్యయములు, వానిలోని ఆద్యంతాక్షరములను చేర్చి పలుకగా డుఙ్ ప్రత్యాహారమైనది. సంస్కృత వ్యాకరణ సంప్రదాయము ననుసరించి ప్రత్యాహారము మధ్యగతము లన్నింటిని—మొదటి వర్ణముతో సహా బోధించును.

ధాతువులకంటె పరముగా వచ్చు ప్రత్యయాలలో క్రియా విభక్తులను విడిచి తక్కినవానికి కృత్తులని పేరు అనిపై నిర్వచనమున కర్థము. ఇది పాణిని అష్టాధ్యాయికో

9 బాల వ్యాకరణము. కృదన్త. 1

"కృత్యతిఙ్" అను సూత్రములో చెప్పిన నిర్వచనమును పోలి ఉన్నది. "తిఙ్" అనునది సంస్కృత క్రియా విభక్తులను సూచించు ప్రత్యాహారము.

చిన్నయసూరి అనేక విషయాలలో సంస్కృత వ్యాకరణ సంజ్ఞలను, సంప్రదాయాలను అనుసరించినాడు. తక్కిన లాక్షణికులు కూడా ఆ మార్గమునే అవలంబించినారు. తెలుగు భాష సంస్కృత జన్యమను దృఢ విశ్వాసమువలననే ఈ అనుసరణ జరిగియుండవచ్చును. వ్యాకరణము కాని, అలంకార శాస్త్రము కాని ఛందస్సు కాని, నాటక లక్షణములు కాని సంస్కృత ప్రభావము లేనంత తెలుగులో రాలేదు. అనేక చారిత్రక కారణాలవలన ఈ పరిణామము సంభవించినది.

సూరి చెప్పిన కృత్సంజ్ఞా నిర్వచనము ప్రకారము, శత్రర్థక, ఆనంతర్య, తుమున్నర్థక, క్త్వార్థక, చేదర్థకాలు కూడ కృత్ ప్రత్యయములుగా పరిగణింపబడవలసి ఉన్నది. కాని బాలవ్యాకరణములోని కృదంత ప్రకరణములో పై ప్రత్యయములను చెప్పలేదు. ఇవి అన్నీ క్రియా పరిచ్ఛేదములోనే చేర్పబడినవి, నామ నిష్పాదకములైన 'క' మొదలగు ప్రత్యయములను మాత్రము సూరి కృదంత ప్రకరణములో చెప్పినాడు.

దీనివలన సూరి తాను స్వయముగా నిర్వచించిన కృత్సంజ్ఞను తన బాల వ్యాకరణములో అనుసరించలేదని తెలియుచున్నది. శత్రర్థ కాది ప్రత్యయాంతములు అవ్యయములుగా రూపొందుచున్నవి. కనుక అవి కృదంతములైనప్పటికీ వానిని క్రియా పరిచ్ఛేదములోనే చెప్పి, నామ నిష్పాదక కృత్తులనే కృదంత పరిచ్ఛేదములో చెప్పినాడు.

ఈ పరిశోధనా వ్యాసములో గూడ కర్తృ, కర్మ, భావాద్యర్థములలో విధింపబడి. నామ నిష్పాదకములైన కృత్ ప్రత్యయములను మాత్రము గ్రహించి పరిశీలన జరుపుచున్నాను. అందువలన శత్రర్థకాది ప్రత్యయములను విడిచి పెట్టుట జరిగినది,

బాల వ్యాకరణములో – క, ఇమి, తఙ్, కువ, ట, టు, ప, త, వు, ఇక, సఙ్, బడి, గడ, ఇకి, వు, అ, అక, డు, ఉ, వడి, వి, అవు, ఇ, కలి అను 24 కృత్ ప్రత్యయములు చెప్పబడినవి.

వీనిలో కొన్ని కర్త్రర్థములో, కొన్ని భావార్థములోను, మరికొన్ని కర్మార్థములోను, చేరుచుండును. ఈ ప్రత్యయాలు వచ్చినపుడు సాధారణముగా ధాతువు చివరి వర్ణము లోపించును. అలుగు ధాతువు మీద 'క' ప్రత్యయము చేరగా (అలుగు + క) ధాత్వంత వర్ణము లోపించి "అలుక" రూపము సిద్ధించును.

పడు, చెడు మొదలగు ధాతువుల మీద 'టు' ప్రత్యయము చేరినప్పుడు, అంత్యవర్ణము లోపించుట మాత్రమే కాక, మొదటి అచ్చు దీర్ఘముగా మారుట కూడ కన్పించును. దానివలన పడు + టు = పాటు, చెడు + టు = చేటు మొదలగు రూపము లేర్పడుచున్నవి.

అలుక, పాటు వంటివి భావార్థకాలు కాగా మొలక. మూఁక మొదలగు శబ్దములలోని 'క' ప్రత్యయము కర్త్రర్థములో వచ్చినది. ఆట. పాట వంటి చోట్ల 'ట' ప్రత్యయము కర్మార్థకము.

ఒక ప్రత్యయమే వేర్వేరు ధాతువుల మీద భిన్నార్థములలో వచ్చుట కలదు. 'తఙ్' ప్రత్యయము పూఁత పూయు + త) అను శబ్దములో కర్మార్థములోను, మూఁత (మూయు + త) శబ్దములో కర్త్రర్థము లోను, వ్రాఁత (వ్రాయు + త) శబ్దములో భావార్థములోను కన్పించుచున్నది.

ఇదే విధముగా అయాకృత్ ప్రత్యయాలు ప్రయోగాలనుబట్టి అర్థవిశేషాలలో గోచరమగుచున్నవి. కొన్నిచోట్ల కరణము, అధికరణము, సంప్రదానము వంటి ఇతర కారకార్థాలలో గూడ ప్రత్యయాలు వచ్చుచున్నవి.

'ఎఱుక' శబ్దములో 'క' ప్రత్యయము కరణార్థమునచేరి జ్ఞానార్థమును బోధించును.—'కలిమి' శబ్దములో 'ఇమి' ప్రత్యయము అధికరణార్థమును బోధించును. 'పొలకువ' శబ్దములో 'కువ' ప్రత్యయము కూడ అధికరణార్థమే.

కృత్ ప్రత్యయాలకు చెందిన క, గ, త, ప, వ, ఇమి అనునవి పరముగా ఉన్నప్పుడు ధాతువు చివరి త, గ, చ, య, వ అను వర్ణములు లోపించునని చిన్నయ

సూరి[10] ఒకసూత్రములో చెప్పినాడు. దీనివలనచాలాచోట్ల ధాత్వంత వర్ణాలకు లోపము కలుగుచున్నది. ఈదు + త = ఈఁత అనుచోట ధాతువు చివరి 'దు' అనునది పై సూత్రములో పేర్కొనబడిన వానిలో చేరనప్పటికి దానికి లోపము వచ్చినది.

'అక' ప్రత్యయము చేరిన శబ్దములన్నియు నపుంసక నామములుగా పరిగ ణింపబడుట వలన వానిమీద 'ము' వర్ణకము వచ్చి మాఱకము, అమ్మకము, ఆఁప కము మొదలగు రూపము లేర్పడుచున్నవి.

కేవల ధాతురూపము మాత్రము మిగిలి నామార్థాన్ని బోధించు చదువు, అదలు, ఒప్పు, ఉబ్బుమొదలగు శబ్దాలను 'ఉ' ప్రత్యయాంతాలుగా చెప్పట జరిగినది కేవలధాతువుకాని, ప్రత్యయముకాని ప్రయోగార్హము కాదని లాక్షణికుల మతము. అందువలన సహజముగా ఉకారాంతములైన ధాతువులే నామార్థమును చెప్పుచోట్ల, ఉకార ప్రత్యయమును చెప్పి కృదంతనామవాచకములుగా పరిగణించుచున్నారు.

'పడి' ప్రకృతులు సిద్ధిలుఁగునది అని కృదంత ప్రకరణములో చివరి సూత్రముగా చెప్పి, వి, అ, పు, ఇ, కలి-అను ప్రత్యయాలను ప్రకృతి శబ్దగ్రాహ్యము లుగా సూరి వివరించినాడు.

ఆటుడు, అమ్మకుడు మొదలగు శబ్దములు భావార్థక 'డు' ప్రత్యయాంతాలుగా పేర్కొనబడినవి.

ఆంధ్ర భాషా భూషణములో కేవలము, "అది, అమి, మి, ఇమి, ఇన, ట- అను కృత్ప్రత్యయములు ఆరింటిని మాత్రము చెప్పగా, కావ్యాలంకారచూడామణిలో కృత్తుల ప్రసంగమేలేదు. బాలవ్యాకరణానికి పూర్వపుదయిన రావిపాటి గురుమూర్తి శాస్త్రి "తెనుగు వ్యాకరణము"లో ఇతర వ్యాకరణాంశాలు ఎక్కువగా ప్రతిపాదింప బడినను, కృత్తద్ధితాలను గూర్చి ఏమీలేదు.

వేదము పట్టాభిరామశాస్త్రి రచించిన "పట్టాభిరామపండితీయము" బాలవ్యాక రణము కంటె సుమారు 40 సంవత్సరములు ముందుగా వ్రాయబడినదని వావిళ్ళ

---

10. బాలవ్యాకరణము కృదన్త-2

వేంకటేశ్వరశాస్త్రి తెలిపినాడు. ఆ గ్రంథము ఆంగ్లేయ విద్యావిధానముతో పరిచయము కలిగిన తరువాత పాఠశాలల బాలబాలికల కొరకు తెలుగులో మొదటిసారిగా వ్రాయ బడిన వ్యాకరణము.

ఈ పట్టాభిరామశాస్త్రి "ఆంధ్రధాతుమాల" అను పేరుతో ధాతు పట్టికను గూడ రచించినట్లు తెలిసినది. కాని అదినాకు లభించలేదు. దీనిలో తెలుగు ధాతువులు వాని అర్థములు, ఆయా అర్థాలలో చేరు ప్రత్యయములు, వానిరూపములు, గ్రాంధిక వ్యావహారిక బాషలలో చూపబడినవట.

పట్టాభిరామ పండితీయము ప్రధానముగా చింతామణి నాధారముగా చేసికొని రచింపబడినది. ఇది పద్యరూపములో ఉన్నది. వావిళ్లవారు దీనిని 1851 సం లో ముద్రించినారు. ఇది పూర్తిగా లభించలేదు. దొరికిన భాగములో కృత్తద్ధిత ప్రసక్తి లేదు.

పూదూరి సీతారామశాస్త్రి "ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము" అను గ్రంథ మును రచించినారు. అది 1834 సం లో మొదటిసారి, 1852 సం॥లో రెండవసారి ముద్రితమైనట్లు తెలియుచున్నది. అనగా బాలవ్యాకరణ రచనకు ముందే ఇది అచ్చయిన దన్నమాట.

తెలుగుబాషలో ప్రశ్నలు-సమాధానముల రూపములో వ్రాయబడిన ఏకైక వ్యాకరణమిది. వ్యాకరణ రచనలో నూతన విధానమును ప్రవేశపెట్టిన ఘనత సీతా రామశాస్త్రిదే.

దీనిలో సంజ్ఞా, సంధి, శబ్ద, కారక, క్రియాపరిచ్ఛేదములున్నవి. ఇదికూడ చింతామణి ప్రణాళిక ననుసరించి వ్రాయబడినదే కనుక కృత్తద్ధితాలను గూర్చిన వివరణ దీనిలో లేదు.

ఈ విధముగా బాలవ్యాకరణము కింటె పూర్వము రచింపబడిన పద్యరూప వ్యాకరణాలలో గాని, సూత్రాత్మకవ్యాకరణాలలో గాని, కృదంత తద్ధితాంతాలను గూర్చి సమగ్రమైన విశ్లేషణ జరుగలేదు. కొన్నిటిలో వాని ప్రస్తావన క్లుప్తముగా చేయ బడగా, మరికొన్నింటిలో వాని ప్రసక్తి లేనేలేదు.

ఇటువంటి పూర్వరంగంతో చిన్నయసూరి తనకు పూర్వమున్న తెలుగు వ్యాకరణములన్నిటిని పరిశీలించి, ఒకచక్కని ప్రణాళికతో బాలవ్యాకరణ రచనకు పూనుకున్నాడు. చింతామణి, వికృతి వివేకములను ప్రమాణములుగా గ్రహించి కూడ, వానిలో చెప్పబడని కారక, సమాస, తద్ధిత ప్రకరణాలు దీనిలో ప్రత్యేకముగా కూర్పబడినవి. కృదంత ప్రకరణము కూడ విడిగా చెప్పబడినది.

బాలవ్యాకరణము సర్వసమగ్రము కాకపోయినప్పటికి, అంతకుముందు రచింపబడిన తెలుగు వ్యాకరణాలన్నింటికంటె పటిష్టమైన ప్రామాణికమైన వ్యాకరణ మని నిస్సంశయముగా చెప్పవచ్చును.

ఇక తద్ధిత ప్రత్యయాల విషయములో చిన్నయసూరి 18టిని వాచ్యముగాను, మరికొన్నింటిని అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబుల నెఱుంగునది' అను సూత్రము ద్వారా సూచన మాత్రముగాను తెలిపినాడు.

తన, టిక, ఇమి, న, ఇక, ఉక, కా, కత్తియ, ఈ, అరి, ఇ, త, అండి, అ, ఇండి, ఎండు, బంటి, కొలది'' అనునవి సూరిచెప్పిన తద్ధితప్రత్యయాలు. వీనిని ఆయాశబ్దాల మీద ప్రత్యేకార్థాలలో సూరి విధించినాడు. పైవానిలో మొదటి అయిదు ప్రత్యయాలు సాధారణముగా భావార్థములో కనిపించును. ఇక ప్రత్యయము మాత్రము అరవరాది శబ్దముల మీద స్వార్థములోను. అగ్గలాది శబ్దములమీద భావార్థములోను చేరుచున్నది. స్వార్థమనగా ప్రాతిపదికార్థము ప్రత్యయము చేరకముందా శబ్దమునకే అర్థమున్నదో అవిచేరిన సముదాయమునకు కూడ అదే అర్థమున్నచోట స్వార్థక ప్రత్యయమని వ్యవహరింపబడును.

చిఱుతాదులమీద 'ఉక' ప్రత్యయము స్వార్థములోనే వచ్చును. కా, కత్తియ ప్రత్యయములు కొన్నిచోట్ల స్వార్థములోను, మరికొన్నిచోట్ల మత్వర్థములోను, కలుగుచుండును. చెలికాండు చెలికత్తియ మొదలగుచోట్ల స్వార్థములోను, ఆటకాండు, బేరగాండు వంటి రూపములలో మత్వర్థములోను వానిని చూడగలము.

'ఈ' ప్రత్యయము మత్వర్థ స్వార్థములు రెండింటిలోను, 'అరి' వర్ణకము 'ఇ' 'అడి' ప్రత్యయాలు మత్వర్థములోను, 'ఇడి' ప్రత్యయము అభావార్థములోను

చేరునని చెప్పబడినది. 'ఎఁడు' ప్రత్యయము పరిమాణార్థములో, 'ఐంటి', 'కొలఁది' ప్రత్యయాలు దఘ్నార్థములోను విధింపబడినవి.

వర్ణ (కుల) వాచక శబ్దాలమీద స్త్రీత్వములో 'త' ప్రత్యయముచేరి బోయత చాకిత, గొల్లత మొదలగు రూపములు నిష్పన్నమగును.

పై 18 ప్రత్యయములను ప్రత్యేకముగా సూత్రీకరించి, చివరకు 'అర్థవిశేషంబుల' అను పూర్వోక్తసూత్రముచెప్పి, దానికి లక్ష్యములుగా మంటమూరి, తిండిపోతు, అడవము, పెండ్లము, అను శబ్దములను చూపి 'మూరి', 'పోతు', 'అ', 'అము' ప్రత్యయాలను తాచ్ఛీల్యాద్యర్థకాలుగా నిరూపించినాడు చిన్నయసూరి.

ఇవిగాక 'మగఁటిమ్యాదులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు' అను సూత్రముద్వారా కొన్ని శబ్దాలను నిపాతములుగా ప్రతిపాదించినాడు, మగఁటిమి, పేదఱికి, ఒజ్జనము, కోటరము, కోడటికము, కోడంట్రము, కోట్రము, కోడంట్రికము, చెలికారము-మొదలగు శబ్దములను ప్రకృతి ప్రత్యయ వివేచనము చేయక యథాతథముగా గ్రహింపదగునని బాలవ్యాకరణము ప్రతిపాదించినది.

## ప్రౌఢ వ్యాకరణము

త్రిలింగ లక్షణ శేషమను నామాంతరముగల ప్రౌఢవ్యాకరణమును బహుజనపల్లి సీతారామాచార్యులు రచించినాడు, ఇది బాల వ్యాకరణానికి కొంత వరకు పూరకమని భావింపవచ్చును.

దీనిలో ఇతర ప్రకరణాలతోపాటు కృదంత, తద్ధిత పరిచ్ఛేదములు కూడా చేర్చబడినవి.

కృత్తులలో-"ఇ. ఇడి, ఎన, వుర, మలి, వు. వలి"-అను 7 ప్రత్యయాలు చెప్పబడినవి, ఇవి బాల వ్యాకరణములో చెప్పబడనివే.

దయ్యు మొదలగు ధాతువులమీద 'ఇ' ప్రత్యయము చేరి, యకారమునకు పకారమాదేశముకాగా, దప్పి మొదలగు రూపము లేర్పడుచున్నవి. "రాయునకిఁ వర్ణకంబగు" అను సూత్రమునకు "రామన" కను పాఠాంతరము కనబడుచున్నది

కొందరు వ్యాఖ్యాతలు 'రాయిడి' అని ఉదాహరించినారు, 'రావిడి' అను రూపమే బహుళ ప్రచారములో నున్నది.

తద్ధిత పరిచ్ఛేదములో - 'అ అద, అడి, ఇడి, ఇత, ఇద, ఇరి, కర, కార, మిరి, టి, ఎఁడు, బంటి, మయట్, న'' - అను ప్రత్యయములు ప్రతిపాదింప బడినవి, పరిచ్ఛేదారంభములో, తద్ధిత ప్రత్యయములు పరమగునప్పుడు 'డు' మొదలగు విభక్తులు లోపించునని సూత్రము ద్వారా తెలిపినాడు. విభక్త్యంత శబ్దములపైననే తద్ధిత ప్రత్యయాలు చేరుట సంస్కృత వ్యాకరణ సంప్రదాయము-దానినే అనుస రించిన తెలుగు వ్యాకరణము కూడ ఆ విధానము నవలంబించుట మంచిదని ప్రౌఢ వ్యాకర్త యీ విషయమును తెలిపినాడు, చిన్నయసూరి ఈ విభక్తిలోపమును చెప్పలేదు.

నాయఁకిర శబ్దములోనిది 'కర' వర్ణకమని, 'ర' వర్ణకమని, 'అర' వర్ణక మని భిన్నాభిప్రాయములున్నవి, 'నాయక + కర' అను చోట నాయక శబ్దములోని కకారము లోపించి, నాయఁకరము'' అను రూపమేర్పడెనని చెప్పుదురు, బాల వ్యాకర ణోద్యోతములో దీనిని పుగఁబిమ్మాదులలో చేర్చుట బాగని చూపినారు.

ఆచ్ఛిక శబ్దములమీద మాత్రము వచ్చునని బాలవ్యాకరణ కర్త చెప్పిన 'బంటి' ప్రత్యయము తత్సమ శబ్దములమీద కూడ కాన్పించునని 'కటిబంటి' మొదలగు ప్రయోగ ప్రదర్శన పూర్వకముగా ప్రౌఢవ్యాకరణము తెలిపినది.

సంస్కృత ప్రత్యయమగు 'మయట్' ప్రాచుర్యార్థములో దేశ్య శబ్దముల మీద కూడ చేరునని 'తనమయము' 'ప్రోవులమయము' అను లక్ష్యములు దీనిలో చూపబడినవి.

మతుబర్థములో 'న' ప్రత్యయము ప్రౌఢ వ్యాకరణము నూతనముగా తెలిపినది, ''తేజంబునవాడు'' అనునది ఉదాహరణము.

ఈ విధముగా ప్రౌఢ వ్యాకరణము-బాలవ్యాకరణములో చెప్పబడిన కొన్ని టికి సవరణగాను, మరికొన్ని నూతనముగాను, తద్ధిత ప్రత్యయాలను ప్రతిపాదించి

బాలవరకు త్రిలింగ లక్షణ శేషమను పేరును సార్థకము కావించుకొన్నది, అయినను దీనిలో చెప్పక విడిచిన వ్యాకరణాంశములు కూడ తరువాతి లక్షణ గ్రంథములలో ప్రతిపాదింపబడుట మనము గమనింపవలసియు న్నది.

## ఆంధ్రభాషానుశాసనము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి దీనిని రచించినాడు. ఇది చారిత్రక దృష్టితో, భాషాపరిణామ క్రమమునననుసరించి వ్రాయబడిన వ్యాకరణము, ప్రస్తుతము శిష్ట వ్యవహారములో ఉన్న శబ్దములను గూడ వీరి గ్రంథములో వ్యాకరించుట జరిగినది.

ఆంధ్ర భాషాను శాసనములో ఇతర ప్రకరణములతోపాటు తద్ధిత, కృత్ ప్రకరణములు కూడ ప్రత్యేకముగా విస్తరముగా ప్రతిపాదింపబడినవి.

"నామవాచకములకంటెను, మరికొన్ని విశేషణములకంటెను, విశేషార్థమందు విధింపబడు ప్రత్యయములు తద్ధితములు" అని తద్ధిత సంజ్ఞను వివరించినాడు.

దీనిలో తన, టిక మొదలగు ప్రత్యయములతోపాటు బాలవ్యాకరణములో చెప్పని 'అసి, ఇడి, ఇ, టి, ఇక, ఇన, మయి, కోరు, దారు, గొట్టువంటి ప్రత్యయములు కూడ చెప్పబడినవి. 'తన' ప్రత్యయము తత్సమ శబ్దముల మీద కూడ కాన్పించునని "లాసికతనమున నిపుణుండనై యనవి మెచ్చింతున్" (విరా—1-89) అను భారత ప్రయోగము చూపబడినది, రూపు, బలుపు శబ్దముల మీద 'అసి' ప్రత్యయము మత్వర్థములోచేరి రూపసి, బలవసి అను రూపములు కలుగునని చెప్పబడినది, ఈ 'అసి' ప్రత్యయము బాల, ప్రౌఢ వ్యాకరణాలలో పేర్కొనలేదు.

చెవికి అర్థ విశేషముల 'ఉడు', 'ఇటి' ప్రత్యయములుచేరి 'చెవుడు', 'చెవిటి' అను రూపములేర్పడినట్లు చెప్పబడినది, గంపంత. చేటంత మొదలగు వానిలో "అంత", అంతమాత్రము, ఇంత మాత్రము వంటి శబ్దములలోని 'మాత్ర' అనునవి ప్రత్యయములుగా పేర్కొనబడినవి.

చెడుగు మొదలగు శబ్దములపైన 'అ' వర్ణకము, ఇంపు, బిగు పోరులకు 'ఇత' ప్రత్యయము చేరుటవలన, చెడుగఁడు, ఇంపితము, పోరితము, ఒప్పిదము వంటి శబ్దములు నిష్పన్నములగునని ఆయన ప్రతిపాదించినాడు, చెలికారము, నుడి కారము, మొదలగు శబ్దములలోని కార ప్రత్యయమును పేర్కొన్నాడు, ఈ నాలుగు ప్రత్యయములు ప్రౌఢ వ్యాకరణములో ప్రదర్శింపబడినవే.

సంస్కృత భాషలో వికారార్థకమైన 'మయ' ప్రత్యయము అచ్చిక శబ్దముల మీద చేరునని తన మయంబు, తమమయంబు, ప్రోవులమయము అను కవి ప్రయోగ ములను ప్రదర్శించినాడు.

తాచ్ఛీల్యాద్యర్థములలో మారి, పోతు, కోరు, దారు, కొట్టు మొదలగు ప్రత్యయములను చివరగాచెప్పి, మాయలమారి, తిండిపోతు వంటి రూపముల నుదాహ రించినాడు, "తక్కుంగల తద్ధిత విశేషములను ప్రయోగ వ్యవహారములఁదెలియునది". అని ప్రకరణాంతములో చెప్పినాడు.

కా, కత్తియ ప్రత్యయములు కొన్ని తత్సమ శబ్దములమీద కాన్పించు చున్నవని హాస్యగాఁడు, విటకత్తె, కోపగాఁడు, మొదలగు ప్రయోగములు ఆంధ్ర భాషాను శాసనములో చూపబడినవి, "అన్న, మీతండ్రి కోపగాడౌనొకాదొ" అని కాశీఖండములో శ్రీనాథుని ప్రయోగమున్నది.

'బంటి' ప్రత్యయము తత్సమ శబ్దముల మీద చేరుననుటకు 'కటిబంటి' అను ప్రయోగము చూపబడినది, కాశీఖండములోనిది 'కోపగాడు' అనికాక 'కోపకుండు' అని కవి ప్రయుక్త పాఠమై యుండునని వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి బాల వ్యాకరణోద్ద్యోతములో అభిప్రాయపడినాడు, అట్లే 'అభిమానకత్తె' అను బసవపురాణ ప్రయోగము, 'అభిమానకర్త్రి' అని కావచ్చునని వ్రాసినాడు.

ఇక కృత్తుల విషయములో, "భావాద్యర్థములయందు ధాతువులకంటె వచ్చు క్రియా విభక్తి భిన్నములైన ప్రత్యయములు కృత్తులనబడును." అను నిర్వచ నము చెప్పబడినది. అంతేకాక కృత్తుల యర్థములను ప్రయోగ వ్యవహారములవలన

తెలియునది.'' అని వ్యవహారమే అర్థ నిర్ణయములో ప్రమాణభూతమని సూర్య నారాయణశాస్త్రి స్పష్టముగా పేర్కొన్నాడు.

తరువాత క, ఇక, వు మొదలగు 32 కృత్ ప్రత్యయములను ఆయా సూత్రముల ద్వారా ప్రతిపాదించినాడు. కానుక, కానిక, కానువు అను శబ్దముల నిష్పత్తి కొరకు ',కను ధాతువునకు క, ఇక, వు వర్ణము లాగమములగును,'' అని సూత్రించాడు, కను ధాతువు మీద క, ఇక, వు అనునవి ప్రత్యయములుగా కాక, ఆగమములుగా చెప్పటలో భాషానుశాసనకర్త అభిప్రాయమేమో తెలియకున్నది, ప్రత్యయములుగా చెప్పినను రూపసిద్ధి కాటంకమేమియులేదు. మరొకచోట ఆయన ''చేయు మొదలగు కొన్ని ధాతువుల 'యు' వర్ణమునకు బిందుపూర్వక తవర్ణము బహుళముగా నగును,'' (కృత్-7) అని సూత్రించి 'యు' స్థానములో 'త' ఆదేశముగా వచ్చునని చేంత, కోంత మొదలగు రూపములనుదాహరించినారు, ఈ పద్ధతి బాలవ్యాకరణాది సంప్రదాయమునకు విరుద్ధమైనది, చేయుమొదలగు ధాతువులకు పరముగా 'త' అను, ప్రత్యయము చేరగా ధాత్వంత వర్ణము లోపించి చేంత మొదలగు రూపములు సిద్ధించుననుట వ్యాకరణ సంప్రదాయము, ఇతర స్థలాలలో ''ఎఱుంగు'' మొదలగు వానికి, కలుగు మున్నగు వానికి ఆ రీతిలో సంపూర్ణ ధాతువుల మీదనే ఆయా ప్రత్యయములు చేరునని చెప్పబడినది. ''అవులించు'' ''మొదలగువాని చు వర్ణమునకు 'త' వర్ణకమగును'', అను (కృత్-12) సూత్రములో కూడ 'చు' స్థానములో 'త' ఆదేశమగునని సూత్రించినాడు, ''చు వర్ణమునకు త వర్ణకమగును'' అను వాక్యము అభిలషితార్థమును బోధింపదు, వర్ణకమనగా ప్రత్యయము, అది ఒక వర్ణము స్థానమున ఆదేశమగుట జరుగదు, ప్రత్యయమెప్పుడును ప్రకృతికి పరముగ వచ్చునే కాని ఆదేశముగ రాదు

"ఎగుచు-దిగుచుల చు వర్ణమున కర్థ విశేషముల" దు. వ. మతి వర్ణకము లగును, (కృత్-34) అని మరియొక సూత్రమున్నది, ఇక్కడ కూడ 'చు' వర్ణమునకు అనికాక, 'ఎగుచు దిగుచుల' కని చెప్పటే సముచితముగా ఉండును, ప్రత్యయము పరమగునప్పుడు సహజముగా జరుగు ధాత్వంత వర్ణలోపము చేతనే ఆయా రూప

ములు సిద్ధించుచుండగా, అంత్యవర్ణమునకు ప్రత్యయమాదేశమగుననుట అనావశ్యకము, వ్యాకరణ సంప్రదాయ విరుద్ధము కూడ అగుచున్నది.

ఆంధ్ర భాషాను శాసనములోని దల, ఇడి, ఇత, వ, కద, మతి' ఇలి-అను ప్రత్యయములు బాలవ్యాకరణములో కన్పించవు' ఇడి, మతి అను రెండు మాత్రము ప్రౌఢ వ్యాకరణములో చెప్పబడినవి, 'గాణపత వ్యాకరణము'' లో-దల. ఇలి, వ, కద అను ప్రత్యయములు చూపబడినవి, 'ఇత, ప్రత్యయము మాత్రము బాల, ప్రౌఢ వ్యాకరణాలు రెండింటిలోను కాన్పించదు.

ప్రౌఢ వ్యాకర్త కాచువీచులకు చెప్పిన వలి ప్రత్యయము ఆంధ్రభాషాను శాసనములో పేర్కొనబడలేదు, 'రాయు' మొదలగు వానిమీద 'ఇడి, ప్రత్యయము చేరుటవలన రాయిడి. ప్రామిడివంటి రూపాలు, ధాత్వంత వర్ణమునకు వకారాదేశముతో దోపిడి, పావిడి, వంటి రూపాలు కలుగునని, కలియు ధాతువుమీద 'ఇడి' ప్రత్యయముచేరి మకారాదేశముతో 'కలిమిడి' అను శబ్దము నిష్పన్నమగునని చెప్పబడినది. కలిమిడి శబ్దము ప్రస్తుత వ్యవహారములో కాన్పించుట కాని, కవిత్రయ ప్రయోగములలోకాని, ఇతర ప్రాచీన కవుల ప్రయోగములలో కాని కనబడదు.

'ఇత' ప్రత్యయాంతమగు 'పొగడిత' అను రూపమునకు పొగడ్త అను రూపాంతరము ప్రదర్శింపబడినది.

ఆంధ్ర భాషాను శాసనము కృదంత ప్రకరణములోనేకాక నామవాచక ప్రకరణములో కూడ గుణాది నామవాచకములను విభాగములో తీపి తెల్లన, తెలివి, కినుక, మెలకువ, చావువంటి కృదంత శబ్దములను, కన్నెరికము, చెలిమి, మగఁటిమి. గొప్పతనము వంటి తద్ధిత ప్రత్యయాంతములను చూపినాడు.

చేత, రాక, ఓరిమి, నవ్వు మొదలగు దేశ్యకృదంతములను, చేయమి, కోయమి వంటి వ్యతిరేక క్రియార్థకములను కూడ ధాత్వర్థ నామవాచకములను పేరుతో వర్గీకరించటము జరిగినది.

అందగాఁడు నేర్పరి, వన్నెలాఁడి మొదలగు తద్ధితాంత శబ్దములు గుణాది వాచక విశేషణాలుగా విశేషణ ప్రకరణములో చేర్చబడినవి.

క్రియా ప్రకరణములో భావార్థక 'ట' వర్ణకము వ్యతిరేక భావార్థములో 'అమి' ప్రత్యయము ఆగమములని చెప్పుట మాత్రము వింతగానున్నది, ఈయనే అంట, కొంట, తింట వంటి శబ్దాల విషయములో 'ట' వర్ణకము పరమైనప్పుడు ధాతువు చివరి అచ్చులోపించి, అనునాసికాక్షరము బిందువుగా మారుటవలన ఆ రూపము లేర్పడునని చెప్పి ఉన్నారు క్రియా ప్రకరణములో చెప్పిన ట వర్ణకము సర్వధాతు సామాన్యము కనుక కృత్ 'వ్రి'కరణములోని 'ట' వర్ణకముకంటె భిన్న మనుకున్నప్పటికి, అది కూడ ఆగమమనుట మాత్రము పొసగదు.

అంట, కొంట వంటి ప్రయోగములు భారత కవులు చేసినారని చూపినాడు.

అరగింపు, బెదరింపు తెగింపు, ముగింపు మొదలగు రూపములు ఆయా ధాతువుల 'ఇంచు,, లోని చకారానికి వకారాదేశము వచ్చుటవలన సిద్ధించునని, చెక్కడము, ముట్టడము. ప్రేలడము వంటి రూపాలు ధాతువుపైన 'అడ' ప్రత్యయము చేరగా ఏర్పడునని ప్రతిపాదించినాడు, చెక్కడము వంటి ప్రయోగాలు కవిత్రయ భారతములో కానరావు, ఇలుకటము, త్రవ్వటము మొదలగు అట ప్రత్యయాంత భావార్థక రూపములున్నవని తెల్పుచు, కొందరు లాక్షణికులు 'అడ,, ప్రత్యయమును విధించినప్పటికీ, తిక్కన సూరనలు మాత్రము 'అట, ప్రత్యయాంత రూపాలనే ప్రయోగించినారని ఆంధ్ర భాషాను శాసనము పేర్కొన్నది.

ఈ విధముగా ఆంధ్రభాషాను శాసనము కృత్తద్ధితముల విషయములో, పూర్వలాక్షణికులు చెప్పని అనేక విషయములను, ప్రయోగ ప్రదర్శన పూర్వకముగ నిరూపించినది. అర్వాచీన కవుల ప్రయోగములకు కూడ దీనిలో లక్షణము చెప్పుట ద్వారా వానికి ప్రామాణికత కల్పింపబడినది. ఆంధ్ర లక్షణ జిజ్ఞాసువుల కీగ్రంథము మహోపకారకముగా ఉన్నది.

## ముక్తలక్షణకౌముది

శ్రీవంతరాం రామకృష్ణరావు "ముక్తలక్షణ కౌముది" అను వ్యాకరణగ్రంథము రచించినాడు. గ్రంథనామమును బట్టి పూర్వలాక్షణికులు చెప్పక విడిచిన లక్షణములను ప్రకాశింపజేయు పుస్తకమని గ్రంథకర్త సూచించినాడు.

"ముక్తలక్షణకౌముది"లో 16 కృత్ ప్రత్యయములు చెప్పబడినవి. అవి "అచే, అలి, అర, అన, ఇమి, ఇన, ట, దల, ది, పిడి, వ, వు, వర, సు, ప, ఉ" అనునవి. వీనిలో బాలవరకు పూర్వలాక్షణికులు చెప్పినవే. 'వు' ప్రత్యయము బాల ప్రౌఢ వ్యాకరణాలు రెండింటిలో వేర్వేరు ధాతువుల మీద చెప్పబడినది. 'తెలియు' ధాతువును మన్వాదులలోగాని, ఉలియ్వాదులలోగాని, చేర్చినచో 'తెలివు' అను రూపమేర్పడును. "ఇమి, ప, ఉ'' ప్రత్యయాలు కూడ బాలవ్యాకరణములో ప్రతిపాదింపబడినవి

కాని ఆ ప్రత్యయాలకు బలిమి, కదప, ఉబ్బు మొదలగు నూతన ప్రయోగములు దీనిలో చూపబడినవి.

తెలివు, బలిమి వంటి ప్రయోగములు భారతములో ఉన్నప్పటికి, బాలవ్యాకరణము వానిని చూపలేదు. అచి, అల, అర, అన మొదలగు ప్రత్యయములు క్రొత్తగా చెప్పబడినవి. కూతలి శబ్దము 'అలి' ప్రత్యయాంతముగా చూపబడినది.

"ప్రౌఢవ్యాకరణములో'' కాచువీచులకు వలి వర్ణకంబగు' అని సూత్రించి కావలి, వీవలి శబ్దములుదాహరణములుగా పేర్కొనబడినవి. కాని 'అలి' ప్రత్యయమునే చెప్పి ధాతుచకారమునకు వకారాదేశము చెప్పినచో ఈ రూపాలతో పాటు కూచలి శబ్దము కూడ సాధితమగును. 'తిరుగలి' శబ్దసాధనకు అలి ప్రత్యయమును చెప్పవలసియే ఉన్నందున, దానిచేతనే పైరూపములన్నిటిని సాధించుట లాఘవమై ఉండగా 'వలి' ప్రత్యయమును వేరుగా చెప్పుట అనవసరము.

దోఁచు, నుఱుచులకు పిడి ప్రత్యయము చేరగా దోఁపిడి, నుఱిపిడి శబ్దములేర్పడునని, ముక్తలక్షణ కౌముది చెప్పినది. ప్రౌఢవ్యాకరణములో ''రాచునకిడి వర్ణకంబగు'' అని చెప్పి, చకారమునకు వకారాదేశము చెప్పి 'రావిడి' అనురూపము సాధింపబడినది. దానివలెనే దోఁచు, నుఱుచులకు కూడ 'ఇది' ప్రత్యయము చెప్పి రూపములను సాధింపవచ్చును.

మొత్తముమీద ముక్తలక్షణకౌముది బాలవరకు కృత్ ప్రత్యయములకు కొత్త ఉదాహరణములను చూపినది. దీనిలో 16 కృత్ ప్రత్యయాలను చెప్పి, చివరకు "ఇత్యాదులు మహాజనవ్యవహారంబున నెఱుఁగునది'' అని శిష్టవ్యవహారము వలన మిగిలిన

రూపముల నెరుగ వలెనని ముగింపబడినది.

తద్ధిత ప్రకరణములో మొత్తము 33 ప్రత్యయములు చెప్పబడినవి. వీనిలో ఎక్కువ భాగము పూర్వలాక్షణికులు చెప్పనివే ఉన్నవి.

'త్రిప్పు' శబ్దము మీద భావార్థములో 'అట' ప్రత్యయము వచ్చి 'త్రిప్పట' శబ్దమేర్పడునని దీనిలో చెప్పబడినది. కాని దీనిని 'త్రిప్పు' ధాతువు మీద చేరిన కృత్ ప్రత్యయమని చెప్పుటే సముచితమని పించును.

'వఱద' లో 'అద' ప్రత్యయము, 'తాపలము' లో 'అల' ప్రత్యయము వంటి వెన్నో బాలప్రౌఢ వ్యాకరణాలలో తెలుపబడనివి దీనిలో కనిపించును.

కంటనము, బుడ్డిగ, పుక్కిలి, గడువు, పిడికిలి, బిగువు మొదలగు పెక్కు శబ్దాల నిష్పత్తి కాయా ప్రత్యయాలు ప్రదర్శింపబడినవి.

ముక్తలక్షణ కౌముదిలోని 'ఎడు, బంటి, ఇమి, కా, కత్తియ' ప్రత్యయములు మాత్రమే బాలవ్యాకరణములో చెప్పబడినవి. తక్కినవి దాలవరకు నూతనముగా చెప్పినవే. ఇతర లాక్షణికు లెవ్వరు స్వీకరింపని ప్రయోగాలను రామకృష్ణరావు తమ ముక్తలక్షణ కౌముదిలో గ్రహించి వ్యాకరించినందుకు అభినందనీయులు.

డా వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య వ్యావహారిక భాషకు వ్యాకరణము రచించినాడు. దీనిలో కూడ కృదంతపరిచ్ఛేదము, తద్ధిత పరిచ్ఛేదము విడిగా చెప్పబడినాయి.

కృదంత పరిచ్ఛేదములో మొత్తము 88 కృత్ ప్రత్యయాలు నిరూపితాలయినాయి. దీనిలో వ్యావహారిక ప్రయోగాలేకాక ప్రాచీన కవుల గ్రాంథిక రూపాలకు కూడ లక్షణాలు చెప్పబడ్డాయి. అలుక, కలిమి, అడకువ, అవులింత వంటి పూర్వ లాక్షణికులు చెప్పిన ప్రయోగాలకు, పొలవం, మారకం, పడ్డన, తిరుగలి, నిలవ' అంకవంటి వ్యావహారిక రూపాలకు కూడ దీనిలో లక్షణము చెప్పబడినది. బాలవ్యాకరణాదుల్లో చెప్పిన ప్రత్యయాలన్నిటినీ మళ్లీ వ్యావహారిక భాషా వ్యాకరణంలో చెప్పినారు శ్రీ గోపాలకృష్ణయ్య. అదనంగా కేవలం వ్యావహారిక రూపాలకే చెప్పినవి- వ, అక,

అన, వడి, డు, ఇలి మాత్రమున్నాయి. వీటికి లక్ష్యాలుగా పొలపం, మారకం, వడ్లన కొలువడి, ఎగుడు, అంకిలి వంటి రూపాలు చూపబడ్డాయి. ప్రాచీన కవి ప్రయోగాలతో పాటు వ్యావహారిక రూపాలకు గూడ లక్షణాలు చెప్పటం దీనిలోని విశేషము. నిలువ, అలుక, తునుక మొదలగు శబ్దాల ఉకారానికి అకారం విధించి నిలవ, అలక, తునక వంటి వాడుకలోని శబ్దాలకు నిష్పత్తి చెప్పబడినది. 'తగ్గు' ధాతువుకు 'వ' ప్రత్యయం పరమైనప్పుడు గకారానికి కకారాదేశం చెప్పి 'తక్కువ' అనే రూపాన్ని సాధించారు. కొన్ని విశేషాలీ విధంగా చెప్పి "ఇతరాలు, విశేషాలు శిష్టజన వ్యవహారంలోంచి తెల్సుకోవాలి", అని ప్రకరణం ముగించబడింది.

తద్ధిత ప్రకరణారంభంలో "భావాద్యర్థాల్లో విశేష్య విశేషణాలకు చేరే ప్రత్యయాలు తద్ధిత ప్రత్యయాలు" అని నిర్వచనము చెప్పబడినది. తరువాత మొత్తము 41 తద్ధిత ప్రత్యయాలు పేర్కొనబడ్డాయి. దీనిలో "ఇక" ప్రత్యయానికి బదులుగా 'అరిక' ప్రత్యయము చెప్పబడింది. ప్రౌఢ వ్యాకరణములో అడి ప్రత్యయంగా చెప్పిన దానిని వెల్లకు స్వార్థంలో 'డి' ప్రత్యయం చెప్పి వెల్లడి రూపాన్ని సాధించుట జరిగింది. నాయక-శబ్దానికి భావార్థంలో 'ర' ప్రత్యయము ద్వారా "నాయకిరం" రూపము సాధించబడింది. ఇతర లాక్షణికులు 'కర' ప్రత్యయము చెప్పినారిక్కడ.

ఈ 41 ప్రత్యయాల్లో చిన్నయసూరి చెప్పిన 20 ప్రత్యయాలు, ప్రౌఢ వ్యాకరణం చూపిన 11 ప్రత్యయాలు చేరినాయి. తక్కిన ప్రత్యయాలు నారాయణీయ వ్యాకరణములో, ఆంధ్రభాషానుశాసనములో, ముక్తలక్షణ కౌముదిలో మనకు కనిపిస్తాయి. అయితే కొన్ని మార్పులు చేయబడ్డాయి. 'పెండ్లము' శబ్దాన్ని "పెండ్లి + అము" అనే విధంగా బాలవ్యాకరణము చూపించగా, పెండ్లి + అ = పెండ్లం అని వ్యావహారిక భాషావ్యాకరణము చూపింది. మాటకారి శబ్దంలో 'కారి' ప్రత్యయాన్ని తాచ్ఛీల్యాద్యర్థంలో విధించారు. ఇది సంస్కృతంలోని "హితకారి" వంటి శబ్దాలలోని భాగానికి అనుకరణ వలన వాడుకలోకి వచ్చి ఉంటుంది. 'పుండాకోరు', 'జగదాలకోరు' వంటి మాటల్లో 'కోరు' ప్రత్యయం, 'పెత్తందారు' వంటి వాటిలో 'దారు' ప్రత్యయము వంటివి వాడుక పదాలకు చూపబడ్డాయి.

మొత్తము మీద వ్యావహారిక భాషా వ్యాకరణంలో చెప్పిన తద్ధిత ప్రత్యయాలు దాదాపు అన్నీ ఇతర లాక్షణికులు చెప్పినవే ఉన్నవి. ఏవో కొన్ని మాత్రము ప్రత్యేకంగా వ్యావహారిక పదాలకు సంబంధించినవి ఉన్నాయి అందువలన ఇది వ్యావహారిక భాషలో వ్రాయబడిన తెలుగు వ్యాకరణమే కాని, ప్రధానంగా వ్యావహారిక భాష కొరకే వ్రాయబడిన వ్యాకరణము కాదని గోచరిస్తుంది. గ్రాంధిక భాషకు ఇంతకుముందే ఎన్నో వ్యాకరణాలుండగా మళ్లీ ఆ రూపాలకు గూడ దీనిలో లక్షణము చెప్పడము అనవసరము. వ్యావహారిక ప్రయోగాలను మాత్రము సూత్రాల ద్వారా సాధిస్తే సరిపోయేది.

కందుకూరి వీరేశలింగం సంగ్రహ వ్యాకరణమనే చిన్న వ్యాకరణ గ్రంథాన్ని రచించినారు. దానిలో పదపరిచ్ఛేదంలో, ధాతువులకు - క, ఇమి, ంత మొదలగు ప్రత్యయాలను చేర్చటం వలన క్రియా జన్య విశేష్యములు ఏర్పడతాయని, వాటినే కృదంతాలంటారని చెప్పబడింది. అలుక. కలిమి, కోంత మొదలగు ఉదాహరణాలు చూపట జరిగింది.

తద్ధితాలను గూర్చి- "భావార్థమునందు దెలుగున తనము, ఱికము, ఇమి. న, ఇక మొదలగు ప్రత్యయము లంతమునందు వచ్చును" అని చెప్పి చిన్నతనము, కన్నెఱికము, పేరిమి, నల్లన, అగ్గలిక అనే ఉదాహరణాలు చూపబడ్డాయి. కాండు కత్తియ, ఈండు. అరి, ఇ. త, అంది, అండు మొదలగు ప్రత్యయాలు మతుబర్థంలో రాగలవని చెప్పినారు. తేరకాండు కల్గరి వంటి ఉదాహరణాలను చూపినారు. కాని పై రెండు సందర్భాలలో కూడ తద్ధితమనే సంజ్ఞను మాత్రం పేర్కొనలేదు.

సంగ్రహంగా రచింపబడిన యీ వ్యాకరణంలో కృదంతాలను గూర్చి క్లుప్తంగా పేర్కొన్నప్పటికీ, కృదంత శబ్దము ప్రయోగింపబడినది తద్ధిత ప్రత్యయాలను కొన్నిటిని చెప్పినప్పటికినీ ఆ సంజ్ఞను చెప్పలేదు.

ఇంకా సులభవ్యాకరణం, లఘువ్యాకరణం వంటివి ముఖ్యంగా పాఠశాల విద్యార్థుల కొరకు వ్రాయబడినవి కొన్ని ఉన్నాయి. అవి ప్రామాణిక గ్రంథాలుగా గ్రహింపదగినంత ప్రాముఖ్యము లేనివని భావించి, ఇంతవరకు తెలుగు లక్షణ గ్రంథాలలో ముఖ్యమైనవి ప్రతిపాదించిన కృత్తద్ధిత స్వరూపాన్ని వివరించి ఇంతటితో ఈ ప్రకరణాన్ని ముగిస్తున్నాను.

—o—

# తృతీయ ప్రకరణము

## నన్నయ భారతములోని కృదంత రూపములు

నన్నయభట్టు రచించిన రెండున్నర పర్వముల భాగములో (1) తెలుగు వ్యాకరణకర్తలు పేర్కొన్నకృత్ ప్రత్యయములు ఇరువదికి పైగా ఉన్నవి. (2) కృత్ ప్రత్యయాలుగా పరిగణింపదగినవి, లాక్షణికులు పేర్కొననివి పది ఉన్నవి.

(1) అ, అన, అమి, అర, అవు. ఇ ఇక, ఇమి. ఉ. క, కద (గద), కి, కువ, ట, టు, డు, త, ప, పు, వ, వి, వు. అనునవి మొదటి విభాగమునకు చెందినవి (1) 'అ' ప్రత్యయాంత రూపములు-అద్దము, ఎండ, ప్రవర్ప. నడ, కడ. కవ, తెల్లము, పగ అనునవి నన్నయచే ప్రయోగింపబడినవి. వీనిలో అద్దు, ఎండు, కవయు అను ధాతువుల మీద కర్త్రర్థములోను, ప్రవచ్చు, కడచు, తెలియుధాతువులపై కర్మార్థములోను, నడచు, పగచు, ధాతువుల మీద భావార్థములోను 'అ' ప్రత్యయము చేరినది. ఒక ప్రత్యయమే భిన్నార్థములలో, భిన్నధాతువులపై చేరుట మనకు పెక్కు చోట్ల కాన్పించును. అద్దు+అ=అద్ద, ఎండు+అ=ఎండ మొదలగు రీతిలో పై శబ్దము లేర్పడినవి. వీనిలో అద్దము, తెల్లము అను శబ్దములలో మాత్రము 'ము' వర్ణకము చేరినది.

''పోయెద నద్దంబగువా
రాయత భుజశక్తి నద్దమగు ద్రాజిమొనన్''[1] అను పద్యములో అద్దంబు, అద్దము అను రెండు రూపములు ప్రయుక్తములైనవి.

నడచు, కడచు, పగచు, కవయు ధాతువులకు మూలద్రావిడ భాషలో క్రమముగా నట్. కట్, పకయ్ కప్ప్ అనునవి ధాతురూపాలు, వానిపై 'అ' ప్రత్య

1. ఆది 4-199

యము చేరి వరుసగా నడ, కడ, వగ, కవ, అనురూపము లేర్పడినవి. వకయ్‌లో యకారము కవ్.వ్ లో వకారము లోపించినవి. తెలియుధాతువునకు మూలరూపము 'తెళ్' అనునది. దాని మీద అకారము ప్రత్యయముగా. వచ్చినపుడు అది లకార ద్విత్వముగా మారి తెల్లము అను రూపము కలిగినది. ఎందు ధాతువునకు ద్రావిడ మూలము ఎఃట్ అనునది.

అన ప్రత్యయమును చిన్నయసూరి 'నజ' ప్రత్యయముగా విధించినాడు "జిత్తు పరంబగునపుడు త్వంబున కత్వంబగు"[2] అను సూత్రమువలన పూర్వమందలి ఉకారము అకారముగా మారును. నారాయణీయములో 'న' ప్రత్యయమే చెప్పబడినది. వ్యావహారికాంధ్ర భాషా వ్యాకరణములో మాత్రము 'అన' ప్రత్యయము సూచితము. సౌలభ్యము కొరకు నేనిక్కడ 'అన' ప్రత్యయముగానే విభజించి చూపుచున్నాను. 'దీవన' 'ఒడ్డనంబు' అను రెండు శబ్దములు ప్రకృత భాగములో కనవడుచున్నవి.

,, నాగరథాశ్వ సన్నాహ మొనర్పక
యొడ్డనంబులు దీర్పకుభయసైన్య

వీరులంకరములు[3]-అను పద్యములో "ఒడ్డనంబుల" అని బహువచన రూపము ప్రయుక్తమైనది. ఒడ్డు + అన=ఒడ్డన> ఒడ్డనము అనురీతిగా రూపనిష్పత్తి కలుగును.

వ్యతిరేకార్థకమగు 'అమి' ప్రత్యయమును బాల వ్యాకరణకర్త 'మిజీ' అని పేర్కొన్నారు.

ఇది కృదంత పరిచ్ఛేదములో కాక క్రియా పరిచ్ఛేదములో ప్రదర్శితమైనది. అయినను ఇది కృత్ ప్రత్యయమనుటలో సందేహము లేదు. మరికొన్ని కృత్తులను గూడ సూరి క్రియా పరిచ్ఛేదములో చెప్పినాడు.

అమి ప్రత్యయ రూపములను నన్నయ ఎక్కువగానే వాడియున్నాడు. ఉండమి, ఎఱుంగమి, ఒల్లమి, ఒవ్వమి, 'ఓవమి', 'కానమి' 'చనమి', చేయమి,

2. బాల-క్రియా 20

3. సభా-2-147

'తలఁపమి', 'నేరమి', 'పడమి' 'పోలమి', 'వినమి', 'వేరమి'-అను శబ్దములీ భాగములో కాన్పించుచున్నవి. ఇవన్నియు ఉండు, ఎఱుంగు, ఒల్లు మొదలగు ధాతువులపై 'అమి' చేరుట వలన ఏర్పడిన రూపములు-'ఒవ్వు' అను ధాతువునకు అనుకూలించు, సరిపడు అను నర్థములున్నవి. దీనికి 'ఓవు' అను రూపాంతరమున్నది. ఈ ధాతువునకు వ్యతిరేకార్థములో మాత్రమే కవి ప్రయోగములున్నవి.

నిజమునకు భావార్థములో విధింపబడిన 'ఇమి' ప్రత్యయము వ్యతిరేకార్థమున చేరు 'అమి' ప్రత్యయమును భిన్నములు కావు 'మి' అనునది మాత్రమే ప్రత్యయాభాగము. అది భావార్థమును బోధించును చెల్మి, తాల్మి, పేర్మి, మూర్మి వంటి శబ్దములలో 'మి' మాత్రమే కనబడుచున్నది. కొన్నిచోట్ల నమస్వరత సూత్రమునననరించి ఇకారము మధ్యలో ఆగమముగా చేరి కలిమి, చెలిమి, పేరిమి వంటి రూపములు కలిగినవి. భావార్థకమైన ఈ ప్రత్యయమునకే వ్యతికార్థమును బోధించుటకు అకారము ముందుగా చేరి 'అమి' అను రూపమును పొందినదని చెప్పవచ్చును. అకారము వ్యతిరేకార్థమును బోధించుట ద్రావిడ భాషలలో సహజము. ఉదా చెయ్యక, చేయని, వినను మొదలగు చోట్ల ఇది స్పష్టము.

లేమి శబ్దమొకటి వ్యతిరేక భావార్థములో కనపడుచున్నది. దీనిలో ప్రకృతి యగు'లే' అనునది మూల దక్షిణ ద్రావిడ భాషలోని 'ఇల్' యొక్క వర్ణవ్యత్యయము వలన కలిగిన రూపము. ఇది సహజముగానే వ్యతికార్థబోధకము. అందువలన దాని మీద 'మి' ప్రత్యయము చేరినప్పుడు వ్యతిరేకార్థమును చెప్పుటలో బాధకము లేదు

'ఓటమి' శబ్దమొకటి 'అమి' ప్రత్యయాంతమువలె తోచుచున్నది. ఇది 'ఓడు' ధాతువునుండి నిష్పన్నమైనదని సూర్యరాయ నిఘంటువు తెలిపినది. కాని ఓడు + అమి అని విశ్లేషించినచో వ్యతిరేక భావార్థము చెప్పవలసియుండును. అప్పుడు 'ఓటమి' శబ్దమునకు ప్రస్తుతార్థము రాజాలదు. అంతేకాక దకారము టకారముగా మారుటకు కూడ ఉపపత్తి కన్పించదు. వంతమి, మొదలగు చోట్ల ఈ మార్పు కలుగలేదు. అందువలన ఈ పదము ఓడు ధాతుజన్యము కాదని కలవవచ్చును. అపజయార్థకమైన ఓట శబ్దముపై స్వార్థములో 'మి' ప్రత్యయముచేరి ఓటమి శబ్దము నిష్పన్నమై యుండును. అప్పతది తద్ధితాంతమని చెప్పదగును. తమిళములో దీనికి సమానార్థకముగా 'ఓట్టమ్' అనుపదము కలదు.

'అర' ప్రత్యయాంత శబ్దము ''వెప్పరము'' అను దానిని మాత్రము నన్నయ ప్రయోగించినాడు. చెడు మాటలు అను అర్థములో సభాపర్వమున ఈ పదము ప్రయుక్తమైనది 'పరమ పతివ్రతన్' వెప్పరములు వల్కగాఁదగునే అని ధృతరాష్ట్రుడు... దుర్యోధనునితో పలికినాడు ఈ అర ప్రత్యయమును బాల, ప్రౌఢ వ్యాకరణకర్తలు పేర్కొనలేదు. కాని సూక్తిలక్షణ కాముదిలోను, అహోబలపండితుడు ధాతు ప్రకృతిక ములని చెప్పి ప్రదర్శించిన ఉదాహరణములలోను దీని ప్రస్తావన కలదు.

ఇరవు, పొదవు, నగవు, నవ్వు, తగవు, తదవు, పుట్టువు అను అవు ప్రత్యయాంత శబ్దము లారు నన్నయరచనలో లభించుచున్నవి. పొదుచు, నగు, తగు, తదయు, పుట్టు ధాతువులపై భావార్థములో అవు ప్రత్యయము చేరి పై రూపము లేర్ప డినవి. తదయు, పొదుచు ధాతువులు అనుబంధము చేరిన రెండవదశలోనివి. వానికి మూలములగు తద్, పొళ్ అనువానిమీద అవు ప్రత్యయము చేరి తదవు, పొదవు అను రూపములు కలిగినవి. రెండవ దానిలో ళ కారము దకారముగా మారినది. మూలధాతు రూపములు ప్రస్తుతము తెలుగులో క్రియాపదములుగా వాడుకలో లేనందున వ్యాకరణ కర్తలు సౌలభ్యము కొరకు పొదుచు, తదయు అను ధాతువుల అంత్యవర్ణములకు లోపము చెప్పినారు. బాలవ్యాకరణము అవుప్రత్యయమును వాచ్యముగా చెప్పక, వడి ప్రవృత్తంలో చేర్చి సూచించినది. నగవు శబ్దములోని రెండవ అకారము లోపించి హల్పమీకరణము ద్వారా 'నవ్వు' అను రూపాంతరము కలిగినది. నన్నయ రెండు రూపములను ప్రయోగించినాడు. మూలద్రావిడ భాషలో నప్/నక్ అను రెండు ధాతువులు ఈఅర్థములో ఉండెడివి.

'ఇరవు' శబ్దములో అవు ప్రత్యయము స్పష్టముగా కనిపించుచున్నది. కాని 'ఇరు' అను ధాతువు తెలుగులో క్రియారూపములో వ్యవహారములో లేదు. అయినను తమిళము, కన్నడము, కొడగు భాషలలో 'నివసించు' అను నర్థములో 'ఇర్' 'లెక' 'ఇరు' ధాతువులు వ్యవహారములో నున్నవి. కన్నడములో 'ఇరువు' నామ వాచకముగా కూడ ఉన్నది. అందువలన 'ఇరవు' శబ్దము మూలద్రావిడ దశలోని 'ఇర్' ధాతువు నుండి 'అవు' ప్రత్యయము చేరి యేర్పడినదని చెప్పదగును.

---

4. సభా-2-265

ఎదిరి, ఎలమి, చేయి, దప్పి, రోయి, అనుశబ్దములలో 'ఇ' ప్రత్యయము చేరి పై రూపములు సిద్ధించును. ఎదురు ధాతువులోని మధ్య ఉకారము చివరి ఇ కార సాహచర్యముతో, సమస్వరత చే ఇకారముగా మారినది. దప్పి శబ్దమునకు రూపాంతము దప్పి కూడ కలదు. దయ్యు + ఇ > దప్పి అనుచోట ధాత్వంత వర్ణమునకు పకారాదేశము విశేషము. దప్పి శబ్దము శ్రమ, అలసట అను నర్థములో ఆది పర్వములో ప్రయుక్తము.[5]

రోయి శబ్దము రోయు ధాతువునుండి ఏర్పడినది. రోయు ధాతువునకు నిందించు, విడచు, వెదకు అను నర్థములున్నవి. నన్నయ రోయి శబ్దమును పంటెము అను నర్థములో క్రింది పద్యములో ప్రయోగించినాడు.

"దమయంతి రోయిగా జూ

దము నీతో నాడఁగడఁగెదను"[6]

విడువబడినది, అని కర్మార్థములో రోయి ధాతువు మీద 'ఇ' ప్రత్యయము చేరి పంటెము అను నర్థమును బోధించుచున్నది.

'ఇక' ప్రత్యయాంత రూపము కానిక అనునది ఒక్కటి మాత్రమే కలదు. ఇది కను ధాతువుపై ఇక ప్రత్యయము చేరగా ఏర్పడినది. దీనికి కానుక, కాన్క అను రూపాంతరములు భాషలో నున్నవి. కాని నన్నయ రచనలో లేవు. ధాతువు తొలి యచ్చు దీర్ఘమును పొందుట, అర్థ విపరిణామము ఈ శబ్దములో ప్రత్యేకతలు. తమిళ కన్నడములలో కాణ్ అను ధాతువు ఈ అర్థములో కలదు.

'ఇమి' ప్రత్యయాంతములు - కలిమి, చెలిమి, చెల్మి, కాల్మి, పేర్మి, పోడిమి, బలిమి, ముదిమి అనునవి ప్రస్తుత భాగములో గోచరించును. ఉదాహరణ:-

"నిరుపమాన శౌర్య నీతోడఁజెలిమి సేయంగ

నాకభీష్టము[7]" అనుచోట చెలిమి శబ్దమును,

---

5. ఆది 6-179 6. అర. 2-222. 7. ఆది-2-108

"చెచ్చెరఁ దన యంతనుండి మదిఁ జెల్మి

తలంపడ[8]" అను పద్యములో చెల్మి శబ్దమును కూడ నన్నయ ప్రయోగించి నాడు. కలిమి రూపాంతరమగు కల్మి శబ్దము, తాలిమి, పేరిమి అను రూపములు ఈ భాగములో కానరావు.

అమి, ఇమి, మి అను మూడు రూపములు ఒకే ప్రత్యయము యొక్క భిన్నరూపములని పూర్వము ప్రతిపాదింపబడినది. (చూడుడు పే. నం.).

కూడు, కన్ను అను రెండు శబ్దములు 'డు' ప్రత్యయాంతములు కాన్పించు చున్నవి. కుడుచు ధాతువుపై కర్మార్థములో 'డు' చేరి అంత్యచువర్ణము లోపించి, మొదటి అచ్చునకు దీర్ఘము కలుగుట వలన కూడు శబ్దము నిష్పన్నమైనది. తమిళ, కన్నడ, మళయాళ భాషలలో 'కూట్' అని దీనికి సమానార్థక రూపము కలదు. కుడుచు ధాతువునకు మూల దక్షిణ ద్రావిడరూపము 'కుట్' అనునది.

కను ధాతువు పూర్వరూపమైన 'కణ్' అనుదాని మీద 'డు' ప్రత్యయము కర్త్రర్థములో చేరి ణకారము ద్విత్వమును పొందిన, తరువాత అది నకారముగా మారుట వలన కన్ను అను రూపము ఏర్పడినది. పదాంత హల్లుమీద అచ్చు చేరినప్పుడు ఆ హల్లు ద్విత్వమును పొందుట ఈ భాషలలో సహజము. కందోయి, కన్గవ వంటి శబ్దాలలో కన్ అను హలంత రూపమును మనము చూచుచున్నాము. వానిలో ధాతురూపమైన కన్ అనునది నామార్థమును కూడ బోధించుట స్పష్టము.

అలుక, ఆఁక, ఎలుక, కరఁక, వీఁక, వేడుక, ముదుకఁడు – అను ఏడు 'క' ప్రత్యయాంత శబ్దము లీ భాగములో కన్పట్టుచున్నవి. వీనిలో అలుక, వేడుక శబ్దాలకు అల్క, వేడ్క అను సంయుక్త రూపాలు కూడ ప్రయుక్తములైనవి. వ్యాకరణ పరిభాష ప్రకారము అలుగు + క > అలు + క = అలుక, ఆఁగు + క > ఆఁ + క = ఆఁక అను రీతిగా పై రూపములు నిష్పన్నములగుచున్నవి. ఎలుఁగు, కరఁగు, వీఁగు ధాతువులపై 'క' ప్రత్యయము చేరినప్పుడు చివరి గువర్ణము లోపించి, నది. నిజమునకు వీనిలో 'గు' అనునది తరువాత చేరిన అనుబంధము. ఎలు గు ధాతు

---

8. ఆది 2-127

వునకు మూలరూపము 'చేట్' అనునది. ఆదిచకారము లోపించి టకారము శకటరేఫ ముగా మారినది. ఎఱుఁగు ధాతువులో బిందువున్నను 'ఎఱుక' శబ్దము నిర్బిందుకముగా నుండుట విశేషము. ఒక్క కొరగు భాషలో మాత్రము 'అఱిఙ్' అను సానునాసిక ధాతువు కినబడుచున్నది.

వీఁగు ధాతువునకు మూలరూపము వీ అనునది.

వేడుక శబ్దములోని ప్రకృతి వేడు ధాతువని తలచినచో నిర్బిందుకమగు 'వేడు' క్రియాప్రయోగములు కనబడవు. యాచించు, కోరు అను అర్థములుగల 'వేఁడు' ధాతువు సబిందుకము బిందుసహిత ధాతువునుండి నిర్బిందుక రూపము ఏర్పడుట పొసగదు. తమిళములో 'వేళ్' ధాతువు కోరుట, ప్రేమించుట అను అర్థము లలో నున్నది. వేట్కై అను సమానరూపము కూడ ఆ భాషలో కలదు. కన్నడ భాషలో బేట్, బేడు అను ధాతువులు బేకికె, బేడికె అను నామపదాలు కన్పించు చున్నవి. పర్జి భాషలో వెల్కు అను శబ్దము సంతోషము, కోరిక అను అర్థములలో ఉన్నది.

"విప్రముఖ్య నాకు వినగ వేడుకయయ్యె

నెఱుఁగఁ జెప్పుమయ్య[9]" అని వేడుక శబ్దము కోరిక అను అర్థములో ప్రయుక్తమైనది.

అందువలన మూలద్రావిడములో వేళ్, వేణ్ అను రెండు ధాతువు లీ అర్థ ములో ఉండెననియు, వేణ్ ధాతువునుండి సబిందుకమైన వేఁడు ధాతువు, వేళ్ ధాతువు వలన వేడుక శబ్దము నిష్పన్నమైనవని చెప్పవలసియుండును.

'నిలుకడ, ఉడుగడ, ఏడుగడ' అను శబ్దములు మూడు - కడ (గడ) ప్రత్య యాంతములు కన్పించుచున్నవి. లాక్షణికులు కొందరు కడ, గడ ప్రత్యయములను భిన్నములుగా పేర్కొన్నారు కాని ఈ రెండు ప్రత్యయములు ఒకదాని రూపాంత రములేయని చెప్పదగును.

---

9. ఆది. 8-142.

నిలుచు ధాతువుపై కడప్రత్యయముచేరి ధాత్వంత వర్ణలోపము వలన 'నిలుకడ' అనురూప మేర్పడినది. నిలుచు ధాతువు మూలప్రకృతి అగు 'నిల్' మీదనే ఈ ప్రత్యయము చేరియుండును.

'ఇడు' ధాతువుపై 'కడ' ప్రత్యయము చేరగా కకారమునకు గకారాక్షరము ఆదేశమైనది. ధాతువునకు అర్థవిపరిణామము కలిగి అసూయార్థ మేర్పడినది.

చం. "తడయక క్రమ్మొకిడియున్న వినితాసుతు
నప్పుడు సూచి యాత్మలో, నిడుగడఁజేయు
చుంగడు సహింపక కద్రువ[10]" అని నన్నయ ప్రయోగము.

కన్నడములో కష్టము- బాధ అను అర్థములలో ఇడుగు, ఇడుక్కు అను శబ్దములున్నవి. ఇడుగు శబ్దముతో 'ఇడుగడ' పదమునకుగల సామ్యము గమనింప దగినది. 'ఇడుమ' శబ్దములో 'ఇడు' అను భాగము కష్టార్థసూచకము.

తమిళములో 'ఇటు' ధాతువు మలయాళములో 'ఇటి' ధాతువు, కోతలో 'ఇద్' ధాతువు కన్నడములో 'ఇడి' ధాతువు - కొట్టు, బాధించు, అనహ్యించుకొను అను అర్థాలలో కన్పించుచున్నవి. తెలుగులో మాత్రము పై యర్థములలో ఆ ధాతువు క్రియాప్రయోగములందు కన్పించదు. ఇడుమ, ఇడుగడ శబ్దాలలో మాత్రము దాని రూపమును చూడగలము.

'ఏడుగడ' శబ్దములోకూడ 'ఏడు' అను ప్రకృతి భాగము ధాతువుగా వ్యవహారములో లేదు. రక్షకుడను అర్థములో నన్నయ దీనిని ప్రయోగించినాడు.

"పతుల కడనయునికి సతులకు ధర్మవు
నతులకేడు గడయుఁబతులచూవె"[11]

కన్నడభాషలో 'ఏఱు' ధాతువు-వృద్ధిపొందు, పైకినవచ్చు అను అర్థములలో వినబడు చున్నది. తమిళములో గూడ 'ఏఱు, ఏఱ్' అను ధాతువులు ధరించు, పైకెత్తు, వృద్ధి

---

10. ఆది. 2-42.

11. ఆది-4-66

నొంచు అనే అర్థంలో ఉన్నవి తెలుగులోని 'ఏడుగడ' శబ్దపు పూర్వభాగమునకు పైన తెల్పిన తమిళ, కన్నడ భాషల 'ఏట్' ధాతువుతో సామ్యమున్నది. ట కారము తెలుగులో దకారముగా మారుట సహజము.

ఉనికి, ఉన్కి, కోర్కి, చూడ్కి, పూన్కి అననవి 'కి' ప్రత్యయాంత శబ్దములుగా ప్రస్తుత భాగములో కలవు చిన్నయసూరి దీనిని 'ఇకి' ప్రత్యయముగా చెప్పినాడు. నారాయణీయము, వ్యావహారికాంధ్రభాషా వ్యాకరణము, కూడ 'ఇకి' అని చెప్పినది. కాని దీనిని 'కి' ప్రత్యయముగనే విశ్లేషించుట సముచితముగా నుండును.

నన్నయ ప్రయోగములలో ఉనికి అను శబ్దము తప్ప తక్కిన నాల్గింటిలో స్పష్టముగా 'కి' ప్రత్యయము భాసించుచున్నది. 'ఉనికి' యొక్క రూపాంతరమైన 'ఉన్కి' శబ్దముకూడ నన్నయచే ప్రయుక్తము. ఉన్, పూన్, కోర్ మొదలగు ప్రాథమిక దశ ధాతువులమీద 'కి' ప్రత్యయము చేరగా ఏర్పడిన రూపములే ఉన్కి మొదలగునవి. న కార కకారముల మధ్య సుఖోచ్చారణకై ఇకారము తరువాత ఆగమముగా చేరి 'ఉనికి' అను రూపము కలిగినది. దీనిని స్వరభక్తిగా వ్యవహరింతురు. వ్యాకరణకర్తలు ప్రక్రియా సౌలభ్యము కొరకు 'ఇకి' ప్రత్యయముగా నిర్దేశించినారు.

1. "దండితారాతి నీదేవి కుండలమ్ము
లిమ్మనా పూన్కియిది సఫలమ్ముగాగ[12]"

2. "వెఱచఱవ పిరిలో నొ
క్కఱగా నొకమునలిచూడ్కికినగోచరమే[13]"

ఇక్కడ చూచుధాతువులోని చకారమునకు, దకార మాదేశమైనది. కన్నడములో చూడ్, నూడ్ ధాతువులు 'పర్జి'లో చూట్ ధాతువు కలదు. మఱకువ, తక్కువ అను రెండు 'కువ' ప్రత్యయాంత రూపములీ భాగములో ఉన్నవి. మఱచు + కువ = మఱకువ తగ్గు + కువ = తక్కువ అని వ్యాకరణపద్ధతిలో ఈశబ్దముల నిష్పత్తి చెప్పదగును, "మఱచు"లో 'చు' తగ్గులో 'గ్గు' లోపించినవి. తగ్గు ధాతువు అంత్యవర్ణము లోపించిన తరువాత ఉనికి కొఱకు కువ ప్రత్యయములోని కకారము ద్విత్వమును పొందినది.

---

12. ఆది 1-94 13. ఆది-5-256

మఱచు ధాతువునకు కన్నడములో 'మఱె' కోతలో 'మర్వ్' తమిళములో 'మఱ' మలయాళములో 'మఱక్క' అను సమానార్థక ధాతువులున్నవి. మూలదక్షిణ ద్రావిడములో దీనికి ప్రకృతి 'మఱ్ + వ్' అను ధాతువు. మఱకువ శబ్దము మలయాళములోని ధాతువుతో సామ్యము కలిగియున్నది. మూలద్రావిడములోని దంతమూలీయ టకారము 'ఱ' కారముగా మారును.

'తగ్గు, తక్కు' ధాతువులు రెండు తెలుగుభాషలో ఉన్నవి. కాని 'తక్కువ' శబ్దపు అర్థసామ్యము తగ్గు ధాతువుతోనే ఉన్నది. కన్నడములో తగ్గు, తర్కు, తల్గు అను ధాతువులు, తమిళములో 'తాళ్' కోతలో 'తగ్' అను ధాతువులీ యర్థములో కలవు. మూలదక్షిణ ద్రావిడములో 'తళ్-ఉన్క్' తళ్-ఉక్క్ అని దీని ప్రకృతి రూపములు. సమీకరణము వలన ళకారము కకారము రూపము నొందినది.

"ఉంకువ" శబ్దమును నన్నయ కన్యాశుల్కమనే అర్థములో ప్రయోగించినాడు (ఈ శబ్దము 'శుల్క' శబ్ద భవమని సూర్యరాయ నిఘంటువు, తెలుగు వ్యుత్పత్తి కోశము కూడ పేర్కొన్నది). "ఉండు" ధాతువుపై 'కువ' ప్రత్యయమువచ్చి, వాసస్థానమను అర్థముగల "ఉంకువ" శబ్దమొకటి యున్నది. అది తిక్కనచేత విరాట పర్వములో ప్రయోగింపబడినది. కాని ఆయర్థములో నన్నయ దానిని ప్రయోగించలేదు.

భావార్థకమైన 'ట' ప్రత్యయము 2 విధములుగా ప్రతిపాదితము. క్రియాపరిచ్ఛేదములో చిన్నయసూరి ''ట వర్ణకంబు భావంబు నందగు'' అని విధించిన 'ట' ప్రత్యయము సర్వధాతువులపై చేరును. చేయుట, తినుట. ఇచ్చుట మొదలగునవి దానికుదాహరణములు. ఈ ప్రత్యయము చేరినప్పుడు ధాత్వంత వర్ణము లోపించుటగాని మరేవిధమైన మార్పుకాని కలుగదు వ్యాకరణ పరిభాషప్రకారము దీనినికూడ కృత్ ప్రత్యయముగానే స్వీకరింపవలసి యుండును.

ఆట, పాట, వంట వంటి శబ్దములలో గల 'ట' ప్రత్యయము కృదంత పరిచ్ఛేదములో చెప్పబడినది. ఈ ప్రత్యయిముచేరినప్పుడు ధాతువు చివరి వర్ణము లోపించును. ఆడు + ట = ఆట, పాడు + ట = పాట, వండు + ట = వంట ఇత్యాది క్రమములో ఈరూపములు నిష్పన్నములగును.

నన్నయ ఆట, పాట, ఓట, వంట, అలమట, అను శబ్దములను 'ట' ప్రత్యయాంతములను ప్రయోగించినాడు. వీనిలో ఆట, పాట, శబ్దములు కర్మార్థములోన, తక్కినవి భావార్థములోను ఈప్రత్యయమును పొందినవి. వంట శబ్దము కర్మార్థమును కూడ బోధించును.

కన్నడములో 'ఆడు', ధాతువు 'ఆట' అను నామముకూడ ఉన్నది తుళు భాషలో ఆట, తమిళమలయాళములలో ఆట్టమ్ అను నామపదములున్నవి. మూల ద్రావిడ ధాతువు 'ఆట్' అనునది.

'పాడు' ధాతువు తమిళ, కన్నడములలో కూడ కన్పించుచున్నది. 'పాట్. అను మూలద్రావిడధాతువుపై 'అ' ప్రత్యయము చేరి పాట శబ్దమేర్పడియుండును' వ్యాకరణ సౌలభ్యము కొరకు 'ట' ప్రత్యయము చెప్పట జరిగినది.

'వంట' శబ్దము 'వన్' అను ధాతువునకు 'ర్' అనుబంధముగాచేరి దానిపై అకారము చేరగా 'ర్' టకారముగా మారి నిష్పన్నమైనది. కుయి భాషలో 'వంద' అను ధాతువు రుచి చూచు అను నర్థములో కలదు. తమిళములో 'వఱు' ధాతువు మరగ బెట్టు అను నర్థమందున్నది.

"టు" వర్ణకాంత శబ్దములు-చేటు, చోటు, ఏటు, పోటు,మాటు అను వి మాత్రము లభించుచున్నవి. చెడుధాతువుపై 'టు' ప్రత్యయము చేరగా ధాత్వంతవర్ణము లోపించి, తొలియచ్చుదీర్ఘముకాగా 'చేటు' శబ్దము సిద్ధించెనని వ్యాకరణ కథనము, ఇట్లే 'చొఱు' ధాతువు నుండి చోటుశబ్దము, ఏయు ధాతువునుండి ఏటుశబ్దము, పొడుచు ధాతువునుండి పోటుశబ్దము, మఱుగు ధాతువునుండి మాటు శబ్దము టు ప్రత్యయాంతములుగా నిష్పన్నములగుచున్నవి.

'డు' ప్రత్యయాంతమగు 'ర్మింగుడు' శబ్దము నొక్కదానిని మాత్రము నన్నయ వాడినాడు.

"రయమున ర్మింగుడుగాలము క్రియ"[14] అని కర్త్రర్థకముగా ర్మింగుడు శబ్దము ప్రయుక్తము.

---

14. ఆది_2_61

'అలంత' 'ఈంత', 'చేంత'. వంత అను బిందుపూర్వక 'త' ప్రత్యయాంత శబ్దములు ఈభాగములో లభింపుచున్నవి. అలయు ధాతువు మీద 'త' ప్రత్యయము చేరి ధాత్వంత వర్ణము లోపించగా అలయు + త > అల + త = అలంత అను రూపము నిష్పన్నమగును. ఇక్కడ ధాతువులో బిందువులేకున్నను ప్రత్యయమునకు ముందు బిందువు కనబడుచున్నది. ఇట్లే చేయు ధాతువులో కూడ బిందువులేకున్నను తజ్జన్యమైన చేంత శబ్దములో బిందువున్నది. ఈంత, వంత శబ్దములు ఈను, వందు ధాతువుల పై 'త' ప్రత్యయము చేరుటవలన ఏర్పడినవి. వీటిలో మూలద్రావిడ ధాతుగతముగా అను నాసికములున్నవి. అందువలన బిందువుండుట సహజము.

ఈకారణమువలన చిన్నయసూరి 'త' ప్రత్యయములు రెండింటిని వేరువేరుగా చెప్పినాడు. ఒకటి 'తజీ', రెండవది 'త' "జిత్తు బిందుపూర్వంకంబగు" అను సూత్రము ననుసరించి 'తజీ' వర్ణకము బిందుపూర్వకముగా చేరును. ప్రకృతి భూతధాతువులో అనునాసికము లేనిచోట 'తజీ' ప్రత్యయమును, అనునాసిక సహిత ధాతువుమీద త ప్రత్యయముతో రూపములను సాధింపవచ్చును. అలంత శబ్దమును అలంగు ధాతువు నుండి కూడ నిష్పన్నము చేయదగును. అలంగు ధాతువునకు శ్రమపడుట అని అర్థము. అలయు, అలంగులకు మూలభూతమైన ప్రకృతులు, మూలద్రావిడములో అనునాసిక, తద్రహితములు రెండు ఉండుట దీనికి హేతువు. తమిళములో 'అలందై' అనునది అలంతకు తుల్యరూపము.

ఇట్లే చేంత శబ్దమునకు ప్రకృతియగు చేయు ధాతువులో అనునాసికము లేకున్నను ఇతర ద్రావిడ భాషాధాతువులను గమనించినప్పుడు అనునాసికము కాన్పించు చున్నది. కన్నడములో 'కెయ్మె' 'గెయ్మె' 'గేమె' అనురూపములు 'చేయునకు' సమా నార్థకములున్నవి. గోండిభాషలో 'కియానా' అనురూపము, గదబ భాషలో 'కెన్' అను క్రియారూపము కనబడుచున్నది. అందువలన 'చేంత' శబ్దములో బిందువుండుటకు మూల ద్రావిడములో అనునాసికాక్షరముండుట కారణము.

కావున భాషాతత్త్వదృష్టితో చూచినప్పుడు కృత్తులలో ఒక్క 'త' ప్రత్యయము మాత్రమున్న చాలును, వ్యాకరణకర్తలు, తమ పరిభాష ప్రకారము సౌలభ్యముకొరకు రెండుభిన్న ప్రత్యయములను చెప్పుట అవసరమైనది.

'చనుప', 'కడప' అను రెండుశబ్దములు'ప' ప్రత్యయాంతములుగా కాన్పించు చున్నవి. వీటిలో 'చనుప' శబ్దము ఆరణ్యపర్వములో ఒకే ఘట్టమున మూడు,నాలుగు పర్యాయములు ప్రయోగింపబడినది. అందులో ఒకచోట'చన్ప' అను సంయుక్తరూపము కూడ కలదు. చను ధాతువుపై 'ప' ప్రత్యయము వలన 'చనుప' రూపము కలిగినది. మార్గమున గుంపుగానడచువారు, సార్థము అని దీవికర్థము. చనుప శబ్దమునకు మార్గమను అర్థముకూడ కలదు.

'కడచు, ధాతువు మీద 'ప' ప్రత్యయము వచ్చి ధాత్వంత్య వర్ణలోపముచే 'కడప' శబ్దము కలుగుచున్నది. దాటబడినది అను కర్మార్థములో ఇంటిద్వారపు అధో భాగము(దేహళి) ను బోధించుచున్నది.దీనికి 'గడప' అను సరళాది రూపముకూడ తరువాత వచ్చినేటి వ్యవహారములో ఉన్నది.

అన్నిటికంటె ఎక్కువగా 'పు' ప్రత్యయాంత శబ్దములు వనక కవిత్రయ భారతములో కాన్పించును. ఈ వర్గములోని శబ్దములను నన్నయ ముప్పదికిపైగా ప్రయోగించినాడు. ఆర్చు ధాతువు నుండి ఆర్పు శబ్దము, ఇంచు ధాతువు నుండి ఇంపు, శబ్దము 'పు' ప్రత్యయము వలన నిష్పన్న మైనవి. ఇట్లే ఏచు > ఏపు ఊర్చు> ఊర్పు, కఱచు> కఱపు, ఏడ్చు> ఏడ్పు, తనర్చు> తనర్పు,తలంచు> తలంపు, తీర్చు> తీర్పు, నేర్చు> నేర్పు, విఱుచు> విఱువు, వేల్చు> వేల్పు, వగచు > వగపు, పఱచు> పఱపు, వెఱచు> వెఱపు, త్రోయు> త్రోపు, నిలుచు> నిలుపు చూచు> చూపు, పనుచు> పనుపు-పన్పు-పంపు, పఱచు> పఱవు ,పెనుచు> పెన్పు -పెనుపు-పెంపు, పొలుచు> పొలుపు-పొల్పు, మెలగు> మెలపు, మాయు> మాపు మార్చు> మార్పు, నిడియు> నిడుపు, వెడలు> వెడల్పు, అనుకృదంత రూపములాయా ధాతువులపై 'పు' ప్రత్యయము చేరగా ఏర్పడినవి.

పై వానిలో తలంపు శబ్దము పూర్ణబిందుయుక్తరూపమే ప్రయుక్తమైనది, తలఁపు అను రూపము ఈ భాగములో లేదు. 'తలఁపమి' అనుపదములో మాత్రము అర్ధబిందు సహితరూపము కాన్పించును. తీరుపు, నేరుపు, అను ఉకారపద్యరూపములు కాక తీర్పు, నేర్పు అను సంయుక్తాక్షర శబ్దములే వాడబడినవి. 'నిలుపు' శబ్దము మాత్రము

ఉకారమధ్యరూపమే లభ్యము. 'నిల్పు' శబ్దమును నన్నయ వాడలేదు. పొలుపునకు రూపాంతరమగు 'పొల్పు' శబ్దము పెనుపునకు-పెన్పు, పెంపు అను రూపాంతరములు, పనుపునకు-పన్పు, పంపు అనురూపములు ప్రయోగింపబడినవి. ఇంపు శబ్దమునకు ఇమ్ము ఇంబు అనురూపాంతరములు నన్నయ భాగములో లభించుచున్నవి. వేల్పుధాతు జన్యము లైన 'వేల్పు', 'వేలుపు' అనురెండు రూపములు కూడ కనబడుచున్నవి.

నేరుపు, ఏడుపు వంటి ప్రయోగములు తరువాతి కవులు చేసియున్నారు. దీని వలన ఉకారమధ్యరూపము లర్వాచీనములనియు, సంశ్లిష్టరూపములే ప్రాచీనములనియు తెలియుచున్నది.

'ఇంచు' ధాతువునకు మూల ప్రకృతి 'ఇన్' అనునది కలదు. ధ్వనిచేయు అను అర్థముగల అర్చు ధాతువునకు కన్నడ, కోత, తమిళభాషలలో 'ఆర్' అను తుల్యార్థక ధాతువున్నది. మూలద్రావిడములో కూడ 'ఆర్' అనునదే ధాతువు. ఏచుధాతువునకు ఏయ్/ఏ అనునవి మూలద్రావిడ భాషలో ప్రకృతులు. ఊర్పు ధాతువునకు మూలదక్షిణ ద్రావిడములో ఉచిర్/ఉయిర్ అనునవి ప్రకృతులుగా గుర్తింపబడినవి. ఈ విధముగా మూలరూపములపైన 'వు' ప్రత్యయము చేరగా నిష్పన్నమైన రూపములే ఇంపు, అర్పు, ఏపు, ఊర్పు శబ్దములు.

ఈ వువర్ణకాంత శబ్దము లన్నింటిలో మాపు, త్రోపు, నిడుపు అనునవితప్ప తక్కిన శబ్దముల ప్రకృతులన్నియు చువర్ణకాంతములుగా ఉన్నవి. ఉదా అర్చు, ఏడ్చు మొదలగునవి. మాయుధాతువునకు 'వు' చేరగా మాపుశబ్దము, త్రోయుధాతువునుండి త్రోపుశబ్దము నిష్పన్నమైనవి. నిడుద శబ్దముయొక్క లుప్తశేషరూపమగు నిడుశబ్దముపై భావార్థములో 'వు' ప్రత్యయము చేర్పగా నిడుపు శబ్దము ఏర్పడియుండును. అట్లైనచో ఇది తద్ధిత ప్రత్యయమని చెప్పవలసియుండును.

తమిళములో 'నెడు' అనుక్రియ, తొద భాషలో 'నొట్' అను ధాతువు పొడవగుట అను అర్థములో ఉన్నవి ఇతర ద్రావిడ భాషలలో ఈ అర్థములో నామ వాచకములు తప్ప క్రియారూపములు లేవు. కన్నడములో 'నిడు' శబ్దము తులుభాషలో

నిడి, నిడు శబ్దములు దీర్ఘార్థములో కలవు. తెలుగులో నిడుధాతువు క్రియారూపములో లేదు. అందువలన దీనిని తద్ధితాంతముగా గ్రహించుట ఉచితము.

సాధారణముగా భావార్థమును బోధించు 'వు' ప్రత్యయము 'వేల్పు' శబ్దములో మాత్రము భిన్నార్థమును బోధించుచున్నది. వేల్చు ధాతువు అగ్నిలో ఆహుతి నిచ్చుటను బోధింపగా దానిపై వచ్చిన 'వు' ప్రత్యయము ఆహుతి నందుకొనుదేవతలను బోధించుచున్నది. నన్నయ ఈ శబ్దమును బహువచనములో మాత్రము ప్రయోగించినాడు.

త్రోవ, ఒఱవ అను రెండు శబ్దములు 'వ' ప్రత్యయాంతములు ఈ భాగ, ములో కనపడుచున్నవి. త్రోయు ధాతువుపై 'వ' ప్రత్యయము చేరి త్రోవ శబ్దము ఒఱగు ధాతువుపై 'వ' ప్రత్యయమువలన ఒఱవ శబ్దము నిష్పన్నమైనవి. మూల ద్రావిడములో త్రోయు ధాతువునకు ప్రకృతి 'తొర' అనునది. దీనిలో వర్ణవ్యత్యయము వలన త్రోవ శబ్దము కలిగినది. ఒఱగు ధాతువునకు 'ఉట్-అంక్' అనునది మూల ద్రావిడరూపము. ఉకారము ఒకారముగాను, దంతమూలీయమగు తకారము శకట రేఫముగను మారి ఒఱగు ధాతువు ఏర్పడినది.

అలవి, తెల్వి అను రెండు 'వి' ప్రత్యయాంత రూపములు నన్నయ రచనలో లభించును. అలయు ధాతువుపై 'వి' ప్రత్యయము చేరుటవలన అలవి శబ్దమేర్పడినది. తమిళములో 'అళ' ధాతువు, కోత భాషలో అళ్వ ధాతువు, కన్నడములో అళె ధాతువు పరిమాణార్థములో కలవు. మూలద్రావిడములో దీని ప్రకృతి 'అళ్' అనునది. ఆ దశ లోనే ప్రత్యయము కలిసి అకారము మధ్యలో చేరుటవలన అళవి రూపము, తరువాత అలవి శబ్దము ఏర్పడియుండును. కన్నడములో అళవు అను నామపదము ఈ అర్థ ములో ఉన్నది. తెలుగులోని లావు అను శబ్దము దీనియొక్క వర్ణవ్యత్యయము వలన కలిగిన రూపమే.

తెల్వి శబ్దము వ్యాకరణ పద్ధతి ప్రకారము తెలియు ధాతువునుండి ఏర్పడిన దని చెప్పవచ్చును తెలియు ధాతువునకు జ్ఞానార్థమే కాక ప్రకాశించు, వెల్లడియగు అను నర్థములు కూడ కలవు. ఈ ధాతువునకు మూలద్రావిడ భాషలో "తెళ్" అనునది ప్రకృతిరూపము. దానిపై 'వి' ప్రత్యయము చేరి ళకారము లకారముగా మారుట

వలన 'తెల్వి' అను రూపము ఏర్పడినది. లకార వకారముల మధ్య స్వరభక్తి వలన ఇకారము చేరి తెలివి అను రూపాంతరము ఏర్పడినది. కాని ఈ రూపమును నన్నయ ప్రయోగించలేదు.

'వు' ప్రత్యయాంతరూపములు కూడ ఈ భాగములో ఎక్కువగానే లభించును, ఉలివు, తెలివు, పుట్టువు, నుడువు, చెయ్వు, తడవు దావు కుఱువు, చెలువు, పొడవు, లావు, ప్రోవు, మఱవు అను శబ్దములను 'వు' ప్రత్యయాంతములుగా గ్రహింపదగును.

ఉలియు ధాతువు మీద ఈ ప్రత్యయము చేరి ధాతువు చివరివర్ణము లోపించుటవలన ఉలివు శబ్దమేర్పడినది. దీని ద్రావిడ మూలరూపము 'ఉఌ' అనునది కన్నడములో 'ఉలి' ధాతువు ధ్వనించు అనునర్థములో కలదు.

తెలివు శబ్దము తెలియు ధాతువునుండి నిష్పన్నమైనది. ఈ ధాతువునుగూర్చి పూర్వము "తెల్వి" శబ్ద ప్రస్తావనలో వివరింపబడినది. పుట్టు ధాతువునుండి 'పుట్టువు' అను రూపము కలిగినది. ఇదే అర్థములో 'పుట్టు' అను క్రియానామవాచకము గూడ కవి ప్రయోగములలో నున్నది. దానిని నన్నయ ప్రయోగించలేదు.

కన్నడములో పుట్టు, హుట్టు, ఉట్టు అను మూడు ధాతువులు కలవు. మూల ద్రావిడములో దీనికి ప్రకృతి 'పుట్' అను ధాతువు. దానిపై అచ్చు చేరినపుడు ద్విత్వము కలిగి తెలుగులో పుట్టు ధాతువైనది.

'నుడువు' అనునది కూడ ధాతువుగాను, నామముగాను, వ్యవహారములో నున్నది. కావున వ్యాకరణ పరిభాష ప్రకారము దీనిని 'ఉ' ప్రత్యయాంతముగనే చెప్పవలసియున్నది. కాని నుడువు అనునది మూలధాతువు కాదు. 'నుడి' అను శబ్దమొకటి ఇదేయర్థములో ప్రసిద్ధముగానుండుట దీనికి సమర్థకము. తమిళములో 'నొడి' అను క్రియమాట్లాడుట అనునర్థములో నున్నది. కన్నడములో 'నుడి' అను క్రియగలదు. తెలుగులో నుడి, నొడి, అను రెండు రూపములతో పాటు నొడువు, నుడువు అను రూపాంతరములు కూడాకలవు. నుడుగు, నొడుగు అనుగకారయుక్త రూపములు కూడక న్పించుచున్నవి.

అందువలన 'నొడి' లేక 'నుడి' అను మూలధాతువుపై 'వు' ప్రత్యయము చేరి దానిలోని ఉకార సాహచర్యము వలన ధాతుగత ఇకారము ఉకారముగా మారి నుడువు నొడువు అను రూపములనంది యుండును. అట్లు కాక కలుగు, తిరుగు, తరుగు, పెరుగు మొదలగు చాల ధాతువులపై అనుబంధముగా చేరినట్లు 'గు' మొదట చేరి నుడుగు, నొడుగు అనురూపములనంది, పిమ్మట గకారము వత్వము నందెనని కూడ చెప్పవచ్చును. ఈపద్ధతిలో గకారయుక్తరూపము ప్రాచీన తరమని చెప్పవచ్చును. నన్నయ వీనిలో ఏరూపమును ప్రయోగించెనో నిర్ణయించుటకు యతిప్రాస స్థలములో అటువంటి నిర్ధారక ప్రయోగములు లభించనందువలన అతడు దేనిని ప్రయోగించె ననునది అనిశ్చితము.

ఇక చెయ్వు శబ్దములో 'వు' ప్రత్యయము స్పష్టముగా కనిపించు చున్నది. చేయు ధాతువుమీద 'వు' ప్రత్యయము చేరి, అచ్చునకు హ్రస్వము, చివరి ఉకారమునకు లోపము కలుగగా పైరూప మేర్పడుట వ్యాకరణ ప్రక్రియ.

సోదర ద్రావిడ భాషలతో పోల్చిచూడగా 'చెయ్' అనునది మూలప్రకృతి యని, దానిమీదనే, 'వు' చేరి చెయ్వురూపము నిష్పన్నమైనట్లు స్పష్టము. తమిళములో 'చెయ్' మలయాళంలో 'చెయ్‌క' కన్నడములో 'కెయ్, కై', కొడగులో 'కెయ్' అను ధాతువులు 'చేయు' సమానార్థకాలున్నవి. ఆది కకారము తెలుగు మొదలగు భాషలలో తాలవ్యీకరణము వలన చకారముగా మారినది. చేయి, కైవంటి కొన్ని శబ్దాలలో రెండు రూపములు నిలిచినవి. చెయ్వు శబ్దము బహువచనరూపమే మనకీ భాగములో లభించు చున్నది. 'చెయువు' అను ఉకారమధ్య రూపమును నన్నయ ప్రయోగించలేదు.

తడయు ధాతువుపై 'వు' ప్రత్యయము వలన 'తడవు' శబ్దము, చచ్చు ధాతువునుండి చావుశబ్దమును కలుగుచున్నవి. పొదుచుధాతు జన్యముగా పొదవు శబ్దము గ్రహింపదగును.

తడయు ధాతువు అంత్యవర్ణము లోపించగా తడవు, రూపము ఏర్పడును. చచ్చు, నొచ్చులకు 'చావు, నోవు' లాదేశములగునని చిన్నయసూరి 'చావు' శబ్దమును సాధించినాడు. కాని తమిళభాషలో 'చా' ధాతువు, కన్నడములో 'సాయ్' ధాతువు కొండ భాషలో 'సా' ధాతువు మరణార్థములో కనపడుచున్నందున 'చా' అనుమూల

ధాతువునుండి 'వు' ప్రత్యయము చేరుట వలననే 'చావు' శబ్దమేర్పడెనని తలచుట సముచితము.

'పొదుచు' ధాతువునకు ఉదయించుట, ఎక్కుట, పోట్లాడుట. అను అర్థములున్నవి. 'పైకెక్కు' అను అర్థముగల పొదుచు ధాతువుపై 'వు' ప్రత్యయము చేరుటవలన పొదువు అనురూపము నిష్పన్నమగును. నన్నయ ఈ శబ్దమును 'ఎత్తు' అను అర్థములో ప్రయోగించినాడు.

'పొదవు' అను అకారమధ్యరూపము మరియొకటి కలదు. దానికి ఔన్నత్యార్థముతో పాటు రూపు, దైర్ఘ్యము అను అర్థములు కూడ ఉన్నవి. రూపార్థకమగు పొదవు శబ్దమును నన్నయ ప్రయోగించినాడు. దానిని పొదుచు ధాతువుపై 'అవు' ప్రత్యయము చేరుటవలన కలిగినదిగా చెప్పవలెను.

దాటగు, దాగికొను అనునర్థములలో మఱుఁగు ధాతువున్నది. దానిమీద 'వు' ప్రత్యయము చేరి అంత్యవర్ణము లోపించుట వలన 'మఱువు' అను శబ్దము నిష్పన్నమైనది. ధాతువులోని గకారమునకే వకారాదేశము కలిగి, ఉకారరూప ప్రత్యయముతో కూడి 'మఱువు' రూపము జనించినదని చెప్పుటకవకాశమున్నది.

ప్రోవు శబ్దమునకు ప్రకృతియగు ధాతువు ప్రోఁచు అనునది. దీనికి నిలువచేయు, భద్రపరచు అనునర్థములు కలవు. దీనికి మూలద్రావిడములో 'పొర్-వ్' అనునది మూలము. ఇది వర్ణవ్యత్యయమును పొందగా ప్రో అను రూపమును పొంది దానిపై 'వు' ప్రత్యయము చేరగా 'ప్రోవు' శబ్దము నిష్పన్నమగును. నన్నయ దీనిని రాశి అనునర్థములో ప్రయోగించెను. తమిళములో పోర్వు, మలయాళములో పోర్ అనునవి రాశి అనునర్థములో నున్నవి.

ఇంతవరకు తెలుగు లాక్షణికులు ప్రతిపాదించిన కృత్తులలో నన్నయ ప్రయోగించిన 22 ప్రత్యయాలను చర్చించినాను. ఇప్పుడు వ్యాకరణకర్తలు తమ గ్రంథాలలో పేర్కొనని, కృత్తులుగా చెప్పదగినవి అగు ప్రత్యయముల నీభాగములో గమనింతము. అటువంటివి పది ఉన్నవి. అవి—

అలు, ఇద, ఇది , ఇవ, కని, కు, కోలు, గి, ము, సలి అనునవి క్రమముగా వీనిని గూర్చి సమీక్షింతును.

1. 'చూపఱు' శబ్దమును చూచువారను అర్థములో నన్నయ ప్రయోగించి నాడు.

> 'నరునింద్రాత్మజు నింద్రా
> వరజునకున్ వీరుఁ బాండవ ప్రవరుధను
> ర్ధరుఁ జూచి చూపఱెల్లరన్' (ఆది-8-18)

ఇటువంటి మరికొన్ని ప్రయోగములు కూడ కలవు. చూచు + అలు > చూవు + అలు = చూపఱు అను క్రమములో దీనిరూపసిద్ధి కలిగినది. చకారమునకు వకారము చూపు మొదలగు చోట్లవలె వచ్చినది. దీనికి ఏకవచనములో ప్రయోగము లేదు.

'చూపఱు' శబ్దమును కవిత్రయము వారందరు ప్రయోగించినప్పటికి బాల ప్రౌఢవ్యాకరణకర్తలు 'అలు' ప్రత్యయమును పేర్కొనకపోవుట విచిత్రము.

నన్నయ 'పన్నిదము' అను శబ్దమును ఒకేచోట వరుసగా మూడు మార్లు ప్రయోగించినాడు.[14] దీనిలోని 'ఇద' ప్రత్యయము ధాతువుమీద చేరినది కావున కృత్ ప్రత్యయమనక తప్పదు. పన్ను శబ్దము నామముగా ప్రయోగములలో లేనందున తద్ధిత మనజాలము. చిన్నయసూరి ఇద ప్రత్యయమును కృత్తద్ధితాలు రెండింటిలోను చెప్ప లేదు. ప్రౌఢవ్యాకరణ కర్త ఒప్పు, తప్పు, పెల్లు శబ్దములకు మాత్రము స్వార్థములో తద్ధిత ప్రకరణములో ఇద ప్రత్యయమును చెప్పినాడు. అందువలన నన్నయ వాడిన 'పన్నిదము' లోని ఇద ప్రత్యయము లాక్షణికులు పేర్కొనని కృత్ ప్రత్యయమనుట స్పష్టము.

'ఇది' ప్రత్యయముతో గూడిన 'చెయిది' శబ్దమును, దాని రూపాంతరమైన 'చెద్దు' అను రూపమును కూడ నన్నయ ప్రయోగించినాడు. వ్యాకరణ సంప్రదాయాను

---

14. ఆది-2-31, 32, 33.

సారము చేయు + ఇది > చెయ్ + ఇది = చెయిది అని ప్రక్రియ చెప్పవలసియున్నది. ధాతువు తొలిదీర్ఘము హ్రస్వముగా మారినది కాని ఇతర ద్రావిడ భాషలను పరిశీలించి చూడగా 'చెయ్' అనునదే మూలధాతువనియు, దానిపై 'ది' అను ప్రత్యయము చేరగా 'చెయ్ది' రూపమేర్పడి తరువాత ఇకారము మధ్యలో చేరి 'చెయిది' అను శబ్దము కలిగినదని చెప్పుట శాస్త్రీయముగా నుండును

తమిళములో 'చెయ్' ధాతువు, కన్నడములో 'కెయ్, గెయ్' ధాతువులు కోతభాషలో 'గెయ్' ధాతువు చేయు ధాతువునకు సమానార్థకములుగా ఉన్నవి. మూల ద్రావిడ భాషలోని ధాతువు 'కెయ్' అని భాషాశాస్త్రకథనము.

'ఉక్కివము' శబ్దము నన్నయ భారతములో కనబడుచున్నది. కపటమను నర్థములోనిది ప్రయుక్తము. 'ఉక్కు' ధాతువుపై 'ఇవ' ప్రత్యయము చేరగా నీశబ్దముత్పన్నమైనదని బాలవ్యాకరణోద్యోతములో వల్లించిన సీతారామస్వామి శాస్త్రి తెలిపినారు.

"ఇట్టి కార్యమునకు నేనవశ్యంబును
నొడఁబడంగ నోపనుక్కివమున[15]"

"కని" ప్రత్యయాంతమని చెప్పదగిన 'కనుకని' శబ్దము నన్నయరచనలో కలదు.

వ॥ "తత్పరిజనంబులందరు నశనిపాతంబున
బెదిరి చెదరినట్లు కనుకనిం బఱచిరి[16]"

కనుకని శబ్దమునకు సంభ్రమము, భయము అను అర్థములు కలవు. 'కను' ధాత్వర్థమునకు సంభ్రమార్థము కొంత దూరముగానున్నది. ఈవిధమైన శబ్దమింకొకటి కానరాదు.

'కు' ప్రత్యయాంత రూపములు–చినుకు, సీకు, వలంకు, వీకు అను నాలుగు లభించుచున్నవి.

---

15. సభా-2-130 16 ఆది-2-198

చిందు ధాతువునకు మూలరూపమగు 'చిన్' అను దానిపై 'కు' ప్రత్యయము చేరగా చిన్కు అను రూపముకల్గి, తరువాత స్వరభక్తివలన ఉకారముచేరి చినుకు శబ్దము నిష్పన్నమై యుండును. నన్నయ చినుకు శబ్దమునే ప్రయోగించినాడు.

'చీకు' శబ్దము చివుకు ధాతువునుండి యేర్పడినది. 'చివుకు' ధాతువునకు 'శీర్ణమగు' 'కృశించు', సారహీనమగు అను నర్థములున్నవి. ఈధాతువు మీద 'కు' ప్రత్యయము చేరి, మధ్యవర్ణము లోపించి ఆద్యచ్చునకు దీర్ఘమురాగా 'చీకు' అను శబ్దము నిష్పన్నమైనది. గ్రుడ్డివాఁడను నర్థములో చీకుశబ్దమును నన్నయ వాడినాడు.

వలంకు శబ్దము వలను శబ్దముపై 'కు' ప్రత్యయము చేరుటవలన నేర్పడి నది. వలను, వలఁకు, శబ్దములు సమానార్థకములుగనే వ్యవహారములో నున్నవి. కనుక ఇక్కడ 'కు' ప్రత్యయము స్వార్థములోనే వచ్చినదని తెలవవలెను.

పీకు శబ్దమునకు 'ఉన్నతి', 'పరాక్రమము' అనునర్థములున్నవి. ఇది 'పీఁగు ధాతువువలన కు ప్రత్యయాంతముగా నేర్పడిన శబ్దము. పీఁగు ధాతువునకు 'నిక్కు' 'విజృంభించు', 'ఉత్సహించు' అను నర్థములున్నవి.

అనుప్రయుక్తమైన కొను ధాతువు 'కోలు'గా మారినదని వ్యాకరణకారులు తెల్పినారు. కాని దీనిని ప్రత్యయముగా గ్రహించుటే నముచితము. 'ప్రబ్బికోలు, విల్చికోలు, వేఁడికోలు' అను మూడు రూపములను నన్నయ వాడినాడు. ఈ మూడింటి లోను ధాతువు చివర ఇకారము చేరినది.

'గి' ప్రత్యయాంతమని చెప్పదగిన 'ఈగి' శబ్దమొకటి కనిపించుచున్నది. ఇచ్చు ధాతువుపై 'గి' ప్రత్యయము చేరి, ధాత్వంత్యవర్ణము లోపించి ఇకారమునకు దీర్ఘము వచ్చినది.

> "చనువెంచి మహా మునివరు
> లనవరతము వారలకు ప్రియంబొనరఁగ దీ
> వన లీగిఁ జేసి కుశలము"[17] అని నన్నయ ప్రయోగము. కన్నడ,

17. ఆర-1-99

తమిళములలో 'ఈ' అనియు పర్జిలో 'సీ' గోండిలో 'సీ' అనియు ఇచ్చునవి సమానార్థక ధాతువులున్నవి. మూల ద్రావిడములో 'సీ' అని ధాతురూపము ఆదివకారము లోపించిన ఈ రూపము నుండియే ఈగి శబ్దము నిష్పన్నమైనదనుట సమంజసము. 'ఇచ్చు' అనునది అనుబంధము చేరిన రెండవరూపము.

నోము శబ్దము వ్రతము, పూజ అను నర్థములలో ప్రయోగమందున్నది నన్నయ దీనిని పూజలు అను అర్థములో ప్రయోగించినాడు.

మధ్యాక్కర:— "నుడువులు వేయునింకేలయిప్పాట
నోములుదార్లి! కడఁగి నోఁచితిని"[18]

నోము ధాతువుపై 'ము' ప్రత్యయము చేరగా నిష్పన్నమైనది నోముశబ్దము. పైపద్యములోనే నోఁచితిని అను నోఁచు ధాతు భూత కాలికరూపము కూడ ప్రయుక్తమైనది.

సోదర ద్రావిడ భాషలలో నోన్, నోక్ ధాతువులు, 'నోప్పు' అను నామవాచకము కలవు. కావున 'నోన్' అను మూలద్రావిడ ధాతువుపై ఉకారము చేరి, నకారము ఓష్ఠ్య సాహచర్యము వలన మకారముగా మారి నోము శబ్దముత్పన్నమైనదనుట సముచితముగా నుండును.

ఈవిధముగా బాలవ్యాకరణాది లాక్షణికులు నిరూపించని పది కృత్ ప్రత్యయాలను నన్నయ ప్రయోగించినాడు. ఈగి, చూపఱు, చెయ్ది వంటి ప్రసిద్ధ శబ్దములకు లాక్షణికులు వ్యుత్పత్తి చెప్పకపోవుట ఆశ్చర్యముగానున్నది.

అనేక నూతన ప్రత్యయములను ప్రతిపాదించిన సూక్తిలక్షణకౌముది కాని వ్యావహారికాంధ్ర భాషావ్యాకరణము గాని ఈగి వంటి శబ్దములను స్పృశింపలేదు.

ఈ రీతిగా నన్నయ తన భారతములో మొత్తము 30 కృత్ ప్రత్యయరూపములను ప్రయోగించినాడు. ప్రామాణిక వ్యాకరణములని చెప్పదగిన బాలప్రౌఢ వ్యాకరణములు వీటిలో కొన్నిటిని పేర్కొనకపోవుటకు కారణము తెలియరాదు.

---

18. ఆది-4-103

పొలంతి శబ్దము నన్నయ రచనలో లభించుచున్నది. దీనిలో 'తి' ప్రత్యయము స్పష్టముగా కన్పించుచున్నది. ఇది పొలుచు ధాతువునకు సంబంధించినది— తమిళములో 'పొలి', కన్నడములో 'పొల్' అను ధాతువులు ప్రకాశార్థములో కనబడు చున్నవి. (D. E. D. 3717)

అందువలన 'పొళ్' అను మూలధాతువుపై 'తి' ప్రత్యయము చేరగా 'పొల్తి' శబ్దము, స్వరాగమము వలన 'పొలంతి' శబ్దము నిష్పన్నమయ్యెనని చెప్ప దగును.

'ముదునలి' శబ్దముకూడ నన్నయ భాగములో కన్పించుచున్నది. ఇది 'ముదియు' ధాతువునకు 'నలి' ప్రత్యయము చేరగా నేర్పడిన రూపము.

పొలంతి శబ్దములోని 'తి' ప్రత్యయమును, ముదునలి శబ్దములోని 'నలి' ప్రత్యయమును కూడ సంప్రదాయ వ్యాకర్తలెవ్వరును చెప్పలేదు.

ఆదికావ్యముగా ప్రసిద్ధినొందిన ఆంధ్రమహాభారతములోని తొలి కవి నన్నయ భాగములోనే లాక్షణికులు నిరూపించని 'కృత్' ప్రత్యయాలు పది లభించుట విశేషము.

## నన్నయ వాడిన తద్ధిత ప్రత్యయములు

నన్నయ తన భారతములో ప్రయోగించిన తద్ధిత ప్రత్యయములు 13 లభించుచున్నవి. అవి-"అ, అరి, ఇ, ఉక, కాఁడు టిమి, త, తన, న, పం, పోతు, ఱిక, సేవు"-అనునవి.

మత్వర్థములో 'అ' ప్రత్యయమును చిన్నయసూరి వాచ్యముగా చెప్పక "అర్థ విశేషంబుల వర్ణకాంతరములును మహత్ప్రయోగంబులనెఱుంగునది"[19] అను సూత్రము క్రింద అదప, చెడుగఁడు, దుదుకఁడు, నిదుపఁడు-అను ఉదాహరణముల ద్వారా 'అ' ప్రత్యయమును ప్రదర్శించినాడు.

ప్రకృత భాగములో 'అ' ప్రత్యయాంతము 'చెలువ' శబ్దమొక్కటే కన్పించుచున్నది. సౌందర్యార్థకమగు 'చెలువు' శబ్దముమీద మత్వర్థములో 'అ' ప్రత్యయము చేరి 'చెలువ' రూపము నిష్పన్నమైనది. అందముకలది అను వ్యుత్పత్త్యర్థముతో నేర్పడిన యీ శబ్దము తరువాత స్త్రీ పర్యాయముగా మారినది.

---

19. బాల- తద్ధిత 28

'ఇల్లడ' శబ్దము అడ ప్రత్యయాంతమని చెప్పదగును. ఒకవస్తువును మరియొక చోట న్యాసముగా నుంచుట అనునర్థములో సీపనము వాడుకలోనున్నది. నన్నయకూడ అదేయర్థములో ప్రయోగించినాడు.

> "నన్నెద నమ్ముదేని యిల్లడ యిడు భీము సర్వు
> ను నలంఘ్య బలాఢ్యుల"[20]

"ఉనికిపట్టు" అనునర్థముగల 'ఇల్లు' శబ్దముపై 'అడ' ప్రత్యయము చేరి ఇల్లడ శబ్దము సిద్ధించినది నివాస విషయమని ఫలితార్థము.

'అరి' ప్రత్యయాంత శబ్దములు-ఆలరి, జాలరుల్, సూనరి-అనునవి నన్నయ ప్రయుక్తములైనవి. ఈ శబ్దములలో 'అరి' ప్రత్యయము మత్వర్థములో వచ్చినది.

దేశ్యమగు 'ఆలము' శబ్దమునకు అసత్యము, ఉపేక్ష, అలక్ష్యము, అను నర్థములున్నవి. నన్నయ ప్రయోగించిన పద్యములోని 'ఆలరి' శబ్దము దుష్టుడైన అను నర్థమును బోధించుచున్నది. అసత్యార్థకమైన 'ఆలము' శబ్దము మత్వర్థకమైన 'అరి' ప్రత్యయము చేరిన తరువాత, కొద్దిగా అర్థవ్యాకోచము నొంది దుష్టస్వభావము కల వాడను నర్థమును తెలుపుచున్నది.

వల అను నర్థముగల సంస్కృతజాల శబ్దభవము 'జాల' అను తద్భవ పదము. దానిపై మత్వర్థములో 'అరి' ప్రత్యయము చేరి జాలరి శబ్దమేర్పడినది. ఇది బహువచనరూపములో మాత్రము ప్రయోగింపబడినది. (జాలరులు)

తత్సమమైన 'సూన' శబ్దము పశువధస్థానార్థకము అది 'అరి' ప్రత్యయముతో కూడి 'సూనరి' శబ్దమైనది. పశువధస్థానము కలవాడు, పశువులను చంపువాడు. కసాయివాడు అను నర్థమును బోధించుచున్నది. తత్సమప్రకృతి మీద కూడ 'అరి' ప్రత్యయము చేరుననుట కిది దృష్టాంతముగా గ్రహింపవచ్చును.

'ఇ' ప్రత్యయము మత్వర్థములో చేరిన 'కదలి' శబ్దమొక్కటి నన్నయ భాగములో లభించును. తరంగార్థకమైన 'కదలు' శబ్దముమీద మత్వర్థములో 'ఇ' ప్రత్య

---

20. సభా. 1-163

యము చేరుటవలన (కదలు + ఇ) కదలి శబ్దము నిష్పన్నమగుచున్నది. తరంగములు కలది-సముద్రము అను వాచ్యార్థమును బోధించుచున్నది. ఈ శబ్దము బహువచనములో "కదళుల్" అను రూపము మాత్రము నన్నయ రచనలో దృష్టము. ఏకవచనరూపము కాన్పించదు.

ఒప్పిదము అను శబ్దమును తద్ధిత ప్రత్యయాంతముగా త్రిలింగలక్షణ శేషము మొదలగునవి పేర్కొన్నవి. ఒప్పు అను ధాతుజన్యనామముపై 'ఇద' ప్రత్యయము చేరగా ఈ శబ్దమేర్పడునని వారి ఆశయము.

దీనిని కృత్ ప్రత్యయాంతముగా కూడ చెప్పవచ్చునని నా అభిప్రాయము. 'ఒప్పు' ధాతువు మీద భావార్థములో 'ఇద' ప్రత్యయమును చెప్పవచ్చును. పెల్లిదము, తప్పిదము వంటి శబ్దములను సాధించుటకు తద్ధిత ప్రత్యయమును చెప్పవలసి ఉన్నందున వాటితో పాటు ఒప్పు శబ్దమును కూడ చేర్చి ఆ ప్రత్యయమును చెప్పినారు. కాని నన్నయ తప్పిదము, పెల్లిదము వంటి శబ్దములను ప్రయోగింపలేదు. అంతేకాక పన్నిదము అను శబ్దమును కూడ ప్రయోగించినాడు. దానిని కృదంతము గానే గ్రహింపవలసియుండును. అందువలన నన్నయ ప్రయోగించిన ఒప్పిదము, పన్నిదము శబ్దములను కృదంతములుగనే పరిగణించుట భావ్యము.

ఉక ప్రత్యయాంతము 'చిఱుతుక' శబ్దమొక్కటి గోచరించును. చిఱుత శబ్దము మీద స్వార్థములో ఉక ప్రత్యయము వచ్చి 'చిఱుతుక' రూపము నిష్పన్నమైనది. కేవల చిఱుత శబ్దమును కూడ నన్నయ ప్రయోగించి ఉన్నాడు. స్వార్థమనగా ప్రకృత్యర్థము. చిఱుత, చిఱుతుక శబ్దములకు వాచ్యార్థమొక్కటే, నెలఁతుక, పొలఁతుక వంటి అనంతరకవుల ప్రయోగము లీ భాగములో కానరావు.

మత్వర్థములోనే వచ్చు మరియొక ప్రత్యయము 'కాఁడు'. ఈ ప్రత్యయముతో కూడిన శబ్దములు తాపికాఁడు, సంగడికాఁడు, పటికాఁడు, బలిమికాఁడు, నేర్పుకాడు అను 5 ప్రయోగములను నన్నయ గ్రంథములో చూడగలము.

'తాపి' అను శబ్దమునకు జాడ అను నర్థము కలదు. దానిపై కాఁడు ప్రత్యయము చేరి తాపికాఁడు అను శబ్దము నిష్పన్నమగును. జాడ తెలుపువాడు అను నర్థములో ఇది ప్రయుక్తమైనది.

నేర్పు శబ్దము కృదంతము. దానిమీద మత్వర్థములో కాఁడు ప్రత్యయము చేరి నేర్పుకాఁడు అను రూపము సిద్ధము.

'పరికాఁడు' అను శబ్దమొకటి యూథపము అను నర్థములో నన్నయచే ప్రయోగింపబడినది. 'పరి' శబ్దమునకు నిఘంటువులలో సమూహ మను నర్థము చూప బడినది. సమూహము కలవాడు/కలది అనగా తన నాయకత్వములో సమూహమున్న వ్యక్తి అని పర్యవసితార్థము.

బలార్థకమైన బలిమి శబ్దముపై 'కాఁడు' ప్రత్యయము చేరగా బలిమికాడు అను రూపము బలవంతు డను నర్థములో కాన్పించుచున్నది. సంస్కృతసమములపై ఇమి' ప్రత్యయమును బాలవ్యాకరణాదులు చెప్పలేదు. కాని ముక్తలక్షణకౌముదిలో 'బలిమి' అను లక్ష్యముతోగూడ చెప్పబడినది.

సంగడి శబ్దమునకు స్నేహము, చెలికాడు అను రెండర్థములను నిఘంటువులు తెలిపినవి. స్నేహార్థకమైన సంగడి శబ్దము మీద మత్వర్థములో ఈ ప్రత్యయము చేయగా సంగడికాఁడను శబ్దమేర్పడి చెలికాఁడను నర్థమును బోధించును. అట్లుకాక సంగడి శబ్దమును మిత్రార్థకముగా గ్రహించినచో కాఁడు ప్రత్యయము స్వార్థమున వచ్చినదని చెప్పవలసియుండును. ఈ రెంటిలో మొదటి పద్ధతే సముచితముగా తోచు చున్నది. మొదట సంగడికాఁడు శబ్దమే సుహృద్వాచకముగా ఉండి, కాలక్రమమున కాఁడు ప్రత్యయము లేకుండా 'సంగడి' శబ్దము మిత్రవాచకముగా వ్యవహారములోనికి వచ్చియుండును.

'మగఁటిమి' శబ్దమునకు బాలవ్యాకరణము వ్యుత్పత్తిని చెప్పక, "మగఁటి మ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు"[21] అను సూత్రముద్వారా నిపాతముగా పేర్కొన్నది. ప్రౌఢవ్యాకరణము మొదలగు తరువాతి వ్యాకరణములు కాని, ప్రాచీన వ్యాకరణములు కాని 'మగఁటిమి' శబ్దప్రక్రియను నిరూపించలేదు. పౌరుషము, మగ తనము, అను భావార్థము నీ శబ్దము బోధించుచున్నది. 'మగన్' అను శబ్దము ప్రాచీన ద్రావిడ పురుషవాచకము. దానిపై 'టిమి' అను భాగము భావార్థములో చేరినది.

---

21 బాల-తద్ధి-8

తమిళ, మలయాళ భాషలలో 'మగన్' శబ్దము కుమారుడు, పురుషుడు అనే అర్థాలలో ఉన్నది. ఆ శబ్దము మీద 'ఉ' చేరి మగన్ఱు> మగంఱు> మగండు > మగఁడు అను రూపములు తెలుగులో ఏర్పడినవి. తరువాత భర్త అను నర్థ మీ భాషలో రూఢమైనది. మగండు, మగఁడు అను శబ్దముల మీద భావార్థములో 'ఇమి' ప్రత్యయము చేరి, దకారమునకు టకార మాదేశము కాగా మగంటిమి, మగఁటిమి అను శబ్దము లేర్పడియుండునని తలచుట కవకాశమున్నది పేదిమి, కడిమి మొదలగు శబ్దములలో భావార్థక మగు 'ఇమి' ప్రత్యయము కనబడుట ప్రసిద్ధమే.

చిన్నయసూరి బాలవ్యాకరణమునకు ముందు సంస్కృతభాషలో రచించిన సూత్రాంధ్రవ్యాకరణములో 'మగాదిభ్యష్టిమిజాదయః' అని సూత్రించి 'మగ' శబ్దముపై టిమిజ్ ప్రత్యయము చేరుటవలన మగఁటిమి శబ్దమేర్పడునని తెలిపినాడు. కాని అతడే తరువాత రచించిన బాలవ్యాకరణములో ఈ శబ్దమును నిపాతముగా నిర్దేశించుటకు కారణము తెలియకున్నది.

'చిఱుత', 'ఒక్కత' అను రెండు శబ్దములు 'త' ప్రత్యయముతో ప్రయోగింపబడినవి. ఇవి రెండు కూడ స్వార్థక ప్రత్యయాంతములే. నిఘంటుకారులు 'చిఱు' శబ్దమును 'చిఱుత' శబ్దముయొక్క లుప్తశేషమని పేర్కొన్నారు. కాని వాస్తవముగా 'చిఱు' శబ్దమే ప్రాథమిక మని 'చిఱుత' అనంతరరూపమని ఇతర ద్రావిడభాషల పరిశీలనవలన తెలియును. తమిళములో 'చిఱు' మలయాళములో చెఱు, చెఱు, కన్నడములో కిఱి, కిఱు, తుళులో కిరి, కిరు అని సమానార్థక రూపములున్నవి. 'చిఱుత' రూపసామ్యము కల శబ్దములు తమిళములో 'చిఱితు' అని కన్నడములో 'కిరిదు' అని కన్పించుచున్నవి. కనుక 'చిఱు' అను ప్రకృతిమీదనే స్వార్థములో 'త' ప్రత్యయము చేరినదనుట సమంజసము.

నన్నయ 'చిఱుతకాలము' అను సమాసములోనే ఈ శబ్దమును ప్రయోగించినాడు. చిన్నవయసు అను నర్థము నీ శబ్దము బోధించుచున్నది. చిఱుత శబ్దము విశేషణముగా సర్వలింగ సాధారణముగా ఉన్నది.

ఒక్క శబ్దముపై స్వార్థమున స్త్రీత్వబోధకముగా 'త' ప్రత్యయము చేరఁగా 'ఒక్కత' శబ్ద మేర్పడినది. బాలవ్యాకరణాదులు కులవాచకములగు బోయ, చాకి

మున్నగు శబ్దములమీద 'త' ప్రత్యయమును చెప్పినారు. కాని 'ఒక్కత' వంటి శబ్దములను సాధించలేము దీనిని స్త్రీప్రత్యయ భేదముగా పరిగణింపవగునేమో.

భావార్థక 'తన' ప్రత్యయాంతము 'పలుగుఁదనంబు' అను శబ్దమొక్కటి మాత్రము నన్నయ భారతములో కాన్పించును. దుష్టార్థకమైన పలుగు శబ్దముమీద భావార్థములో 'తన' ప్రత్యయముచేరగా 'పలుఁగుఁదనము' అను రూపము కలిగి దుష్టత్వమను అర్థమును బోధించుచున్నది. ఇదికాక తన ప్రత్యయాంత శబ్దము మరేదియు ప్రకృత భాగములో లేదు.

"చల్కన" శబ్దమొకటి 'న' ప్రత్యయాంతము ఆదిపర్వమున[22] ప్రయుక్తమైనది. ఇక్కడ తేలికదనము అను భావార్థములో 'న' ప్రత్యయము కనబడుచున్నది సభాపర్వములో మరొకచోట 'చులుకన ద్వారమున[23]' అను ప్రయోగమున్నది. అల్పమైన ద్వారమున అని అర్థము చెప్పవలసియున్నది. అనగా 'న' ప్రత్యయము స్వార్థములోనే చేరినది. "చులుకన" శబ్దమే కాలక్రమమున మధ్యస్వరము లోపించి "చల్కన"గా మారినది.

"వెలువల, వలపల" అను రెండు శబ్దములలో "పల" ప్రత్యయము చూపట్టుచున్నది. వెలిశబ్దముమీద 'పల' ప్రత్యయము చేరి ఇకారము ఉకారముగా మారుటవలన వెలువల శబ్దము నిష్పన్నమైనది.

'వలను' శబ్దముపై పలప్రత్యయము కూడినప్పుడు వలనులోని 'ను' లోపించి వలపల శబ్దము సిద్ధించినదని నిఘంటువులు, లాక్షణికులు చెప్పినారు. కాని బలవాచకమగు వల శబ్దము కుడిభాగమును బోధించునదై దానిమీద పలప్రత్యయము చేరినదనుట సముచితముగా నుండును.

పుంస్త్వ సూచకమైన 'పోతు' ప్రత్యయమును ఎనుపోతు శబ్దములో నన్నయ వాడినాడు. ఉభయలింగమగు 'ఎను' శబ్దముమీద పుంలింగ సూచనగా పోతు ప్రత్యయము చేరి మగదున్న అను నర్థమును బోధించుచున్నది. పోతుప్రత్యయము అంతమందుగల శబ్దమిదొక్కటే ఉన్నది.

---

22 ఆది_6_180 28. సభా-1-182

భావార్థకమగు 'టిక' ప్రత్యయముతో పేదటికము అను శబ్దము నొక్కదానిని మాత్రమే, నన్నయ ప్రయోగించినాడు.

పలువ శబ్దము ఎక్కువగా మాట్లాడువాడు అను నర్థములో ప్రయోగింపబడి నది పలు + వాయి = అనగా ఎక్కువ నోరు కలవాడు అని నిఘంటుకారులు వ్యుత్పత్తి తెలిపినారు. వాయి శబ్దములో 'వ' అనునది మాత్రము శేషించి అది ప్రత్యయస్వరూపమును పొందినది. ఇది పలు అను విశేషణము మీద నిలిచినందున దీనిని తద్ధితముగ పరిగణింపవలెను.

"పిలువంగ బడక సభలకు
.....................................
................ ......................
పలువ ఎఱుంగవు వరాత్మ పరిమాణంబుల్"
(ఆది-636)

కాలార్థకమైన 'సేపు' ప్రత్యయమును నన్నయ ఒక్కచోట 'కొంతసేపు' అను పదములో ప్రయోగించినాడు. ఇది కొంత అను శబ్దముపై సమయసూచకముగా చేర్చబడినదని స్పష్టము. సేపు అను దానికి స్వతంత్ర ప్రయోగ మెక్కడను లేదు. కనుక ఇది ప్రత్యయ మనుటలో విప్రతిపత్తిలేదు. కాని ఎందుచేతనో చిన్నయసూరి మొదలగు వారు దీనిని ప్రత్యయముగా తెలుపలేదు. అధర్వణ రచితముగా ప్రసిద్ధమైన త్రిలింగ శబ్దానుశాసనములో మాత్రము "ఎదుః ప్రస్తావికన్య స్యాత్ సేపుః కాలస్య సమ్మతః" అని 'సేపు' ప్రత్యయము పేర్కొనబడినది.

పగవారు అను నర్థములో 'పగఱు' శబ్దమును నన్నయ ప్రయోగించినాడు. ఈ 'ఱు' అనునది బహువచన ప్రత్యయముగా భావింపవలెను. పగ శబ్దమునకు విరోధి అను నర్థముకూడ కలదు. అందువలన ఈ బహువచన ప్రత్యయము చేరిన తరువాత పగ కలవారు అను నర్థమును బోధించినది. దీనికి ఏకవచనములో ప్రయోగము లేదు.

తెలుగులో పగులు ధాతువు వీలు, విడిపోవు అను నర్థములో ఉన్నది. దీనికి పూర్వరూపమని భావింపదగిన 'పగు' ధాతువు తమిళములో ఇదే అర్థములో ఉన్నది. ఆ ధాతువుమీద కర్త్రర్థములో అఱు ప్రత్యయము చేరిన పగఱు రూపమేర్పడును.

అప్పుడది కృదంతరూపమని చెప్పవలసియుండును. దీనివంటిదే చూపఱు అను మరొక శబ్దమును నన్నయ ప్రయోగించినాడు

చూపఱు, పగఱు శబ్దాలను నన్నయ ప్రయోగించినప్పటికీ చిన్నయసూరి మొదలగు లాక్షణికులు ఎవ్వరును కృత్తులలో కాని, తద్ధితములలో కాని ఈ శబ్దముల నిష్పత్తిని తెలుపకపోవుట వింతగా ఉన్నది.

డా బూదరాజు రాధాకృష్ణ శాసనభాషాపరిణామమును గూర్చి వ్రాయుచు "స్వార్థంలోనే 'ఱు' అనే అపదాంశమొకటి కనిపిస్తుంది" అని తెలిపి పొద-ఱు పొదఱు అని ఉదాహరించినారు 'కూతురు' శబ్దము కూడ ఇటువంటిదే కావచ్చునని అభిప్రాయపడినారు.[24] ఆ పక్షమున పగ శబ్దము పీద స్వార్థములో 'ఱు' ప్రత్యయముతో పగఱు (పగవారు) అను శబ్దమును సాధించవచ్చును.

ఈవిధముగా తెలుగు లాక్షణికులు ప్రతిపాదించిన తద్ధితప్రత్యయములలో 18టిని నన్నయ భారతములో వాడినాడు. వాటిలో చాలవరకు ఒకటి రెండు ప్రయోగములతో మాత్రము కన్పించుచున్నవి.

ఆంధ్రభాషానుశాసనము, ముక్తలక్షణకౌముది వంటి లక్షణగ్రంథాలలో మొత్తము ఏబదికి పైగా తద్ధితప్రత్యయములు చెప్పబడినను కేవలము 18 ప్రత్యయ ప్రయోగములను మాత్రము నన్నయ భాగములో చూడగలుగుచున్నాము.

మొత్తము మీద నన్నయ భారతములో తద్ధితప్రయోగములు చాలతక్కువగా ఉన్నవి. రెండున్నర పర్వములలో, సుమారు నాలుగువేల పద్యగద్యములలో కేవలము 20-25 తద్ధితప్రత్యయములకు మించి కాన్పించవు ఇంచు మించుగా 150 విధముల

24. తెలుగుభాషాచరిత్ర-పుట-62

కృత్ ప్రత్యయాంతరూపములను నన్నయ ప్రయోగించిన విషయమును గమనించి నప్పుడే రెండిటి మధ్య అంతరము స్పష్టము కాగలదు.

నన్నయ, తత్సమబహుళమైన భాషను గ్రహించి రచన సాగించినందున, తద్ధిత ప్రయోగము చాల తక్కువగా జరిగినది. దేశ్యపదముల నెక్కువగా స్వీకరించినచో వానిలో తద్ధితాంతరూపములధికముగా చోటు చేసుకొని యుండెడివి.

దేశీయములైన పదములను విరివిగా గ్రహించిన తిక్కన భాగములో తద్ధిత పదబాహుళ్యముండుటను తరువాతి ప్రకరణములో మనము గమనించగలము.

—o—

# చతుర్థ ప్రకరణము

## తిక్కన భారతములోని కృత్ ప్రత్యయములు

మొత్తము భారతములో పదునైదు పర్వములను తిక్కన రచించినాడు. నన్నయ రచనా భాగమునకు సుమారు నాలుగురెట్లు పద్య గద్యములు తిక్కన భాగములో కలవు.

తత్సమ భూయిష్ఠమైన నన్నయ శైలికి భిన్నముగా, తిక్కన తెలుగుదనము నెక్కువగా స్వీకరించి రచన సాగించినాడు. ఈయన రచనాభాగ మధికమగుటవలనను, తెలుగు పదముల నెక్కువగా వాడుటచేతను, ఈ భాగములో కృత్తద్ధిత ప్రత్యయముల ప్రయోగము లత్యధికముగా లభించుచున్నవి.

కృత్తుల, తద్ధితముల ప్రయోగ విషయములో ఎఱ్ఱనకు, తిక్కనతో సామ్య మెక్కువగా కన్పించును.

నన్నయలో కృదంతప్రయోగము లధికముగాను, తద్ధితము లత్యల్పముగాను కనువట్టగా, తిక్కన రచనలో తద్ధితప్రయోగములుకూడ అధికసంఖ్యలో లభించుచున్నవి.

తిక్కన భాగములో, కృత్ ప్రత్యయములు మొత్తము అరువది వరకు కనబడుచున్నవి. వానికి సంబంధించిన ప్రయోగములలో నన్నయ భాగములో లేని పదాలను మాత్రమే ఈ ప్రకరణములో విశ్లేషింతును. అటువంటి ప్రయోగములు మూడు వందల వరకున్నవి.

తిక్కన ప్రయోగించిన కృత్ ప్రత్యయములు :—

1. అ.
2. అక.
3. అట.
4. అద.
5. అడి.
6. అన.
7. అమి.
8. అర.
9. అరి.
10. అల.
11. అలి.
12. అవు.
13. అఱ.
14. ఇ.
15. ఇక.
16. ఇకి.
17. ఇడి
18. ఇఱ.
19. ఇద
20. ఇడి
21. (ఇ) మి.
22. ఇయ.
23. ఇలి.
24. ఇవ.
25. ఉ.
26. ఎ.
27. ఎన.
28. క.
29. కడ/గడ.
30. కని/కలి
31. కు.
32. కువ.
33. కోలు.
34. గర.
35. గి/వి
36. ట.
37. టు.
38. డు.
39. త.
40. తి.
41. తు.
42. దల
43. (అ)న
44. ప.
45. పి.
46. పు.
47. పుర.
48. బడి.
49. మ.
50. మర.
51. వ.
52. వడి.
53. వి.
54. వు.

వరుసగా ఈ ప్రత్యయ ప్రయోగములనుగూర్చి పర్యాలోకింతును.

1. అ.

'అ' ప్రత్యయాంత ప్రయోగములు తొమ్మిదింటిని తిక్కన ప్రయోగించినాడు. అవి—

1. కూటము.
2. చెక్క.
3. దాప
4. తగులము
5. తునియ
6. పాయ.
7. పొంకము.
8. వలియ
9. మట్టము

'కూటము' అనునది 'కూడు' ధాతువుపై 'ట' ప్రత్యయముచేరి, ధాతువు తుది వర్ణము లోపింపగా ఏర్పడినదని వ్యాకరణము చెప్పుచున్నది. 'ఓటము' కూడ ఇటువంటి శబ్దమే.

కాని నిజమునకు ఇది 'అ' ప్రత్యయాంతమని తులనాత్మకముగా పరిశీలించిన తెలియును.

మూలద్రావిడములో 'కూట్ట్' అను ధాతువు 'కూడు'నకు ప్రకృతిరూపము. తమిళమలయాళ భాషలలో 'కూట్టమ్' శబ్దము దీనినుండి జనించినది; కలయిక, గుంపువంటి అర్థములను తెలుపుచున్నది. 'కూట్టమ్' శబ్దము తెలుగులో గ్రహింపబడి, ఉకారమును చేర్చుకొని ద్విత్వము లోపించుటవలన 'కూటము' అను శబ్దము ఏర్పడెనని చెప్పదగును.

"అలుకఁడు మృగమదమున......................................................

......మణిదామకములు గట్టుడు పెద్దకూటమున."[1]

అను పద్యములో సభాభవనమనెడి యర్థములో తిక్కన ఈ పదమును వాడినాడు.

---

1. ఉద్యో.3_152

కపటము, అసత్యము మొదలగు అర్థములుగల సంస్కృతసమశబ్దము 'కూటము' దీనికంటె భిన్నము.

'చెక్క' శబ్దము 'చెక్కు' ధాతువుపై 'అ' ప్రత్యయము చేరగా నిష్పన్న మగును. చెక్కబడునది, ఖండింపబడునది అని వ్యుత్పత్త్యర్థము.

మూలద్రావిడములోని 'కెర్' ధాతువునకు కకారము అనుబంధముగాచేరి, తాలవ్యీకరణమువలన 'క' 'చ'గా మారి సమీకరణముతో రేఫకు కకారము రాగా 'చెక్క్' అను ధాతువేర్పడును. ఆ దశలో 'అ' ప్రత్యయముచేరి 'చెక్క' శబ్దము రూపొందినది.

సజాతీయ భాషలలో దీని రూపము లిట్లున్నవి-

కొలామీ — సెక్
నాయికీ — సెక్క్ | ఇవి ధాతువులు.
పర్జి — చెక్క్
తమి — చక్కై
కన్న — చక్కె, చెక్కె, సక్కె, సెక్కె | ఇవి నామములు.
(D E.D. 2266)

భాషాశాస్త్రరీత్యా దీనిని 'క' ప్రత్యయాంతమని చెప్పదగును.

దాఁప శబ్దము 'దాఁపు' ధాతువునుండి కలిగినది. ఈ ధాతువు 'దాఁగఁ జేయుట', ముందునకు సారించుట అను అర్థములను బోధించును. 'దాఁగు' ధాతువు ప్రేరణార్థక రూపములు 'దాపు', 'దాఁచు' అనునవి. వెడల్పుగా చేయబడినదను నర్థములో 'దాఁపు'పై 'అ' ప్రత్యయము చేర్పగా 'దాఁప' శబ్దము నిష్పన్నమైనది.

దీనికి కన్నడములో 'దాప', 'దాపె' శబ్దములు, తమిళములో 'దాప్పై' అను పదము సమానార్థకములుగా కనపడుచున్నవి.

మూలద్రావిడములో 'దా'/'దాయ్' అను ధాతువులుండగా వానిలో 'దా'రూపముపై ఫకార మనుబంధముగా చేరి దానికి పకారము రాగా 'దాఁపు' ధాతువు రూపొందినది.

'తగులము' అను రూపము 'తగులు' ధాతువుమీద 'అ' ప్రత్యయముచేరగా ఏర్పడినది. సంబంధము, ప్రేమ, ఆకర్షణము మొదలగునవి దీని కర్థములు.

మూలద్రావిడములోని 'తక్' అను ధాతువునకు 'ఉల్' అనుబంధముగా వచ్చి, 'తగుల్' అను రూపము కలుగగా దానిపై 'అ' ప్రత్యయము చేరినందున తగుల శబ్దము రూపొందినది. తరువాత మువర్ణకము రాగా 'తగులము' అయినది. కొందరు ఆధునికులు దీనిని 'అము' ప్రత్యయముగా విశ్లేషించిరి.

దీనికి కన్నడములో 'తగులు', 'తగిలు', 'తగలు' అని, తమిళములో 'తక్కై' అని, మాల్తోలో 'తకె' అని సజాతీయ రూపములు లభించుచున్నవి.

'తునియు' ధాతువుపై 'అ' ప్రత్యయమురాగా 'తునియ' శబ్దము జనించినది. తునియు + అ = తునియ' అని ఉకారసంధివలన రూపము సిద్ధించును.

'తునుము, తునుఁగు, తునియు' ధాతువులకు మూలద్రావిడ ప్రకృతి 'తుణ్' అనునది. దానిమీద 'ఇయ్' అనుబంధము చేరగా 'తునియ్' అనురూపము కలిగి దాని మీద అకారము ప్రత్యయముగా చేరుటవలన 'తునియ' శబ్దము నిష్పన్నమగును. మూల ద్రావిడ 'ణ'కారము తెలుగులో నకారముగా మారుచుండును.

దీనికి సజాతీయ భాషారూపము లిట్లున్నవి :–
తమి–తుణిప్పు, తుణిత్తు, (ధాతువులు)
తుణియల్, తుణుక్కు, తుణిక్కై (నామములు)
కన్న–తుణక, తుణకు, తుణుకు (నామములు)

'పాయ' అనగా భాగము. 'పాయు' ధాతువుపై 'అ' ప్రత్యయముచేరి అపదాది స్వరసంధివలన పాయశబ్దము నిష్పన్నమగును.

మూలద్రావిడములో 'పాయ్' అను ధాతువుపై అకారము చేరగా ఏర్పడిన రూపమే పాయ. ఏ అనుబంధము చేరకముందేర్పడిన రూపము కనుక దీనిని ప్రాథమిక కృదంత శబ్దముగా పేర్కొనవచ్చును.

తమిళములో 'పా', కన్నడములో 'పాయ్' అనుధాతురూపము లీయరములో కలవు

'పఱియ' శబ్దము శకటరేఫముతో తిక్కనభాగములో కన్పించుచున్నది. 'పరియు' అనుధాతువు మాత్రమే శబ్దరత్నాకర బ్రౌన్ నిఘంటువులలో కనబడుచున్నది. శకటరేఫముతో ఈ ధాతువు కన్పట్టదు. పఱియవాయు, పఱియవాపు, పఱిపోవు అను శబ్దపల్లవ రూపములు మాత్రము 'అ'తో లభించుచున్నవి. 'పఱియ' శబ్దము నామముగా నిఘంటువులలో చూపబడినది.

తమిళ మలయాళములలో 'పఱి' ధాతువు పెఱుకుట, ఊడదీయుట, చింపుట మొదలగు అర్థములను తెలుపుచున్నది. కన్నడములో గూడ ఈ ధాతువు కలదు.

అందువలన మూలద్రావిడములోని 'పత్' ధాతువునుండి 'పఱి, పరి' అను రెండు రూపము లేర్పడియుండును. తక్కినభాషలలో 'ఱ'తో కూడిన రూపములు నిలిచి యుండగా తెలుగులో అదిలోపించి 'పరియు' రూపము మాత్రము నిలిచియున్నదని తలపవచ్చును. 'పఱి' అను దశలోనే దానిపై 'అ'కారము ప్రత్యయముగా వచ్చి యకార మాగమమై పఱియ రూపమేర్పడినదని తేలుచున్నది. కొన్ని ద్రావిడ భాషలలో రెండు రేఫలతో కూడ రూపములున్నవి. T.V B.లో 'పరియు' రూపమొక్కటే చూపబడినది.[2]

'పొంకము' శబ్దము 'పొంగు' ధాతుజన్యమని సూర్యరాయాంధ్రనిఘంటువు పేర్కొన్నది. పొంగు + అ = పొంక. దానిపై మువర్ణము చేరగా 'పొంకము' నిష్పన్న మైనది. గకారమునకు కకారము వచ్చుట ఇందలి విశేషము.

కన్నడ, తమిళములలో 'పొంగు' ధాతువు 'కుయి, కువి'లలో 'పొంగ్' అను హలంత ధాతువు, అతిశయించు, ప్రవహించు, స్రవించు(?) మొదలగు అర్థములలో ఉన్నవి.

---

2, Telugu Verbal Bases p. 426.

మూల ద్రావిడములో 'పొంక్, పొక్క్' అను రెండు ధాతువులుండెడివి. వాటిలో 'పొంక్' ధాతువుపై అకారము ప్రత్యయముగా చేరి, మువర్ణకముతో 'పొంకము', రూపము కలిగినది.

తమిళములో 'పొంకిమ్', మలయాళములో 'పొక్కమ్', కన్నడములో 'పొంగ', కొడగులో 'బొంక' అను రూపములు దీనికి సమానార్థకాలు.

మట్టము' అనగా శిల్పసాధనము, కొలది, సమము అను నర్థములున్నవి. ఇది 'మట్టు' ధాతువుపై 'అ' ప్రత్యయము చేర్చుట వలన ఏర్పడిన రూపము. 'మట్టు' ధాతువునకు బాధించు, త్రొక్కు, నలిచేయు, కుదుర్చు మొదలగు నర్థములున్నవి. 'కుదుర్చు, నరి చేయు' అను నర్థములో మట్టు ధాతువు నుండి ఈ పదము కలిగినదని భావింపదగును.

దీనికి మూలద్రావిడ ధాతురూపము 'మట్' (T.V B.)[3], కన్నడములో 'మడు' తమిళములో 'మణ్టు' అను ధాతువు లీ యర్థములో కలవు.

2. అక.

దంపకము, వంటకము అను రెండు శబ్దములు అక ప్రత్యయముతో కన్పించు చున్నవి

'వండు' ధాతువుపై 'అక' ప్రత్యయము చేరగా 'వంటకము' అను రూపము కలుగును. ఈ శబ్దము వంట అను క్రియార్థమును, వండబడిన పదార్థమును గూడ బోధించుట తిక్కన రచనలో చూడగలము.

వ్యాకరణ పద్ధతిలో 'వండు + అక' అను చోట ఉకారసంధి వలన 'వండక' అని కావలసి యుండును. కాని దకారము టకారమగుటకు లక్షణ మేమియు లేదు.

మూలద్రావిడములో వన్, వల్ అను రెండు ధాతువులుండి యుండునని భద్రిరాజు కృష్ణమూర్తి తెలిపిరి.[4] 'వన్' అనుదానిపై 'ట'కారము అనుబంధముగా చేరగా దానిపై 'అక' ప్రత్యయము చేరినందున 'వంటక' అను ప్రాతిపదికము నిష్పన్నమగును.

---

3. T V.B. p. 451    4. Telugu Verbal Bases p. 485

క్రియారూపములైన వండుచున్నాడు మొదలగు చోట్ల, వండమి వంటి రూపాలలోను దకారము కనబడుచున్నది. పర్జి, గదబ భాషలలో క్రమముగా వెండ్, వంద్ అను ధాతువులు వండుట అను నర్థములో ఉన్నవి.

'దంపకము' అను శబ్దము 'దంచు' ధాతువుపై 'అక' ప్రత్యయము వచ్చి యేర్పడినది. 'దంచు'రూపాంతరము 'దంచు'ధాతువు. 'అక' ప్రత్యయము పరమైనప్పుడు చకారమునకు పకారమాదేశమగును, దంచు + అక > దంపు + అక > దంపక (ము) అని ప్రక్రియా క్రమము.

ఈ ధాతువునకు సమానార్థకములు తమిళాది భాషలలో అకారపూర్వకము గానున్నందున మూల ద్రావిడ ధాతువు 'అట్' అని దానిపై 'అన్-చ్' అనుబంధము లుగా చేరి, తెలుగులో వర్ణవ్యత్యయమువలన 'దంచు' ధాతువేర్పడినదని తులనాత్మక పరిశీలనవలన తెలియుచున్నది.

(తమి-అడు, మల-అడి. కొడగు-అడి) తెలుగులోకూడ అడచు, అడుపు, అటు అను స్థలములలో అకారము మొదట కనబడుచున్నది. అడచు, దంచు, దంగు ధాతువుల మూల ధాతువొక్కటే. చకారమునకు 'ప' ఆదేశమైనది.

8. అట :-

'ఇఱుకటము' అను శబ్దము 'ఇఱుకు' ధాతువుమీద 'అట' ప్రత్యయము చేరుటవలన ఏర్పడినది. 'ఇఱుకు' ధాతువుగాను, క్రియానామముగాను ప్రయోగము లలో నున్నది.

మూల ద్రావిడములో 'ఇల్' అను ధాతువుండి, దానిపై 'ఉక్క్' అను బంధము చేరగా, దంతమూలీయ స్పర్శము 'ఱ' కారమై 'ఇఱుక్క్' అను ధాతువుగా ఏర్పడి దానిపై మరల 'అట' ప్రత్యయము వచ్చి ఒక కకారము తొలగి 'ఇఱుకట' శబ్దము నిష్పన్నమైనది

ఈ శబ్దమును తిక్కన రెండుచోట్ల ప్రయోగించినాడు.[5]

5. వి-5-213/సౌ. 1-25

ఈ 'అట' ప్రత్యయమును బాలప్రౌఢ వ్యాకరణములుగాని, ఇతర లాక్షణికులుకాని కృత్తులలో పేర్కొనలేదు. ముక్తలక్షణకౌముదిలో మాత్రము తద్ధితములలో 'అట' ప్రత్యయము చెప్పి త్రిప్పట అను లక్ష్యము చూపబడినది.

'ఇఱుకు' అను నామ శబ్దముకూడ కలదు దానిపై భావార్థములో 'అట' ప్రత్యయము చేరగా, 'ఇఱుకటము' రూపమేర్పడును. అప్పుడు దీనిని తద్ధితాంతముగా పేర్కొనవలసియుండును.

కాని 'పాపట' శబ్దములో 'అట' ప్రత్యయము కృత్తుగా కనబడుచున్నది. పాయుధాతువు ప్రేరణార్థక రూపము 'పాపు'-దానిపై 'అట' ప్రత్యయమురాగా 'పాపట' శబ్దము నిష్పన్నమగును. శిరోజములను రెండువైపుల భాగములుగా విడదీయునది, అను వ్యుత్పత్తితో పాపట శబ్దము అన్వర్థము. తిక్కన దీనినికూడ ప్రయోగించినాడు.

"పవడంపు జొత్తులఁ జెవులరూపడగంగఁ
బాపట తలకట్టు భంగితప్ప"[6] అని తిక్కన ప్రయోగము.

'పాపు' అను నామము లేనందున ఈ 'అట' ప్రత్యయమును కృత్తుగా అంగీకరింపక తప్పదు.

4. అద :-

కేరడములు, దాపడము అను రెండు శబ్దము లీ ప్రత్యయాంతములు లభించుచున్నవి. కేరడమునకు కోలాహలములనియు, దాపడమునకు జాసత మనియు పాఠ భేదములు కనపడుచున్నవి.

'కేరడము' అనగా వక్రోక్తి, పరిహాసము. 'కేరు' ధాతువుపై 'అద' చేరి ఈ శబ్దము కలిగినది. కేరు ధాతువు-వెలరేగు, ఉత్సాహపడు, ఎగతాళిచేయు' నిందించు అను క్రియలకు బోధకము.

"దాపునోపులు చచ్చునొచ్చులగు"[7] అను సూత్రమునననుసరించి ('చచ్చు' ధాతువుపై 'అద' ప్రత్యయమురాగా) ప్రకృతికి 'దాపు' ఆదేశమై 'దాపడము' రూపమేర్పడును. చచ్చు + అద > దాపు + అద > దాపడ(ము)

6. విరా 1-328.

7. బాల-క్రియా 92.

"నావుడు నవ్వులాటకనినం బవనాత్మజ యింతయేటికిం
గేవలయోధవేపరుల కిల్బిషముల్ తలపోయకి మ్మెయిన్
జావదమైన(జూచి"—అను పద్యములో 'దావదము, జావదము' అని రెండు

విధముల విరదీయుట కవకాశమున్నది. సూ. రా. నిఘంటువుపై ప్రయోగమును జావ దముగా చూపి పిఱికితనమను నర్థమును తెలిపినది. బాలసరస్వతీ బుక్‌డిపోవారి భార తము 'జావదము' అని పాఠమునే చూపుచున్నది, 'జావదము' శబ్దములో మూలధాతు వేదో తెలియకుండా ఉన్నది.

పై రెండు ప్రయోగాంలో పాఠభేదమున్నప్పటికి తిక్కన 'అద' ప్రత్యయ రూపములను వాడినాడని మాత్రము నిశ్చయముగా చెప్పగలము.

౬. అడి.

'అదలడి' శబ్దమొక్కటి తిక్కన రచనలో 'అడి' ప్రత్యయాంతము కలదు. దీనికి అలజడి, దుఃఖము అను నర్థములున్నవి.

'అదలు' ధాతువు-శోకించుట, కుందుట, భయపడుట, చలించుట మొదలగు నర్థముల బోధించుచున్నది. దానిపై భావార్థములో 'అడి' ప్రత్యయముచేరగా 'అదలు + అడి > అదలడి' రూపము కలుగును. కాని కృత్తులలో 'అడి' ప్రత్యయమును లాక్షణి కులు ఎవ్వరును చెప్పలేదు. కృదంతముగా నిర్ధారకమగు 'అడి' ప్రత్యయాంతరూపము మరొకటి లేదు.

'అదలు 'నామముగా కూడ కలదు. దానిపై స్వార్థములో 'అడి'ని చెప్పిన 'అదలడి' రూపమును తద్ధితాంతముగా సాధింపవచ్చును. వెల్లడి మొదలగునవి ఈ రక మైనవి ప్రసిద్ధములు కలవు.

అందువలన 'అలజడి' శబ్దము కృదంతమనుటకన్న తద్ధితాంతమనుట సమంజసము.

---

8. ఉద్యో-3.61

మూలద్రావిడములోని 'అద్' ధాతువుపై 'అలు' అనుబంధముగాచేరి 'అదలు' ధాతువు తెలుగులో రూపొందినది.

6. అన.

'మన్నన, గదన' అను రెండు శబ్దములను తిక్కన ప్రయోగించినాడు. ఇవి 'అన' ప్రత్యయాంతములుగా కనబడుచున్నవి. సంస్కృత 'మాననా', 'గణనా' శబ్దముల నుండి ఇవి జనించినవని నిఘంటుకారులు, వ్యాకరణకర్తలు తెలిపినారు. D E.D.లో ఈ పదముల ఆరోపములు లేకుండుట, T.V.B.లో 'మన్నించు, గదించు' అను ధాతువులను చూపకపోవుట ఇవి సంస్కృత జన్యములనే అంశమును బలపరచుచున్నవి.

అయినను 'దీవించు' నుండి 'దీవన' కల్గినట్లు మన్నించు, గదించు అను తత్సమక్రియలపై 'అన' ప్రత్యయముచేరగా 'మన్నన, గదన' శబ్దములేర్పడెనని చెప్పుటలో బాధకము లేదు.

7. అమి.

ఒంటమి, కామి, రామి అను మూడు శబ్దములు వ్యతిరేకార్థకమైన 'అమి ప్రత్యయాంతములుగా ఈ భాగములో కనబడుచున్నవి.

'ఒంటు' ధాతువునకు అనుకూలించుట, సరిపడుట, గిట్టుట అని సూ. రా. నిఘంటువులో అర్థములు తెలుపబడినవి. 'ఒంటమి' అనగా వైరము, సరిపడకపోవుట.

''ఒంటమిని లేని యొంటర
మింటరములు పలుకు టుచితమే[9] -అని తిక్కన ప్రయోగము.

'ఒంటు' ధాతువునకు మూలద్రావిడములోని ప్రకృతిరూపము 'ఒణ్' అనునది. దానిపై 'త్' అనుబంధముగాచేరి అది 'ట'గా మారగా, 'ఒంట్' అను ధాతువేర్పడినది. ఆ దశలోనే 'అమి' ప్రత్యయము చేరుటవలన 'ఒంటమి' అను రూపము కలిగెనని చెప్పవచ్చును.

---

9. ఉద్యో. 4-237.

| | | |
|---|---|---|
| కన్నడము | — | ఒట్టు |
| తమిళము | — | ఒన్ను |

అను ధాతువు లీ యర్థములో కనిపించుచున్నవి.

'కామి, రామి' అను నవి 'అగు, వచ్చు' ధాతువుల వ్యతిరేక భావార్థక రూపములు. అగు, వచ్చు లకు కా, రా, అను నాదేశములను బాలవ్యాకరణము తెల్పి నది.[10] వానిమీద వ్యతిరేకార్థములో 'అమి' చేరగా అపదాది స్వరసంధివలన పై రూప ములు సిద్ధించుచున్నవి.

8. అర :—

ఆధునిక లాక్షణికులు కృత్తులలో 'అర' ప్రత్యయమును పేర్కొన్నారు. 'దెప్పరము' అర ప్రత్యయాంతమని వారుదాహరించిరి. 'దుర్భర' శబ్దభవ మని నిఘంటుకారులు తెలిపిరి.

'కావర' శబ్దము అర ప్రత్యయాంత మనదగును. కన్నడములో 'కావర' శబ్దము కలదు. దానికి కోపము, మోహము, మనస్తాపము-అను నర్థములున్నవి. (D. E. D. 1215) తిక్కన గర్వమను నర్థములో 'కావర' శబ్దమును ప్రయోగించి నాడు (ఉద్యో 8-28). ఈ రెండు భాషలలోని కావర శబ్దములు ఒకే ధాతువునుండి జనించినవని తలపవచ్చును.

9. అరి :—

కృత్తులలో 'అరి' ప్రత్యయమును పూర్వ లాక్షణికులు చెప్పలేదు. వ్యావ హారిక భాషా వ్యాకరణములో 'అరి' చెప్పబడినది కాని 'కాచు, చూచు, దాచు లకు మాత్రమే విధింపబడినది.[11]

తిక్కన 'ప్రేలరి' శబ్దములు ప్రయోగించినాడు. 'ప్రేలు' అనునది ధాతు రూపములోనేకాని, నామముగా లేనందున ఇది కృదంతమని చెప్పకతప్పదు.

"ఈ దుర్మార్గుండు కర్జం బెఱుంగక నీతి బాహ్యుండై వలసినట్లు ప్రేలరి మాటలాడుచుండు"[12] -అని తిక్కన ప్రయోగము.

10. బాల. క్రియా. 31

11. వ్యా. భా. వ్యా. కృత్-22.

12. ఉద్యో. 2-168.

కావున 'అరి' ప్రత్యయమును కృత్తులలోఁగూడ అంగీకరింపవలసియున్నది.

10. అలి.

'కావలి', 'తొంగలి' శబ్దములు 'అలి' ప్రత్యయాంతములుగా కనఁబడు చున్నవి. కాచు, పీచులకు 'వలి' ప్రత్యయమును ప్రౌఢవ్యాకరణము తెలిపినది. కాని 'తిరుగలి' మొదలగువాని నిష్పాదనమునకు 'అలి' ప్రత్యయమును చెప్పుట అవశ్యకము. దానితోనే 'కావలి' శబ్దమును సాధించిన లాఘవము కలుగునని రెండవ ప్రకరణములో సూచించినాను. కావున 'కాచు' ధాతువుపై 'అలి' ప్రత్యయము, చకారమునకు వకారా దేశముతో 'కావలి' రూపము సిద్ధించునని చెప్పుట సముచితము.

మూలద్రావిడధాతువు 'కా'. దానిమీద 'అలి' చేరి వకార మాగమముగా వచ్చిన దని తులనాత్మక విశ్లేషణమువలన తెలియును.

'తొంగలి' శబ్దము 'తొంగు' ధాతుజన్యము. 'తొంగు' ధాతువునకు వంగుట వాలుట, తొలఁగుట అనునవి యర్థములు. దానిమీద 'అలి' చేరగా 'తొంగలి' శబ్దము రూపొందును. 'వాలునది' అని దాని కర్థము.

> 'ధవలాక్షి తొంగలి' తఱచు ఱెప్పలచెన్ను
> కప్పను వీకటి గవియుదేర'[13]

అను తిక్కన ప్రయోగములో 'తొంగలి' శబ్దమునకు 'వాలియున్న'దను నర్థమును చెప్ప దగును.

'తొఙ్ఙ్' అను మూలద్రావిడ ధాతువుపై ఉకార మనుబంధముగా చేరి 'తొంగు' ధాతు వేర్పడినది.

కన్నడములో తొంకు, తొంగు ధాతువులు, తమిళములో 'తొంకు', మల యాళములో 'తోంకుక' ధాతువులు దీనికి సమానార్థకములుగా నున్నవి.

---

13. విరా. 2-57

11. అవు :—

ఈ క్రింది శబ్దములు 'అవు' ప్రత్యయాంతములుగా కనబడుచున్నవి :—

1. ఉఱవు　　　5. తొరవు
2. ఎగవు　　　6. నెరవు
3. ఎరవు　　　7. నెలవు
4. కెరవు　　　8. వెఱవు

'ఉఱు' ధాతువుమీద 'అవు' ప్రత్యయము చేరుటవలన 'ఉఱవు' శబ్దమేర్పడును

'ఉఱు' ధాతువునకు కలుగుట, పైకివచ్చుట, తగుట' ఇష్టమగుట, ఒప్పుట -అర్థములు.

'ఉఱవు' అనగా యుక్తము, అధికము, విశాలము, ఔచిత్యము అను నర్థము లున్నవి.

"ఇ తెలుఁగు నూడ నీకు నుఱవగాదె"[14] అను ప్రయోగములో 'ఉచిత'మను నర్థము వాచ్యమగుచున్నది.

కన్నడ, తమిళములలో 'ఉఱు' ధాతువు, మలయాళములో 'ఉఱుక'ధాతువు ఈ యర్థములో కనఁబడుచున్నవి.

'ఎగవు' శబ్దము 'ఎగయు' ధాతుజన్యమని సూ.రా. నిఘంటువు పేర్కొన్నది. దీనికి 'నెగవు' అను రూపాంతరమును గూడ చూపినది. కాని 'ఎగయు'పై 'అవు' ప్రత్యయము వచ్చినచో 'యు' లోపించుట కవకాశము లేదు.

'ఎగచు'నకు మూలమైన 'ఎగు'ధాతువొకటి కలదు. ఇది సూ.రా. నిఘంటువులో, Telugu Verbal Bases లోను చూపబడినది. దీనికి సమాపక క్రియారూవములు మాత్రము ప్రయోగములలో లేవనికూడ అవి తెల్పినవి. ఎగుడు, ఎగువ, ఎగుదల, ఎగుమతి మొదలగు అనేక పదములలో పూర్వ భాగముగా ఇది నిలిచియున్నది. దీనిపై 'చు' అనుబంధముగాచేరి 'ఎగుచు' ధాతువు రూపొందినది.

---

14 ఉద్యో 3-380

'ఎగు' రూపములో నున్నధాతువుపై 'అవు' ప్రత్యయము వచ్చి 'ఎగవు' రూపము కలిగినదని చెప్పుట సముచితము. 'పైకెగురుట' అని ఈ శబ్దమున కర్థము.

"నిలువలేక కూప్పుందఁబడి నూతు
నరిద మెగపు తొలఁగ సనియెనంధప."[16] అని తిక్కన ప్రయోగము.

మూలద్రావిడములోని 'ఎయ్' ధాతువుపై 'గు' అనుబంధముగా చేరి 'ఎగు' ధాతువేర్పడెనని తెలియు చున్నది.

'ఎరవు' శబ్దములో 'అవు' ప్రత్యయము కనబడుచున్నది. కాని ధాతువు మాత్రము తెలుగు వ్యవహారములో లేదు.

తమిళములో 'ఇర' ధాతువు యాచించుట అను క్రియను, 'ఇరవు' శబ్దము యాచించుటను, కన్నడములో 'ఎరె' ధాతువు, 'ఎరవు', 'ఎరపు' నామశబ్దములు. 'తుళు'లో ఎరవు శబ్దము, 'ఎరవు' శబ్దమునకు తుల్యార్థకములుగా కనిపించుచున్నవి

అందువలన 'ఎరవు' శబ్దము కన్నడము నుండి ఆదానముగా తెలుగులో చేరినదని కాని, 'ఇర్/ఎర్' అను మూలదశలోని ధాతువు మీద 'అవు' ప్రత్యయము చేరుట వలన తెలుగులో 'ఎరవు' శబ్దము జనించినదని కాని చెప్పవచ్చును. 'తుళు'లో కూడ 'ఎరవు' శబ్దము కన్పించుట గమనింపదగినది.

'కెకవు' అనగా పతనము, ప్రక్కకు పడినది అని యర్థము. 'కెదయు' ధాతువునుండి ఈ శబ్దము జనించినదని, సూ.రా. నిఘంటువు చూపినది. దాని ప్రకారము ఇది 'వు' ప్రత్యయాంతమని చెప్పవలసి యుండును. ఉలియాందులలో దీనిని చేర్చు కొనదగును.

కాని తులనాత్మక పరిశీలన వలన దీనిని 'అవు' ప్రత్యయాంతమనుట సమంజసమని తేలును. మూలద్రావిడములో 'కిట్' లేక 'కెట్' దీనికి మూలధాతువని

---

16. కర్ణ- 2.281.

భద్రిరాజు కృష్ణమూర్తి తెలిపినారు. 'కెట్' అను రూపము మీద 'అవు' చేరి 'ట'కారము 'ద' కారముగా మారుట వలన 'కెదవు' రూపము కలిగి యుండును.

సోదరభాషలలో రూపము లీ విధముగా ఉన్నవి-

| | |
|---|---|
| కన్న-కెడె, కెడవు<br>తుళు-కెడగుని<br>తమి-కిట<br>మల-కిటక్క | ఇవి అన్నియు ధాతురూపములు. |

'చెడు' శబ్దము తాలవ్యీకరణము చెందిన యీ ధాతురూపమే.

'తొడగు' ధాతువుపై 'వు' ప్రత్యయము చేరి 'తొడవు' శబ్దమేర్పడును. 'తొడు' ధాతువు సూ.రా. నిఘంటువులోను ఇతర నిఘంటువులలోను పేర్కొనబడినది. దీని క్రియారూపములు నన్నయాదుల ప్రయోగములందున్నవి. నగలు, కవచము మొదలగునవి ధరించుట దీని కర్థము.

తిక్కన 'తొడవు' శబ్దము నాభరణార్థములో ప్రయోగించినాడు. (భీష్మ. 8-162)

కన్నడములో తుడు, తొడుధాతువులు, తమిళములో 'తొటు' ధాతువు దీనికి తుల్యార్థకములు.

మూలద్రావిడ ధాతువు 'తొట్' అనునది.

'ఎలనము' శబ్దమును తిక్కన ప్రయోగించినాడు. దీనిలోనిది 'అన' ప్రత్యయముగా తోచు చున్నది. 'ఎలయు' ధాతువు మీద 'అన' చేరగా 'ఎలన' శబ్దము జనించి యుండును. 'ఎలన' మనగా ఉత్సాహము, చెలిమి అని యర్థము లున్నవి. ఈ శబ్దమును సూ.రా. నిఘంటువు చూపలేదు.

12. ఇ:-

'ఇ' ప్రత్యయాంతరూపములు 9 తిక్కన ప్రయోగించినవి కలవు.-

అవి :- 1. ఎదిరి
2. కుయ్యి, కూయి
3. గంటి
4. చింపి
5. చెయి
6. తడి
7. తిండి
8. త్రిమ్మరి
9. ముడి

'ఎదిరి' శబ్దము 'ఎదురు' ధాతువుపై 'ఇ' ప్రత్యయము చేరగా నేర్పడినది. దీనికి ఇతరుడు, విరోధి అను నర్థములున్నవి. ఈ రెండర్థములలోను తిక్కన ప్రయోగములున్నవి.

'ఎదిరికి హితమును బ్రియమును'[16] అనుచోట ఇతరుడను నర్థము. "పమ్మెఱుఁగు వెదిరి నెఱుఁగుదు నెమ్మి యెఱుఁగు దర్పనిద్ది"[17] అను పద్యములలో శత్రువను నర్థము బోధింపబడుచున్నవి.

'ఇ' ప్రత్యయము వచ్చిన తరువాత ఇకార సాహచర్యమువలన పూర్వపు ఉకారము ఇకారముగా మారినది. దీనిని సమస్వరత అని పేర్కొందురు.

తమిళములో 'ఎతిర్' 'ఎతిరి' అను శబ్దములు కన్నడములో ఎదురు, ఎదిర్, ఎదర్ అనునవి నామవాచకములుగా కన్పట్టుచున్నవి.

మూలద్రావిడ ధాతువు 'ఎత్' పై 'ఇర్' అనుబంధము చేరగా నేర్పడిన 'ఎదిర్' రూపముపై 'ఇ' ప్రత్యయము చేరగా 'ఎదిరి' శబ్దము నిష్పన్నమైనదని తులనాత్మక పరిశీలనవలన తెలియుచున్నది.

'కుయ్యి కూయి' శబ్దములు రెండును 'కూయు' ధాతువుపై 'ఇ' ప్రత్యయము చేరగా ఏర్పడినవి. అఱవు, ఆర్తధ్వని, భయవార్త, రక్షకము మొదలగునవి వీని కర్థములు.

---

16 ఉద్యో 2.59. 17 ఉద్యో 3.34.

'కూయ + ఇ'> కూయి కాగా, తొలియచ్చు హ్రస్వమై యకారము ద్విత్వము నొందిన రూపము 'కుయ్యి' అనునది కూడ జనించినది. 'కుయి' అను ద్విత్వరహిత రూపము నిఘంటువులలో కలదు కాని తిక్కన ప్రయోగించలేదు.

మూల ద్రావిడములో కూ।కూయ్ కూక్ అని మూలధాతువులుండి యుండు నని భద్రిరాజు కృష్ణమూర్తి తెలిపినారు. 'కూయ్' రూపముపై 'ఇ' చేరగా పైరూపము లేర్పడుట స్పష్టము.

కన్నడములో — కూగు, కూకు
తమిళ మళయాళములలో — కూ
కొలామీలో — కుయ్
పర్జిలో — కూయ్.

అని ధాతురూపములు కనబడుచున్నవి. తిక్కన కుయ్యి, కూయి రెండు రూపములు ప్రయోగించినాడు.

'గంటి' శబ్దము 'గంటు' ధాతువునుండి పుట్టినది. ఆ ధాతువునకు గాయ పరచుట అర్థము. 'గంటి' అనగా గాయము, రంధ్రము అను నర్థములు కలవు. తిక్కన గాయమనెడి యర్థములో దీనిని ప్రయోగించినాడు.

తుళు, కన్నడములలో కట్టి, గట్టి అను నామవాచకములు, మలయాళములో 'కట్టి' శబ్దము దీనికి సమానార్థకములుగా నున్నవి.

దీనికి మూల ద్రావిడ ప్రకృతి 'కట్-ల్' అనునది.

చింపు ధాతువుపై 'ఇ' ప్రత్యయము చేరగా 'చింపి' శబ్దమేర్పడినది. దీనికి చినిగినబట్ట, చిఱుగు, చిరిగినది అని యర్థములున్నవి.

"సారథిని రథ్య వ్రాతముం గూల్చి యే, పున బాంచాలతనూజ వెల్గొడుగు నొంపుం జింపిగావించి"[18] అని తిక్కన ఈ శబ్దమును 'చిరిగినది' అనునర్థములో ప్రయోగించినాడు.

---

18. ద్రోణ. 5.180

'చిరుగు' ధాతువు ప్రేరణార్థకరూపము "చింపు".

చేయి, చెయ్యి అనువాని రూపాంతరము 'చెయి' శబ్దము. 'చేయి' శబ్దమును గూర్చి నన్నయ భాగములో ప్రస్తావించితిని. 'చెయి' అను హ్రస్వయుత రూపమును తిక్కన విశేషముగా వాడినాడు.

"ధృతిం, బూని సదచు నెవ్వఁడు డెం
దానం జెయి పెట్టుకొని యతడు నిద్రించున్"[19] అనునది ప్రయోగము.

'తడి' శబ్దము 'తడియు' ధాతు జన్యమని సూ.రా. నిఘంటువు. వ్యాకరణము ననుసరించి క, గ, త, ప, వ, ఇమి అనునవి పరమైనప్పుడు మాత్రము 'యు' లోపించును. కావి ఇక్కడ 'ఇ' పరమైనందున లోపమున కవకాశము లెదు.

కాని సజాతీయ భాషారూపముల పరిశీలనవలన మూల ద్రావిడ ప్రకృతి 'తడ్' అని తెలియుచున్నది. దానిమీద 'ఇ' ప్రత్యయముచేరి 'ట' దత్వమును బొందగా 'తడి' రూపము నిష్పన్నమగును.

ఇతర ద్రావిడభాషల రూపములు :-

| కన్న | — | తడి, చళ |
|---|---|---|
| తమి | — | తణ్, తళ, చళ |
| పర్జి | — | తల్ల |

చకారాది రూపముతో 'చళ్/చణ్' అను ధాతువులుకూడ మూల ద్రావిడములో ఉండెనని భద్రిరాజు కృష్ణమూర్తి తెలిపిరి.[20]

"తడిపదములు, గలుగ నిదురకుఁ జొరమి
సత్కర్మవేది నారదుఁడు వివరించె నాచారములుగ"[21] అని ఆర్ద్రమను నర్థములో తిక్కన యీ శబ్దమును ప్రయోగించినాడు.

'తిండి' అనునది 'తిను' ధాతు జన్యముగా నిఘంటువులు పేర్కొన్నవి. 'తిను + ఇ' 'తిని' అని కాదగున. కాని 'తిండి' అగుట కవకాశము లేదు. 'తిను'

---

19. ఉద్యో 8.19.
20. T. V. B. Page 375
21. శాంతి 4.117.

పై 'డి' ప్రత్యయము వచ్చిన తిండి రూపమేర్పడును. కాని లాక్షణికు లెవ్వరును అటు వంటి ప్రత్యయమును పేర్కొనలేదు.

తులనాత్మకముగా చూచినప్పుడు 'తిన్' అను మూల ద్రావిడ ధాతువుపై 'త్' అనుబంధముగాచేరి యేర్పడిన 'తిన్ద్' ధాతువునుండి 'తిండి' శబ్దము రూపొందెనని చెప్పవచ్చును.

నకారము మీది దంతమూలీయ స్పర్శము 'ఱ' గా మారి, తరువాత 'ద' కారముగా మారును.

కన్నడములో, గోండీలో, కురుఖ్‌లో 'తింద్' అను ధాతురూపము కన్పించుట గమనార్హము.

అందువలన 'తిన్ద్' అను ధాతువు 'తింద్' రూపమును పొందినదశలో దానిపై 'ఇ' చేరి 'తిండి' శబ్దమేర్పడెనని తలపదగును.

"తరుణులు నస్వతంత్రతఁ జేయునర్థుల
కొసగి తిండియు ధనగుప్తి మీది భరము"[22]
అని తిక్కన ఒక్కచోటనే యీ శబ్దమును ప్రయోగించినాడు.

'త్రిమ్మరు' ధాతువు మీద 'ఇ' ప్రత్యయము చేరగా 'త్రిమ్మరి' శబ్దమేర్ప డినది. ఎక్కువగా తిరుగువాడు, తిరుగుబోతు అని దీని కర్థములు.

"అలుపిద్దలేని యట్టి త్రిమ్మరియగు
కొయ్యగాక కూడు కుడుటఁబెట్టి"[23] — అని తిక్కన యీ శబ్దమును తిరుగు బోతను నర్థములో ప్రయోగించినాడు.

తిరుగు, త్రిప్పు ధాతువులకు మూలమైన 'తిర్' అను మూలద్రావిడ ధాతువు నకు 'మర్' అనుబంధముగా చేరి, వర్ణవ్యత్యయము వలన రేఫ ముందుకు వచ్చి త్రిమ్మరు ధాతువేర్పడునని Telugu Verbal Bases సూచించినది.

---

22. శాంతి 6.200. 23. ఉద్యో 2.9.

ఈ ధాతువు నుండి పుట్టిన 'ద్రిమ్మటకాఁడు', శబ్దము నగూడ తిక్కన ప్రయోగించినాడు.

'ముడి' శబ్దము 'ముడుఁచు', ధాతుజన్యముగా నిఘంటువులు పేర్కొన్నవి. ముడుపబడునదని దాని వ్యుత్పత్త్యర్థము. ముడుఁగు ధాతువు ప్రేరణార్థక రూపము 'ముడుఁచు' అనునది 'ముడుచు' అని బిందురహితరూపము కూడ కలదు.

ఇక్కడ కూడ 'ముడుచు + ఇ' అనుచోట 'చు' లోపించెనని చెప్పిన 'ముడి' రూపము వ్యాకరణానుసారము ఏర్పడదు. 'ఇ' పరమైనప్పుడు ధాత్వంత్యవర్ణ లోపము బాలవ్యాకరణము తెలుపలేదు.

| | |
|---|---|
| కన్నడ—ముడి<br>తమి—ముటి<br>మల—ముటిక్క | ధాతురూపములు. |
| కన్నడ—ముడు<br>తమి—ముటి<br>మల—ముటి<br>తుళు—ముడి | నామరూపములు. |

అను సజాతీయ భాషారూపములను పోల్చి చూడగా 'ముట్' అనునది మూల ద్రావిడ ధాతురూపముగా తెలియుచున్నది. దానిపై 'ఇ' ప్రత్యయముగా చేరి 'ముడి' శబ్దము నిష్పన్నమైనదని స్పష్టమగు చున్నది.

"మూట" శబ్దము కూడ ఈ ధాతువు నుండి జనించిన రూపమే.

"పువ్వులు బహువిధంబులఁగట్టి ముడి కొక్క
ళంగిగా నెత్తులు వట్టియిత్తు."[24]

అను పద్యములో తిక్కన 'కొప్పు' అను నర్థములో ముడి శబ్దమును ప్రయోగించినాడు.

---

24. విరా. 1.107

గ్రంధి, కలహము. ఎద్దు మూవురము మొదలగునవి కూడ ముడి శబ్దార్థములున్నవి.

13. ఇక:-

ఈ క్రింది పదములలో 'ఇక' ప్రత్యయము కనబడుచున్నది.

1. ఎనయిక
2. ఓపిక
3. కోరిక
4. నమ్మిక
5. పూనిక
6. పోలిక
7. మచ్చిక

'ఎనయు' ధాతువుమీద 'ఇక' ప్రత్యయముచేరి 'ఎనయిక' రూపమేర్పడినది. ఈ శబ్దమునకు పొందిక, పోలిక అనునవి అర్థములు. "పొందిక" అనెడి యర్థములో తిక్కన ప్రయోగించినాడు (అను.4.184).

'ఏణ్' అను మూలద్రావిడ ధాతువుమీద 'అయ్' అనుబంధముగా చేరగా తొలియచ్చు హ్రస్వము నొంది, 'ఎనయు' ధాతువు తెలుగులో రూపొందనది.

'సాటి' అను నర్థమును బోధించు 'ఎన' శబ్దము కూడ ఈ ధాతుజన్య రూపమే.

'ఓపిక' శబ్దము 'ఓవు' ధాతువుమీద 'ఇక' ప్రత్యయము చేరగా నిష్పన్నమైనది. దీనికి తాలిమి, సామర్థ్యము అనునవి యర్థములు.

'ఓపిక' శబ్దమును తిక్కన ఒక్కచోటనే ప్రయోగించినాడు.

"భిక్షయోపిక[25] గల్గి పెట్టుచు వర్తింతు" అను నీ పద్యములో "భిక్షలెక్కుడీయనపెట్టుచు" అను పాఠాంతరము కొన్ని ప్రతులలో చూపబడినది.

'కోరు' ధాతువుపై 'ఇక' ప్రత్యయము చేరగా 'కోరిక' శబ్దమేర్పడినది. కోరిక, కోర్కి, అను రూపాంతరములు దీనికి కన్పించుచున్నవి. నన్నయ 'కోర్కి'రూపమునప్రయోగించి యున్నాడు.

---

25. అను. 4.358.

తిక్కన 'కోరిక' శబ్దమును చాలచోట్ల ప్రయోగించినాడు.

కన్నడ—కోఱు

తుళు—కోరుని

తమి—కోరు

మల—కోఱుక—అను విధముగా సమానార్థక ధాతురూపము లా యా భాష లలో కనిపించుచున్నవి. (D.E D 1848)

మూ. ద. ద్రా.లో దీనికి ధాతువు 'కోర్'[26] కోరిక, కోర్కి శబ్దములను గూడ తిక్కన బహుళముగా ప్రయోగించినాడు. వాటిని (ఇ)కి ప్రత్యయాంతములుగా పరిగణింప వలసియుండును.

'నమ్ము' ధాతువునుండి 'నమ్మిక', 'నమ్మిగ' అను రెండు రూపములు కలిగి నవి. తిక్కన యీ రెండింటిని వాడినాడు.

"తగుమాట లాంబికేయుం దగునని............ న

మ్మిగఁ జూచుచునుండు"[27] అని ప్రాసస్థానమున గకారయుక్త రూపము లభించుచున్నది.

కన్నడములో నమ్బు, తుళులో నప్పుని, తమిళములో నమ్పు అను రీతిగా సమానార్థక ధాతు రూపములు లభించుచున్నవి.

అందువలన మూల ద్రావిడ ధాతురూపము 'నయ్-మ్బు' కాదగునని భద్రి రాజువారు తెలిపినారు,

'నయ్'లో యకారము లోపించి, సమీకరణమువలన పకారము మత్వమును పొందగా తెలుగులో 'నమ్ము' ధాతువు రూపొందెనని చెప్పనగును.

కన్నడములో 'నమ్బికె', 'నమ్బిగె', 'నమ్బుగె' అను నామశబ్దములున్నట్లు D. E. D లో చూపబడినవి. నమ్మిక(గ) శబ్దముతో వానికిగల సామ్యము స్పష్టముగా తెలియుచున్నది.

---

26. T. V. B. P. 339  27. ఉద్యో. 1-315

'పూను' ధాతువునుండి పూనిక శబ్దము, 'పోలు' ధాతువునుండి 'పోలిక' శబ్దము 'ఇక' ప్రత్యయాంతములుగా నిష్పన్నములయినవి.

'పూనిక' అనగా ఉద్యమము, పట్టుదల, విధము, ఒడంబడిక మొదలగు అర్థములున్నవి.

'పోలిక' శబ్దమునకు సామ్యము, సదృశము-అర్థములు.

ఈ రెండు శబ్దములను తిక్కన అధికముగానే ప్రయోగించినాడు.

'పూను' ధాతువు మూల ద్రావిడ ప్రకృతి "పూణ్" అనియు, 'పోలు' ధాతువునకు మూ.ద.ద్రా ప్రకృతి 'పోల్' అనియు T. V. B. వలన తెలియుచున్నది. ఈ శబ్దములకుగూడ పూనికి, పూన్కి, పోలికి, పోల్కి అను రూపాంతరములున్నవి. తిక్కన వాటిని ప్రయోగించినాడు.

'మచ్చిక' శబ్దము 'మచ్చు' ధాతు జన్యముగా చెప్పదగును. మచ్చు ధాతువునకు ఆకర్షించుట, చనువుచేయుట- మరుగుట మొదలగు అర్థములు కలవు. మూ. ద్రా. లోని 'మర్' అను ధాతువునకు చకారము అనుబంధముగావచ్చి హల్పూర్వకరణమువలన రేఫము చకారముకాగా 'మచ్' ధాతు వేర్పడును. తెలుగులో ఉకారముచ్చారణార్థము చేరుట స్వాభావికము. దీనిపై 'ఇక' చేరి 'మచ్చిక' పదము నిష్పన్నమైనది.

'మచ్చిగ' అను రూపభేదముకూడ దీనికున్నట్లు ప్రయోగమువలన తెలియుచున్నది.

కన్నడము — మర్చు, మచ్చు, మెచ్చు (ధాతువులు)
మెచ్చికె (నామవాచకము)
తుళు — మెచ్చిగె ( " )

అను రూపములు సోదరభాషలలో కనబడుచున్నవి.

ఇక ప్రత్యయములోని 'క' నాదాక్షరముగా మారుట నమ్మిగ, మచ్చిగ శబ్దములలో విశేషముగా కన్పించుచున్నది.

13. ఉ:-

ధాతువు, నామశబ్దము ఒక్క రూపములోనే వ్యవహరింపబడువానిని, 'ఉ' ప్రత్యయాంతములుగా చెప్పుట వ్యాకరణసంప్రదాయము. అటువంటి శబ్దము లీ భాగములో 13 కలవు. అవి:-

1. అదలు
2. అన్ను
3. అఱుము
4. అలుకు
5. ఇఱుకు
6. ఉడుకు
7. ఉఱుము
8. ఉలుకు
9. తవులు
10. తిట్టు
11. తుఱుము
12. వుట్టు
13. పొగడు

'అదలు' ధాతువు శోకించుట, తపించుట, భయపడుట, చలించుట మొదలగు అర్థములకు వాచకము. 'అదలు' నామవాచకముగా శోకము, బాధ, భయము అను నర్థములను బోధించును. తిక్కన, శోకార్థములో—

"చిత్తం బదలునఁ జిక్కువడ నిట్టులను
నర్జునుతోన్"[28] అని ప్రయోగించినాడు.

మూ.ద.ద్రా. లోని 'అట్' అను ధాతువునకు 'అల్' అనుబంధముగా చేరి 'ట' దకారముగా మారి, ఉకారముచ్చారణార్థము చేరగా 'అదలు' ధాతువు రూపొందినది. అదియే నామముగా కూడ వాడుకలో కొనసాగినది. కన్నడములో 'అదలు' ధాతువు, 'అటిల్' నామము, తమిళములో 'అటి' ధాతువు ఈ యర్థములో కనబడుచున్నవి.

'అన్ను' ధాతువు, మత్తిల్లుట, పరవశమగుట అను నర్థములను బోధించును. నామవాచకముగా పారవశ్యము, శోభ, స్త్రీ, కన్య అనెడి యర్థములను బోధించుచున్నది.

తిక్కన కన్యార్థములో క్రింది ప్రయోగమును గావించెను—

---

28. శాంతి. 1—౨౮.

"కన్ను మసంబును దనిసినఁ
గన్నియ యెవ్వానిఁ గోరు గాంధర్వంబా
యన్ను నతని కిచ్చుట",[29]

'అలుకు' ధాతువు భయపడుట, జంకుట అను నర్థములను; నామశబ్దముగా 'అలుకు' భయమును, జంకును తెలుపుచున్నది.

"అలుకొందు మనముతోఁ దన బలముం బురికొలిపి పొదివి"[30] -అని శంక యనెడి యర్థములో తిక్కన ప్రయోగము కలదు.

మూ.ద్రా. లోని 'చళ్' అను ధాతువు దీనికి ప్రకృతి. తుళు, మలయాళ భాషలలో అకారాది, చకారాది రూపములు రెండు విధములున్నవి.

కన్న-అళుకు, అళ్కు, అను ధాతు, నామరూపములు రెండును కలవు.

తెలుగులో పదాది చకారము లోపించిన రూపము నిలిచినది.

వ్యాకరణము ప్రకారము 'ఉ' ప్రత్యయాంతముగా చెప్పినను, దీనిని భాషా శాస్త్ర రీత్యా 'కు' ప్రత్యయాంతమని చెప్పుట సమంజసము.

'అఱుము' అనునది క్రియగా, ప్రతిఘటించుట, బాధించుట, ఆక్రమించుట, తెగించుట, విజృంభించుట, అను వానిని తెలుపుచున్నది. ప్రతిఘటనార్థములో నామ వాచకముగా ప్రయోగములలో ఉన్నది. తిక్కన 'అఱుము'[31] శబ్దమును దాని రూపాంతరమగు 'అర్మ'ను[32] గూడ ప్రయోగించినాడు.

మూ.ద్రా. లోని 'చఱ్' అను ధాతువు మొదటి చకారము లోపించి ఱ కారము 'ఱ' గా మారి 'ఉము' అనుబంధముగా చేరుట వలన 'అఱుము' ధాతువు తెలుగులో రూపొందినది.

'ఇఱుకు' ధాతువు-ఇముడ్చుట, ఇముడుట, అణగుట, రెండిటిమధ్య అదుమ బడుట అను క్రియలను, నామశబ్దము- 'సంకుచితస్థలము' అను నర్థమును తెలుపును.

తిక్కన దీనిని క్రియగాను, నామముగాను వాడియున్నాడు.

---

29. అను. 2- 223. 30. ద్రోణ. 1- 819
31. భీష్మ. 2-806 32. విరా. 3-163

మూ. ద్రా. లోని 'ఇల్' అను ధాతువునకు 'ఉక్' అనుబంధము చేరగా దంతమూలీయ స్పర్శము ల్) అగా మారి 'ఇఱుకు' ధాతువు నిష్పన్నమైనది. కన్న డములో ఇఱుకు, ఇఱుంపు ధాతువులు, నామశబ్దములు కూడ దీనికి సమానార్థకము లున్నవి.

'ఉడుకు' ధాతువు కాగుట, తపించుట, పక్వమగుట, కోపించుట అను నర్థ ములను బోధించుచున్నది. ఇది నామ శబ్దముగా వేడిమి, పీడ, విచారము అను వానిని బోధించును.

"కదుఁ గ్రొవ్వి వాఁడు లోకము నుడుకులఁ బెట్టంగ వినివి."[33] _అను తిక్కన పద్యములో బాధ అను నర్థములో 'ఉడుకులు' శబ్దము ప్రయుక్తమైనది. తాపము, విచారము అను వానినిగూడ ఇతర ప్రయోగములలో తిక్కన చూపినాడు.

"ఉఱుము" అనునది ధాతువుగా గర్జించుటను, మేఘధ్వనిని, నామముగా మేఘధ్వనిని బోధించుచున్నది.

"ఉత్" అను మూ.ద్రా ధాతువునకు 'ఉమ్' అనుబంధముగా చేర్చి, 'త' 'ఱ'గా మారుటవలన 'ఉఱుము' రూపము నిష్పన్నమైనది.

తమిళములో 'ఉఱుము' మలయాళములో 'ఉఱుమ్మక', 'ఉరమ్మక' అను ధాతువు లీ యర్థములో కనబడుచున్నవి.

'ఉలుకు' ధాతువు భయపడుట, బెదురుట, అనూయపడుట అను వానిని తెల్పును. నామవాచకముగా భయమును, సంతాపమును తెలుపుచున్నది.

"ఉలుకును, వెక్కనపాటును దలకొను నెమ్మనముతోడ"[34]_అను పద్య ములో భయార్థము వ్యక్తమగుచున్నది. ఇది క్రియారూపముగాకూడ తిక్కన ప్రయోగ ములో కన్పించును.

---

33. అను. 4-407.    34. విరా. 1. 218

కన్నడములో 'ఉలుకు', 'ఉళుకు' ధాతువులు, తమిళములో 'ఉలుక్కు' ధాతువు దీనికి సమానార్థకములు.

మూల ద్రావిడములోని 'ఉళ్' ధాతువుపై 'కు' అనుబంధముగాచేరి, స్వర భక్తివలన ఉకారమువచ్చి యేర్పడిన ధాతువిది.

అందువలన ఇదికూడ తులనాత్మక విశ్లేషణవలన 'కు' ప్రత్యయాంతమని చెప్పదగును.

'తవులు' ధాతువు 'తగులు' నకు రూపాంతరము. గకారవకారములు పరివర్తన మందుట ఈ భాషలలో సహజము.

ఈ ధాతువు ఆసక్తినొందుట, లగ్నమగుట, దొరుకుట, కలుగుట, ఇష్టపడుట మొ అర్థములను బోధించును. నామవాచకముగా అభిలాష, వలపు, సంబంధము ఇత్యాది నానార్థములను తెలుపుచున్నది.

తిక్కన 'తవులు' శబ్దమును అభిలాష, మోహము, సంబంధము మొదలగు అర్థములలో పెక్కుచోట్ల ప్రయోగించినాడు. గకారవకారములు రెండింటినిగూడ ఈయన ఈ ధాతు మధ్యములో ఉపయోగించినాడు.

| | | |
|---|---|---|
| కన్నడ | — | తగుళ్, తగుళు |
| తమి | — | తకై |
| కురుఖ్ | — | టక్ |
| తుళు | — | తగరుని |

అను విధముగా సోదరభాషలలో దీనికి సమానార్థక రూపములు కనబడుచున్నవి. మూల ద్రావిడ ప్రకృతి 'తక్', దానికి 'ఉలు' అనుబంధము కలిసి 'తగులు' అని, వకారము వచ్చినప్పుడు 'తవులు' అని ధాతురూపములేర్పడినవి. తరువాత అవి నామార్థమును గూడ బోధించు శక్తి గలిగినవి.

తిట్టు' అనునది ధాతువుగా నిందించుట, శపించుట అను క్రియలను తెలుపగా, నామవాచకముగా నింద, శాపము అను భావార్థబోధకమైనది.

తిక్కన నింద్యార్థములో 'తిట్టు' శబ్దమును ప్రయోగించినాడు.

తమిళ, కన్నడ భాషలలో 'తిట్టు' ధాతువు, నామశబ్దము కూడ కలదు.

మూ. ద్రా. లో దీనికి 'తిద్' లేక 'చిద్' అనునది ప్రకృతిగా T. V. B. తెలుపుచున్నది.

అంత్య హల్లు మీద ఉకారము చేరినప్పుడు ఆ హల్లు ద్విత్వమును పొందినది.

'తుఱుము' ధాతువు ముడుచుట, గ్రుచ్చుట, చక్కచేయుట, క్రుక్కుట అను క్రియలను బోధించును. ఇది నామవాచకమై కొప్పు, శిఖ అను నర్థములను తెలుపుచున్నది. ముడువ బడునది లేదా పూవులు మొదలగునవి క్రుక్కబడునది అని వ్యుత్పత్త్యర్థము చెప్పదగును.

దీనికి 'తుర్మ' అను రూపాంతరము సూ.రా. నిఘంటువులో చూపబడినది.

'తుర్' అను మూలద్రావిడ ధాతువునకు 'ఉము' అనుబంధము చేరి 'ర' 'ఱ' గా మారుట వలన 'తుఱుము' ధాతువు రూపొందినది.

కన్నడములో 'తుఱుబు' ధాతువు, 'తుఱుమ్బు' అను నామము, తమిళములో 'తుఱుము', 'తుఱుమ్బు' అను ధాతువు లీ యర్థములో కనబడుచున్నవి.

'పుట్టు' అనునది జన్మించుట, కలుగుట, దొరకుట, కనబడుట అను క్రియలను ధాతువుగాను, మొలక, ఉదయము అను నర్థములను నామవాచకముగాను బోధించుచున్నది.

తిక్కన విరాటపర్వాదిలో—

"నా పుట్టు కృతార్థతం బొరసె"[35] అని జన్మార్థములో దీనిని ప్రయోగించియున్నాడు. ఈ యర్థములో ఇంకను పెక్కు ప్రయోగములను చూడగలము.

దీని మీద 'వు' చేరిన 'పుట్టువు' శబ్దమును గూడ తిక్కన వాడినాడు.

సోదరభాషా రూపము లీ విధముగా ఉన్నవి:—

కన్నడ—పుట్టు, హుట్టు, ఉట్టు

గోండి—పుట్ట్

35. విరాట-1-27

| | |
|---|---|
| కొలామి<br>పర్జి<br>గదబ | పుట్ |

ఇవన్నియు ధాతురూపములే. దీనికి మూలద్రావిడ ధాతువు 'పుట్' అనునది.

'పొగడు' శబ్దము ధాతువుగా, నామవాచకముగా గూడ ప్రయోగము లందున్నది. దీనికి స్తుతి, కీర్తి అనునవి నామార్థములు. ఇది చాలా ప్రయోగములలో చోటు చేసుకొన్నది.

"భీముండు! గదున్ ఘోరము సేసెను
మగం కతి క్షుద్రవృత్తమా పొగడొనగున్"[30]

అను నదొకటి.

'పొక్' అను మూలద్రావిడ ప్రకృతిపై 'అట్' అనుబంధముగా చేరి 'ట' 'డ' గా పరివర్తనమంది 'పొగడు' ధాతురూపము నిష్పన్నమైనది.

ఈ ధాతువు నుండి 'పొగర్త', 'పొగడిత' అను రెండు అన్యరూపములు కలిగినవి.

ఈ విధముగా పై 18 రూపములు ధాతువులుగాను, నామములుగాను ప్రయోగములందున్నందున, వ్యాకరణకారులు తమ నియమానుసారము, సౌలభ్య దృష్టితో వీనిని 'ఉ' ప్రత్యయాంతములుగా విశ్లేషించినారు.

కాని భాషాతత్త్వదృష్టితో చూచినప్పుడు 'ఇవి మూలధాతువుపై ఆ యా అనుబంధములు చేరుటవలన నిష్పన్నమైన ద్వితీయదశా ధాతురూపములు మాత్రమే అని చెప్పవలసి యుండును.

అవి మొదట నామములుగా కొంతకాలముండి తరువాత మరల ధాతుత్వమును సంతరించుకొ[illegible]పై క్రియా విభక్తులు, ఇతర ప్రత్యయములు చేరి క్రియాపదములుగా

14,15. ఎ. ఎన:- 'జంకు' ధాతువుపై 'ఎ' చేరగా 'జంకె' శబ్దమేర్పడినదని నిఘంటుకారులు. "హుంకారములు నదల్పులు జంకెలు" (భీష్మ 2-138) అను ప్రయోగమొక్కటే కలదు.

'దామెన' శబ్దమునకు మూలమగు ధాతువు స్పష్టముగా తెలియుటలేదు. "పెయ్యల దామెనయొక్క వలన ననువై యుండున్" (విరా. 1-275) అను ప్రయోగమొక్కటి 'ఎన' ప్రత్యయమున కుదాహరణము.

16. క;—

ఈ క్రింది శబ్దములలో 'క' ప్రత్యయము లభించుచున్నది. ఇది బిందు పూర్వకముగా, నిర్బిందుకముగా కూడ లక్ష్యములందున్నది.

బిందురహిత 'క' ప్రత్యయాంత శబ్దములు;—

1. ఇక్క
2. ఎఱక
3. ఎసకము
4. కినుక, కింక
5. తునుక
6. పుట్టుక
7. మునుక, మున్క
8. మొలక
9. ప్రక్క

'ఇక్క' శబ్దమును 'క' ప్రత్యయాంతముగా లాక్షణికులు చెప్పలేదు. తెలుగులో 'ఇచు' అను ధాతురూపము ప్రయోగములలో లేక పోవుట దానికి కారణమై యుండును.

ఎఱుఁగు, ఎనఁగు, కినియు, తునుఁగు, పుట్టు, మునుఁగు, మొలచు, వ్రయ్యు ధాతువులపై 'క' ప్రత్యయము చేరుటవలన 'ఎఱక' మొద పై రూపములను లాక్షణికులు, నిఘంటుకారులు సాధించిరి. ధాతువు అంత్యాక్షరములు 'గు' మొదలగునవి లోపించునని వ్యాకరణము తెలిపినది. క, గ, త, వ, వ ఇమి ప్రత్యయములు పర మగునపుడు-క, గ, చ, య, వ లకు లోపమును బాలవ్యాకరణము విధించినది.

తులనాత్మక పరిశీలన వలన ఈ క్రింది విషయములు తేటపడును.

(1) తమిళములో ఇరు; కన్నడ, కొడగు, తొద భాషలలో 'ఇర్' అను ధాతువులు 'వసించుట' అను నర్థములో ఉన్నవి.(D E. D. 407). కన్నడములో ఇర్కె, ఇక్కె, అను నామ శబ్దములు కూడ కన్పించుచున్నవి.

అందువలన మూ. ద్రా. లోని 'ఇర్' ధాతువుపై 'క' ప్రత్యయముచేరి హల్సమీకరణ విధానముతో 'ఇక్క' రూపమేర్పడెనని తెలియుచున్నది.

'ఇక్క' అనగా నివాసము, ఆశ్రయము, ఇల్లు, అని యర్థము లున్నవి.

ఇరవు, ఇరుగు. వంటి తెలుగు శబ్దాలలో 'ఇర్' ధాతురూపము పొడసూపుటను గమనింపవచ్చును.

(2) 'ఎఱక' అనగా 'ఱెక్క' అని యర్థము. ఎఱఁగునది-వ్రాలునది అను వ్యుత్పత్త్యర్థముతో పక్షిఱెక్కను బోధించునని సూ.రా. నిఘంటువు.

"ఎఱకలు విచ్చుచుఁ దుందము
తెఱచుచు వేఁగడిరి సొగసి త్రెళ్ళి"[37] అని తిక్కన ప్రయోగము.
ఇతర ద్రావిడ భాషలలో రూపము లిట్లున్నవి.
కన్న—ఎఱకె, ఎఱకె, ఱెక్కె, ఱక్కె (నామార్థము)

మల—ఇఱకు, చిఱకు
కొడ—ఱెక్కె
నాయికీ—రెక్క
తమి—చిఱకు
(నామార్థకములు)

ఈ శబ్దమే వర్ణ వ్యత్యయము వలన 'ఱెక్క' అను రూపమును పొందినది. మూలద్రావిడ ధాతువు 'ఎఱ్' అనునది.

(3) 'ఎనక' మనగా విజృంభణము, అతిశయము. ఈ శబ్దములో 'ము' ప్రత్యయము చేరుట ప్రత్యేకతగా చెప్పవచ్చును.

కన్నడములో 'ఎసె' ధాతువు 'ఎనక' అను నామము, తమిళములో 'ఇయక్కమ్' అను నామార్థకము కనబడుచున్నవి.

---

37. ఉద్యో.3-301.

'ఎచ్' అను మూలద్రావిడ ధాతువునుండి 'ఎసఁగు' ధాతువు రూపొందిన దని T.V.B. తెలుపుచున్నది.

'కినియు' ధాతువు రెండవ దశకు చెందినది. మూ.ద్రావిడ ధాతువు 'కిన్'(T.V.B. 282) పై 'ఇయ్' అనుబంధము చేరి అజంతత్వ సిద్ధికై ఉకారమును కలుపుకొనగా ఏర్పడినది.

'కిన్' అను మూలధాతువు మీద 'క' ప్రత్యయము చేరగా 'కిన్క' రూపము, స్వరాగమము వలన ఉకారము చేరుటవలన 'కినుక' శబ్దమేర్పడెననుట సముచితము. నకారము బిందువుగా మారి 'కింక' అను మరొక రూపము కూడ కలిగినది.

తిక్కన-కినుక, కిన్క, కింక అను మూడు రూపములను గూడ ప్రయోగించినాడు.

'తునుఁగు' ధాతువు కూడ మూలధాతువు మీద అనుబంధము చేరి యేర్పడిన ద్వితీయ దశరూపమే. 'తుణ్' అనునది మూలద్రావిడ ప్రకృతి. దానిమీద 'క' ప్రత్యయము చేరి 'ణ' 'న' గా పరివర్తనమంది స్వరాగమము వలన 'తునుక' రూపము నిష్పన్నమయ్యెనని చెప్పవచ్చును.

'తున్క' రూపమును తిక్కన ప్రయోగించలేదు.

'పుట్టు' ధాతువు ప్రాథమిక దశలోనిది కనుక దాని చివరి వర్ణము లోపించలేదు.'పుట్' అను మూలద్రావిడ ధాతువుపై 'ఉ' కారము చేరి హల్ ద్విత్వము వలన 'పుట్టు' ధాతువేర్పడినది. దాని మీద 'క' ప్రత్యయము రాగా 'పుట్టుక' శబ్దము జనించినది.

'మునుఁగు' ధాతువు మూ.ద్రా. రూపము 'మూజ్/మూళ్' అనునది. 'మూజ్' ధాతువుపై 'ఉక్' అనుబంధము చేరి, తొలియచ్చు హ్రస్వముకాగా 'మునుఁగు' ధాతువు రూపొందెనని తోచును. మునుక, మున్క అను రెండు రూపములను తిక్కన ప్రయోగించినాడు. ఇవి మూలధాతు దశలోనే ఏర్పడిన రూపములనుట స్పష్టము.

'మొలచు', మొలుచు' అను రెండు రూపములు కల ధాతువునకు మూ. ద్రా. ప్రకృతి 'మూళ్' అని, సంస్కృతములోని 'మూల' శబ్దము దీని నుండి స్వీకరింప బడినదని 'బరో' తెలిపినట్లు భద్రిరాజు కృష్ణమూర్తి వ్రాసినారు.

'మూళ్' దశలో 'క' ప్రత్యయము చేరి, తొలియచ్చు హ్రస్వత నొంది. ఇది ఒకారముగా మారి, స్వరాగమముతో అకారము వచ్చి 'మొలక' రూపమేర్పడెనని చెప్పదగి యున్నది.

'వ్రక్క' శబ్దము 'వ్రయ్యు' లేక 'వ్రచ్చు' ధాతుజన్యమని నిఘంటు కారుల కథనము. 'వ్రయ్యు' యొక్క ప్రేరణార్థక రూపము 'వ్రచ్చు'. 'వ్రక్క' అనగా-ఖండము, భాగము అని యర్థములు.

మూలద్రావిడములోని 'వఱ్ + చ్' అను ధాతువు వర్ణవ్యత్యయము నొంది 'ఱ' ముందుకు చేరి అది రేఫగా మారుట వలన 'వ్రచ్' అను రూపమును పొందును. దానిపై 'క' ప్రత్యయము చేరి సమీకరణ విధానముతో 'వ్రక్క' రూపము నిష్పన్న మగునని తులనాత్మక విశ్లేషణవలన తెలియుచున్నది.

ఇక నలిఁదు 'క' ప్రత్యయాంత రూపములు మూడున్నవి—

1. కణఁక
2. కలఁక
3. మలఁక

'కణఁగు' ధాతువు 'కదఁగు' నకు రూపాంతరమని సూ. రా. ని. తెలుపు చున్నది. 'కదఁక' శబ్దము నన్నయ రచనలో లభించుచున్నది. 'కణఁగు' పై (క) చేరగా 'కణఁక' శబ్దము నిష్పన్నమగును. 'కదఁగు', 'కణఁగు'ల మూ.ద్రా. ధాతు స్వరూపమును T.V.B. చూపలేదు.

'కలఁక' రూపము కలఁగు ధాతు జన్యమని లాక్షణికులు తెలిపినారు.

మూ.ద్రా. లోని 'కల్' ధాతువుపై 'అంక్' అనుబంధము చేరుటవలన 'కలఁగు' ధాతువేర్పడినదని T.V.B సూచించినది. ఆ పక్షమున 'కలంక్' అను రూపముపై 'అ' ప్రత్యయము మాత్రము చేరినదని చెప్పిన చాలును.

కన్నడ, తమిళ భాషలలో కూడ 'కలంకు' అను ధాతురూపము లున్నవి.

'మలంగు' ధాతువు మూ.ద్రా. ప్రకృతి 'మల్' అనునది. దానిపై 'క' ప్రత్యయము చేరి స్వరాగమముతో అకారము రాగా 'మలఁక' శబ్దము రూపొందెనని తలచుట కవకాశమున్నది.

'మలఁక' అనగా చిక్కు, వంకర మొద అర్థములున్నవి. కన్నడములో 'మలఁగు, మలంగు' అను రెండు ధాతురూపములు కలవు (T.V.B).

17. కడ/గడ;—

ఈ రెండును ఒకే ప్రత్యయముయొక్క భిన్నరూపము లనుట సముచితము.

నిల్కడ, పోకడ శబ్దములలో 'కడ' రూపముతో, చేరుగడ, తేఱుగడ, మనుగడ, అను చోట్ల 'గడ' అనియు, ఈ ప్రత్యయము కన్పించుచున్నది.

'నిలుచు' ధాతువుపై 'కడ' ప్రత్యయము వచ్చి 'చు' లోపింపగా నిలుకడ శబ్దము నిష్పన్న మగునని వ్యాకర్తలు పేర్కొన్నారు. ఇదే విధముగా పోవు, చేరు, తేఱు, మను ధాతువులపై 'కడ/గడ' ప్రత్యయము చేరగా పై రూపములు కలుగునని వ్యాకరణము సాధించినది.

కాని 'నిలుచు' ధాతువు ద్వితీయదశకు చెందినది. మూ ద్రా. లో దీని ప్రకృతి రూపము 'నిల్' అనునది. దానిపైనే 'కడ' ప్రత్యయము చేరగా నిల్కడ రూపము; స్వరాగమము వలన ఉకారము వచ్చి 'నిలుకడ' అను రూపాంతరము కలిగిన వని తులనాత్మక దృష్టి వలన తెలియుచున్నది. నన్నయ 'నిల్కడ' శబ్దమును ప్రయోగించినాడు.

'పోకడ' శబ్దమునకు రీతి, మర్యాద, మరణము, అను నర్థము లున్నవి.

ఈ శబ్దము మూలరూపమగు 'పో' ధాతువు మీదనే ప్రత్యయముచేరగా నేర్పడినదని స్పష్టమగుచున్నది.

'చేరు, తేఱు, మను' ధాతువులనుండి చేరుగడ, తేఱుగడ, మనుగడ శబ్దములు జనించినవి.

'చేరుగడ' అనగా- శరణము, స్థానము, ఆశ్రయము, ఆధారము అను నర్థము లున్నవి

'తేఱుగడ' శబ్దమునకు ముగింపు, అన్తమయము, నేర్పు అనునవి యర్థములు. తిక్కన ఈ శబ్దమును 'ముగింపు' అను అర్థములో ప్రయోగించినాడు.[38]

'మనుగడ' అనగా జీవన మని యర్థము. మను ధాతువు జీవించుటను బోధించును.

ఈ ప్రత్యయము అన్నిచోట్ల భావార్థములోనే కన్పట్టుచున్నది.

18. కని:—

ఈ ప్రత్యయముతో 'కనుకని' శబ్ద మొక్కటే లభించుచున్నది. దీనికి సంభ్రమము, భయము, పట్టుదల మొదలగు అర్థము లున్నవి. దీని విషయము నన్నయ ప్రకరణములో వివరింపబడినది.

దీనిలోని మధ్య స్వరము లోపించగా 'కన్కని' రూపము కలిగినది. ఆ శబ్దమును తిక్కన ప్రయోగించినాడు. (అశ్వ. 4-128) ఈ ప్రయోగము కూడ ఒక్కచోటనే ఉన్నది.

19. కలి:—

'కనుకలి' శబ్దము 'కలి' ప్రత్యయాంతరూపముగా కనబడుచున్నది. దీనికి 'చూపు' అను నర్థము కలదు.

శ.ప.ప్ర కోశములో 'కనుకలి' ప్రయోగ మొక్కటే చూపబడినది. భారతములో ఆ ప్రయోగమున్నచోట 'కనుకని' అను పాఠాంతరము కొన్ని ప్రతులలో ముద్రితమైనది.

'కలి' ప్రత్యయాంతముగా చెప్పదగిన ఇతర ప్రయోగ మేదియు తిక్కన భాగములో కనరాదు.

---

38. శాంతి. 4-198.

20. కువ :—

| | |
|---|---|
| 1. అడంకువ | 7. నెలకువ |
| 2. ఇక్కువ | 8. పెనంకువ |
| 3. ఉడుకువ | 9. మక్కువ |
| 4. ఈఁకువ | 10. మఱకువ |
| 5. ఎక్కువ | 11. మెలంకువ |
| 6. తేఁకువ | 12. వేకువ |

అడంగు, ఉడుగు, ఈను, ఎక్కు, తేఁగు, నెలయు, పెనంగు, మరుగు, మఱచు, మెలంగు, వేఁగు — అను ధాతువుల మీద 'కువ' ప్రత్యయము చేరగా పై రూపము లేర్పడిన వని లాక్షణికులు, నిఘంటుకారులు పేర్కొన్నారు.

'ఇక్కువ' లోని ధాతురూపము 'ఇర్' తెలుగులో క్రియారూపములో ప్రయోగములో లేనందున లాక్షణికులు దానిని 'కువ' ప్రత్యయాంతముగా చెప్పలేదు.

'అడంగు' ధాతువు మూ. ద్రా. లోని 'అట్' అను ధాతువుపై 'అన్' అను బంధముగా చేరి, దానిపై మరల 'గు' చేరుట వలన ఏర్పడిన ద్వితీయ దశ ధాతువు T.V.B.). 'అడన్' అను దశలోనే 'కువ' ప్రత్యయము చేరి అడంకువ, అడఁకువ, అను రూపములు నిష్పన్నము లయ్యెనని జాతీయభాషా పరిశీలన వలన తెలియు చున్నది.

'నివసించు' క్రియార్థములో 'ఇర్, ఇరు' ధాతువులు, కన్నడములో కనబడు చున్నవి. ఇర్కె, ఇక్కె అను నామశబ్దము ఆ భాషలో ఉన్నవి. తెలుగులో కూడ ఇరవు, ఇరుగు వంటి శబ్దాలలో 'ఇర్' ధాతురూపము పొడసూపుచున్నది. 'ఇర్' రూపములోని ధాతువు మీద 'కువ' ప్రత్యయము చేరగా సమీకరణము వలన 'ఇక్కువ' శబ్ద మేర్పడెనని చెప్పదగియున్నది.

'ఉడుగు' ధాతువుపై 'కువ' ప్రత్యయము వచ్చి 'ఉడుకువ' శబ్దము జనించునని లాక్షణికుల ప్రతిపాదనము. 'ఉడుకువ' యనగా చాలించుట, వదలుట అనునవి యర్థములు.

కన్నడములో కూడ 'ఉడుగు' ధాతువు పై అర్థములో కన్పట్టును. 'తుళు' లో 'ఒద్క' యనగా ముగింపని యర్థము. కురుఖ్, మాల్తో భాషలలో క్రమముగా 'ఉటుర్' 'ఉట్' ధాతువులు ముగించుట అను క్రియార్థకములో నున్నవి. (D.E.D)

మూ.ద్రా. లోని 'ఉట్' ధాతువు మీద 'ఉగు' అనుబంధముగా చేరుటతో తెలుగులో 'ఉడుగు' ధాతు వేర్పడినది.

"ఉడుకువ లేని కయ్యమున కోర్వగ వచ్చునె నాకు దప్పివ

ట్టెడు."[39]— అను తిక్కన ప్రయోగము, విశ్రాంతి, విరామము అను నర్థమును బోధించుచున్నది.

"ఊఁకువ" అనగా పూనిక, యత్నము అని యర్థము. "ఊను" ధాతువు నుండి యీ శబ్దము జనించినదని సూ.రా. నిఘంటువు.

'ఎక్కువ' శబ్దము 'ఎక్కు' ధాతువు నుండి, తేఁకువ శబ్దము తేఁగు ధాతువు నుండి, నెలకువ, పెనంకువ, మక్కువ శబ్దములు నెలయు, పెనంగు, మరుగు ధాతువుల నుండి, మఱుకువ, మెలంకువ, వేకువ శబ్దములు మఱుచు, మెలంగు, వేఁగు ధాతువుల నుండి క్రమముగా జనించినవని లాక్షణికులు పేర్కొన్నారు.

'తేఁకువ' అనగా. భయము, జంకు, సందేహము అని అర్థములు.

'నెలకువ' యనగా స్థానము, ప్రదేశము, అని యర్థము. ఉండుట యను నర్థముగల 'నెలయు' ధాతువుపై 'కువ' ప్రత్యయము చేరగా ఈ శబ్దము నిష్పన్న మయ్యెను.

| | | | |
|---|---|---|---|
| కన్నడ | — | నెలను | (ధాతువు) |
| తమి | — | నిలై | " |
| మల | — | నిలెక్క | " |
| తుళు | — | నిలెవుని | " |

(పై ధాతువులు నివాసార్థకములు)

39. విరా. 5-186.

మూలధాతువులోని ఇకారము తెలుగు, కన్నడములలో ఎకారముగా మారినది.

27. కోలు;—

అనుప్రయుక్త మైన కొను ధాతువు 'కోలు' గా మారి ప్రత్యయమును నంతరించు కున్నది. అటువంటి 'కోలు' ప్రత్యయాంతములను తిక్కన పదునాల్గింటిని ప్రయోగించినాడు.

| | |
|---|---|
| 1. ఆఁచికోలు | 8. దాఁచికోలు |
| 2. ఇయ్యకోలు | 9. దొరకోలు |
| 3. ఎత్తికోలు | 10. దోఁచికోలు |
| 4. కాచికోలు | 11. నాఁటికోలు |
| 5. కూర్చికోలు | 12. పుచ్చికోలు |
| 6. గెల్చుకోలు | 13. మెయికోలు |
| 7. తెచ్చికోలు | 14. పిడుకోలు, పిడ్కోలు |

ఆఁచికొను, ఇయ్యకొను, ఎత్తికొను, కాచికొను, కూర్చికొను, అను శబ్ద పల్లవములలోని 'కొను' అనుబంధము 'కోలు'గా మారి 'ఆఁచికోలు' మొదలగు రూపములు కలిగినవి.

'ఆఁచికోలు' అనగా అపహరించుట అని యర్థము, నాఁచికోలు దీని యొక్క రూపాంతరమని నిఘంటుకారులు పేర్కొన్నారు.

ఇయ్యకోలు శబ్దమునకు-అంగీకారము, ఎత్తికోలు, అనగా కోరిక, ప్రయత్నము అనునవి యర్థములు. ప్రయత్నార్థములో తిక్కన ఎత్తికోలు శబ్దమును ప్రయోగించినాడు.

"ఇట్లు పితామహు నెత్తికోలునకుం జిత్తంబు వికసిల్ల"[40]- అని ఆ ప్రయోగము.

---

40. భీష్మ. 1-103.

కాచికోలు అనగా రక్షించుకొనుట అర్థము. దీనికి కాచుకోలు అను రూపాంతరము కలదు.

కూర్చికోలు శబ్దము ఒక్కచోటనే ప్రయోగింపబడినది.[41]

తెచ్చికోలు మొదలగు శబ్దములు కూడ పై విధముగా 'కొను' కోలుగా మారుట వలన ఏర్పడినవే.

గెల్పుకోలు శబ్దములో మాత్రము 'గెల్పు' శబ్దము మీద 'కోలు' అనునది ప్రత్యయముగా చేరినట్లు కన్పించుచున్నది.

ఉ:—

తిక్కన భాగములో ఈ క్రింది శబ్దములలో 'ట' ప్రత్యయము కన్పించుచున్నది.

| | |
|---|---|
| 1. ఉంట | 8. నింట, సిట్ట |
| 2. ఊట | 9. వంట |
| 3. ఊఱట | 10. పూఁట |
| 4. కంట | 11. మంట |
| 5. చెమట, చెమ్మట | 12. వసట |
| 6. తివుట | 13. వింట |
| 7. త్రిమ్మట | |

'ఉండు' ధాతువుపై 'ట' ప్రత్యయము చేరుట వలన 'ఉంట' శబ్దమేర్పడినది. "తి, దు, ట, లు పరంబగునపు దన్వాదులను స్థానంబున నెఱ సున్నయు నుండు డులోపంబును విభాషనగు"[42] అను బా.వ్యా. సూత్రము ప్రకారము 'ఉండు + ట" అనుచోట 'డు' లోపము కలుగును.

"బంటు తనంబు మాటలకు" అను పద్యములో "నృపకుంజరు పల్కునకడ్డు మాట రాకుంట యెఱుంగవే"[43] అని తిక్కన ప్రయోగించినాడు.

---

41. శల్య. 2-17. 42. బాల.క్రియా. 58 43. ఉద్యో. 3-59.

ఉండు ధాత్వర్థములో- కన్నడ, తమిళ, మళయాళ భాషలలో ఉళ్' ధాతువు, కన్నడములో 'ఒళ్', తమిళములో 'ఉణ్డు' అని అతిరిక్త ధాతురూపములు కలవు. దీనికి మూ. ద్రా. ధాతువురూపమును T.V.B. లో చూపలేదు.

"ఊను' అను ధాతువుపై 'ట' ప్రత్యయము చేరి 'ఊట' శబ్దము కలిగి నట్లు సూ.రా.నిఘంటువు పేర్కొన్నది. 'ఊఱు' ధాతువు శకట రేఫ యుతముగా అప్ప కవి గ్రహించినాడు. కన్నడ, తమిళ భాషలలో 'ఊఱు' రూపమే కనబడుచున్నది.

ఆద్యాదులకు 'ట' వర్ణకమును అంత్యలోపమును చిన్నయసూరి విధించి నాడు.[44] ఆద్యాదులలో 'ఊఱు' ధాతువు కూడ పఠింపబడినది. అందువలన 'ఊఱు + ట = ఊట' అను రీతిలో రూపసిద్ధి కలుగును.

దీనికి మూ.ద్రా.లో "చూత్" అనునది, మూ. ద. ద్రావిడములో 'ఊఱ్' అనునది ప్రకృతి రూపములు.

'ఊఱట' శబ్దము 'ఊఱడు' క్రియనుండి జనించినది. దీనికి విరామము, స్వాస్థ్యము, సహాయము అను నర్థము లున్నవి. 'ఊఱడు' ధాతువు మీద 'ట' చేరి అంత్యవర్ణము లోపించి 'ఊఱట' రూపము నిష్పన్నమైనది ఆద్యాదులలో దీనిని గూడ చిన్నయసూరి పఠించినాడు.

'ఊఱడు' ధాతువును T.V.B.లో చూపలేదు. D.E.D. లో 'ఊఱట' శబ్దమును గూడ చేర్చలేదు.

'కను' ధాతువుపై ప్రత్యయము చేరగా 'కంట' రూప మేర్పడనది. దీని ప్రక్రియ కూడ 'ఆంట, రూపము వలెనే తెలియవలెను. అన్వాదులలో 'కను' ధాతువు చెప్పబడినది.

'కను' ధాతువునకు మూ.ద్రా ధాతువు 'కణ్/కాణ్'.

కంట శబ్దమునకు చూచుట, పొందుట అను నర్థము లున్నవి. తిక్కన దీనిని పొందుట అనే అర్థములో రెండు పద్యములలో ప్రయోగించినాడు (భీష్మ. 1-99, అను. 1-228). 'చూచుట' అను నర్థముతో ఈతని ప్రయోగము లేదు.

---

44. బాల క్రియా-1.

'చెమరు' ధాతువు మీద 'ట' ప్రత్యయము చేరుట వలన 'చెమట', 'చెమ్మట' రూపములు కలుగును. బా.వ్యా లో ఈ శబ్దము చూపబడలేదు. కాని ఆద్వాదులలో, చెమరు' ధాతువును చేర్చి అంత్యవర్ణ లోపముతో నీ రూపమును సాధింపదగును.

'తుళు'లో సిమ్మ, తెమ్మ, శబ్దములు చల్లదనమును తమిళములో 'చెమ్మల్' శబ్దము (అర్వాచీనము) జలార్థమును బోధించుచున్నది. సంస్కృతములోని 'స్విమ్' ధాతువునుండి జన్యరూపముగా 'చిమ్' అనునది ద్రావిడభాషలలో స్వీకరింప బడినదని తెలుగులో అది 'చెమ్'గా మారి 'అరు' ప్రత్యయ సంబంధమై చెమరు ధాతు వేర్పడినదని భద్రిరాజు కృష్ణమూర్తి తమ T V.B లో సూచించినారు[45] "తేమ" శబ్దము తెలుగులో శైత్యార్థములో ప్రసిద్ధము.

'చెమ్' రూపములోని మకారము ద్విత్వమును పొందగా చెమ్మట అను రూపాంతరము కూడ కలిగినది.

"సమరవికాసంబు చెమట నొప్పరకుంత
హేతిదీధితులు లేయెండ నొదుచు"[46] అని తిక్కన ప్రయోగము.

'తివురు' ధాతువునకు-ఇష్టపడుట, కుతూహలపడుట, త్వరపడుట, యత్నించుట, అతిశయించుట, కోపించుట, మొదలగు అర్థములున్నవి. దానిపై 'ట' ప్రత్యయము చేరగా 'తివుట' రూపము సిద్ధించినది. కోరిక, ఆసక్తి, పూనిక అని దీని యర్థములు.

"వరు చూడ్కి ముద్దియవదనంబుపైఁ బాతి
తివుట మై నునుఁగాంతితీవ్రఁ గోలు"[47] అను ప్రయోగములో ఈ శబ్దమునకు ఆసక్తి అను నర్థము తోచుచున్నది.

"త్రిమ్మట" అను శబ్దము త్రిమ్మరుధాతువు నుండి జనించినది. దీనికి పర్యటనము, నడవడి, ఆపద, కాయకష్టము, పరివర్తనము అను నర్థములను సూ. రా. నిఘంటువు తెలిపినది. సంచారార్థములోనే తిక్కన దీనిని రెండుచోట్ల ప్రయోగించి నాడు. (విరా. 3. 95, మౌ. 168)

---

45. T.V.B. p. 363. 46. భీష్మ. 1. 119 47. విరా. 5. 395

మూ. ద్రా లో 'తిర్మ్ + అత్', లేక 'తిర్-మత్' అనుదానినుండి త్రిమ్మరు ధాతువు తెలుగులో ఏర్పడినదని T.V.B. తెల్పుచున్నది. దీనిపై 'కాఁడు' ప్రత్యయముచేరి 'త్రిమ్మటకాఁడు' శబ్దము నిష్పన్నమగుచున్నది.

'నిండు' ధాతువుపై 'ట' ప్రత్యయమువచ్చి నింట, నిట్ట అను రెండు శబ్దము లేర్పడుచున్నవి. (సూ.రా.ని.) 'నిండు'లో 'డు' లోపించి 'నింట' శబ్దమేర్పడుట సాధారణమే. కాని 'నిట్ట' శబ్దమే విశిష్టముగా ఉన్నది.

ఈ శబ్దములకు-ప్రవాహము, పొంగుట, స్తంభము మొ అర్థము లున్నవి.

"మనము మనంబునఁ బెనచి కేళికిఁ జొచ్చి
నతిఁ దేల్తు సౌఖ్యరసంపు నిట్ట"[48]- అను తిక్కన పద్యములో 'నిట్ట' శబ్దము ప్రవాహార్థమును తెల్పుచున్నది. ఇక్కడనే 'నింట' అను పాఠాంతరము చూపబడినది.

'నిండు' ధాతువునకు మూ. ద్రా. ప్రకృతి నిన్/నిత్ అను హలంత ధాతు రూపము లున్నవి.

'పంట' శబ్దము 'పండు' ధాతుజన్యము. 'ట' ప్రత్యయముచేరగా 'డు' లోపించి యీ రూపము కలుగును. 'సస్యములు ఫలించుట,' పక్వమగుట అని దీని కర్థములు.

సోదరభాషలలో ఈ ధాతువు తుల్యరూపా లీ విధముగా ఉన్నవి.

| | | |
|---|---|---|
| కన్న | — | పణ్ |
| తమి | — | పలుఙు |
| మల | — | పణ్టు |
| గోండీ<br>కొలామీ, పర్జి, నాయికి | | పణ్ట్[4] |

మూ.ద్రా. ధాతువు 'పట్-న్త్' అనునది 'పణ్-ద్'గా పరివర్తనమంది 'పండు' గా మారినట్లు T.V.B.లో సూచింపబడినది.

---

48. విరా. 2, 180

"వానయు సీతును వర్జించి మందు వే సవిగాక మున్న సన్యముల వంటలు"[49]
అని తిక్కన వైరు ఫలించుట అను నర్థములో దీనిని ప్రయోగించినాడు.

'పూఁట' అనగా- పూనుట, దినములో నగము, బాధ్యతవహించుట మొద। అర్థములున్నవి. ఇది 'పూను' ధాతువు నుండి 'ట' ప్రత్యయాంతముగా జనించినదని చెప్పదగును.

'పూను' ధాతువు ప్రకృతి రూపము మూ.ద్రా.లో పూణ్/పూన్.

తమిళములో పూణ్, పూట్ట్ అను ధాతువులు ప్రకృతార్థములో కనబడు చున్నవి. 'పూణ్టాన్' శబ్దము భర్త అను నర్థములో (భారము వహించువాడు) D.E.D లో చూపబడినది. (3577)

"కురుపతి నిర్ణితుంతగుటకుం బవనాత్మజ యేను బూఁట[50]
అను ప్రయోగములో 'పూఁట' శబ్దము బాధ్యత నను అర్థమును బోధించుచున్నది.

'మందు' ధాతువుపై 'ట' ప్రత్యయము చేరి 'దు'లోపముతో 'మంట' శబ్ద మేర్పడినది.

జ్వాల, కోపము, ద్వేషము, నొప్పి-మంట శబ్దార్థములు.

మూ. ద్రా.లో 'మందు' ధాతువు ప్రకృతిరూపము 'మన్ట్' (T. V. B p. 452).

"అర్జునుం డొక్కఁడ వైరిసేనలకు నొట్టిన మంట"[51] అను పద్యములో తిక్కన మంట శబ్దమును జ్వాలార్థములో వాడినాడు.

'వనట' శబ్దము 'వనరు' ధాతువునుండి జనించినది. శోకించు, విలపించు, దీనముగా మాట్లాడు అను క్రియలను బోధించు 'వనరు' ధాతువుపై 'ట' ప్రత్యయము చేరగా 'వనట' పదము నిష్పన్నమైనది.

> 'వాఁడియగునలుక లోకము పోఁడిమి సెడఁ గయ్యమట్లు పొడిచి[52] వనటమై నేఁడింక నడవికిన్' అని 'వనట' శబ్దము శోకార్థములో ప్రయుక్తమైనది.

---

49. శాం_3-3.   50. శాంతి. 1. 63   51. శల్య. 2. 129
52. ఉద్యో. 2. 194

ఓళ్/ఓఁణ్ అనునవి మూ. ద్రా. ధాతురూపములు.

'విను' ధాతువుపై 'ట' ప్రత్యయము వచ్చి ధాత్వంతవర్ణలోపము వలన అంట, కంట శబ్దములవలె 'వింట' రూపమేర్పడినది.

తిక్కన ఈ శబ్దమును క్రింది పద్యములో ఒక్కచోటనే ప్రయోగించినాడు.

"కావున నాదారగతి వింట గడు లెస్స రాజమార్గంబున రచ్చ"[53]

'కువి' లో 'వెన్' కొలామీ, నాయకీలలో 'విన్', పర్జీలో 'వెన్' అను ధాతువులు వినుట అను నర్థములో కన్పించుచున్నవి. తమిళాది భాషలలో ఈ ధాతువునకు ప్రశ్నించుట, చెవియొగ్గుట మొద అర్థములున్నవి. దీనికి మూ. ద్రా. ధాతువు 'విన్' లేక 'వెన్' (TVB 1711).

టు :-

ఆటు, ఏటు, కాటు, తూటు, వాటు, వ్రేటు అనునవి 'టు' ప్రత్యయాంత రూపములుగా కాన్పించుచున్నవి.

'అడచు' ధాతువుపై 'టు' ప్రత్యయము చేరగా 'ఆటు' శబ్దము జనించినదని సూ. రా. నిఘంటువు తెల్పుచున్నది.

పద్వాదులకు 'టు' వర్ణకము వచ్చునని అప్పు డా ధాతువు లాద్యక్షరశేషములుగా నుండి దీర్ఘము నొందునని బా. వ్యా. తెలుపుచున్నది.[54] దాని ప్రకారము 'అడుచు'లో 'అ' మాత్రము శేషించి దానికి దీర్ఘమురాగా 'ఆటు' రూపము నిష్పన్నమగును.

'అడుచు' ధాతువు మూ. ద్రా. లోని 'అట్' ధాతువునుండి యేర్పడినది.

తమిళములో 'ఆటు' శబ్దము చంపుట అను నర్థములో కన్పించుచున్నది. 'అటి' ధాతువు కొట్టుట, అణచు అను నర్థములను బోధించుచున్నది.

తిక్కన యీ శబ్దమును దెబ్బ అను నర్థములో ప్రయోగించినాడు.

---

53. శాం. 4-117.　　54. బాం.కృ.దే-8.

'ఏయు' ధాతువు 'టు' ప్రత్యయాంతరూపము 'ఏటు' శబ్దము. ఏయు+టు = ఏటు, యు లోపమువలన రూపము సిద్ధించును.

'ఏయు' ధాతువునకు మూ. ద్రా. ప్రకృతిరూపము 'ఎచ్ > ఎయ్/ఎ' (TVB p. 312)

D.E.D లో ఏటు శబ్దము 'ఏయు' ధాతు సంబంధిగా కాక ప్రత్యేకారోపములో చూపబడినది (781). ఏయుధాతువు (891) సంఖ్యగల ఆరోపములో కన్పించును. తిక్కన ఏటు శబ్దమును బాణపుదెబ్బ అను నర్థములో ప్రయోగించినాడు.

ఆ ప్రయోగమిది—

"పోరి రేటును వ్రేటును పోటు నొక్క-
యలవిఁ జెలంగంగ నుభయసైన్యములవారు"[55]

ఈ యుదాహరణములో ఏటు, వ్రేటు, పోటు అను మూడు 'టు' ప్రత్యయరూపము లొక్కచోట లభించుచున్నవి.

'కాటు' శబ్దము 'కఱచు' ధాతుజన్యమని వ్యాకర్తల, నిఘంటుకారుల మతము. కఱచుట, గాయము, గంటి అనునవి దీని యర్థములు. దీనికి—

కన్న— కర్చు

తమి— కటి

కోత— కయ్ర్. కర్చ్

మల— కడిక్క

అను ధాతురూపము లా యా భాషలలో కన్పించుచున్నవి.

మూ. ద్రా. లోని కత్, కట్ ధాతువులకు లేదా 'కత్' ధాతురూపము 'ట' గా మారిన త్త కు ముందు 'కట్' రూపమునై న పొందియుండునని భద్రిరాజు కృష్ణమూర్తి అభిప్రాయపడిరి. (T.V.B. p. 325)

---

55. భీష్మ.3-225.

'కట్' అను మూలధాతువుపై ఉకారముమాత్రము చేరి ఆద్యచ్చుదీర్ఘము నందుటవలన 'కాటు' శబ్దము నిష్పన్నమైనందున దీనికి 'ఉ' ప్రత్యయాంతముగా చెప్పుట తులనాత్మక పరిశీలనవలన నమంజసమనిపించును.

"అసుఖదంబైనరాజ్యామిషంబునకుఁ గు

క్కలు వోలెఁగ్రమలోనఁ గాటు[56]లాడి" అను ప్రయోగములో 'కాటు' శబ్దమునకు కలహమనునర్థము స్ఫురించుచున్నది. ఆడు శబ్దముతో కూడియున్నప్పుడే ఈ యర్థము బోధింపబడును.

'తూఁటు' శబ్దమునకు రంధ్రమని యర్థము దీనిని 'టు' ప్రత్యయాంతముగా లాక్షణికులు పేర్కొనలేదు. కాని కృదంతరూపమని స్పష్టముగా తెలియుచున్నది.

D.E.Dలో ఈ శబ్దమును 'తూఱు' ధాతు సంబంధిగా చూపినారు. కన్నడ, తెలుగు భాషలలో 'ప్రవేశించు' అను క్రియను 'తూఱు' ధాతువు తెలుపుచున్నది.

కన్నడములో 'తూతు', 'తూంతు' శబ్దములు రంధ్రమను నర్థమును చెప్పును. 'తూంతు' ధాతువుకూడ ప్రవేశింపజేయుటను బోధించును.

'తునుము' ధాతువు మూలరూపముతో దీనికి సంబంధముండియుండును. కావుననే అరనున్న చోటుచేసుకొన్నది.

'వాటు' శబ్దము 'వయిచు' ధాతుజన్యమని బా. వ్యా. పేర్కొన్నది. వయిచు + టు > వాటు (ఆద్యక్షరశేషము తోలియచ్చుదీర్ఘత్వము)

మూ. ద్రా.లోని వయ్/వెయ్ అను ధాతురూపములనుండి కన్నడాది భాషలలో బయ్, బయ్యు మొదః ధాతురూపములేర్పడినవి. తెలుగులో 'వయిచు' ధాతువటు వంటిదే.

"ద్రుపదనందనుఁడడిచినఁ దునియలయ్యెఁ

బలకరెండవ వాటునఁ[57] బగిలె శిరము"

అని తిక్కన 'దెబ్బ' అను నర్థములో వాటు శబ్దమును ప్రయోగించినాడు.

---

56. శాంతి. 1-45.  57. శల్య.2. 257

'వ్రేయు' ధాతువుపై 'టు' ప్రత్యయము చేరగా 'వ్రేటు' శబ్దము నిష్పన్న మైనది. 'వ్రేటు' అనగా దెబ్బ కొట్టుట అని యర్థములు.

'వేయు' ధాతువే నాగరకీకరణము (Hyper standard'sat'on) వలన వ్రేయు రూపమును బొందినదని 'ఏటు' రూపసామ్యముతో 'వ్రేటు' రూపమేర్పడి యుండునని భద్రిరాజు కృష్ణమూర్తి అభిప్రాయపడిరి [58]

వ్రేయుధాతుజన్యమైన 'వ్రేత' శబ్దముకూడ తిక్కనరచనలో లభించు చున్నది.

నేటి వ్యవహారములో వేయు వేటు అను రూపములు ప్రచురముగా విని పించును.

డు :—

భావార్థములో క్రిందిశబ్దములలో 'డు' ప్రత్యయము కనబడుచున్నది.

1. అల్కుడు, 2. తగులుడు, 3. మావుడు.

'అల్కుడు' అనగా మనుష్యసంచారాదుల వలన గలుగుధ్వని (సూ.రా.ని.) దీనిరూపాంతరము 'అలికిడి'ని గూర్చి పూర్వము ప్రస్తావించితిని

'అలుకు/అల్కు' ధాతువునకు భయపడుట, వెనుదీయుట, జంకుట అనునవి అర్థములు. దానిపై 'డు' ప్రత్యయముచేరి 'అల్కుడు' రూపము కలుగును. అర్థము మాత్రము కొంతదూరసంబంధముతో ఉన్నది. మృగాదులు జంకుటకు, భయపడుటకు కారణమైనది అని అరమును చెప్పవలసియుండును.

"...... దర్పకు వంపు బలంబులోనియ

ల్కుడు కరటిం జెలంగె శుకకోకిల భృంగలతతుల్"[59]

అని తిక్కన ప్రయోగించినాడు.

'తగులు' ధాతువుపై 'డు' ప్రత్యయము చేరి 'తగులుడు' శబ్దము కలిగి నది. తగులుట అని దీనికర్థము.

---

58. T. V. B. P. 499

59. ఉద్యో-2-111

"పానము జూదము వేఁటయు" అను పద్యములో "తగవైన విధము దక్కఁదగులు దాపదవెచ్చున్"[59] అను ప్రయోగమున్నది. దీనికి 'తగులము' అను పాఠాంతరము కొన్ని ముద్రిత ప్రతులయందున్నది.

'మావుడు' శబ్దము 'మావు' ధాతువుమీద 'డు' ప్రత్యయము చేరగా ఏర్పడినది. 'మాయు' ధాతు ప్రేరణార్థకరూపము 'మావు'

'మావుడు' అనగా మాసినది, మైలంబడి అని యర్థము. తిక్కన దీనిని వస్త్రార్థములో ప్రయోగించినాడు.[60]

'ఁత – త :-

'ఁత' ప్రత్యయాంతరూపములు దిగువ పేర్కొనబడినవి తిక్కన రచనలో గోచరించుచున్నవి:-

1. అవులింత
2. ఈఁత
3. ఊఁత
4. కోఁత
5. పూఁత
6. పోఁత
7. మేఁత
8. ప్రోఁత
9. రోఁత
10. ప్రేఁత

అవులించు, ఈఁదు, ఊఁదు, కోయు, పూయు, పోయు, మేయు, ప్రోయు, రోయు, ప్రేయు అను ధాతువులమీద 'ఁత' ప్రత్యయము చేరగా ధాతువు చివరివర్ణములు లోపించి పైరూపములు నిష్పన్నములగునని వ్యాకరణము సాధించెను. చిన్నయసూరి 'తఙ్' వర్ణకమని చెప్పుటవలన ఈ ప్రత్యయము బిందుపూర్వకముగానున్నది.

పైన చూపిన ధాతువులలో ఈఁదు, ఊఁదు ధాతువులలోని 'దు' లోపించుట విశేషము. 'క, గ, చ, య, వ లకు మాత్రము లోపమును చిన్నయసూరి తెలిపినాడు.

---

60. శాంతి-3-272

'అవులించు' ధాతువును T.V.B. లో చూవలేదు D E.D. పరిశీలనవలన అవ్ + అల్ అను ధాత్వంశముల కలయికపై 'ఇంచు' చేరగా తెలుగులో 'అవులించు' ధాతువేర్పడెననితోచును. తమిళములో 'అవి' ధాతువు, కన్నడములో ఆకళిసు, ఆగళిసు ధాతువులు, కొడగులో అవలిచ్ ధాతువు, తుళులో 'అవలు' అను నామశబ్దము దీనికి నమానార్థములో ఉన్నవి.

మూ.ద్రా.లో: 'ఈ' ధాతువునకు 'న్' అనుబంధము చేరగా 'ఈన్' అను రెండవదశ ధాతురూపమేర్పడి దానిపై 'అ' మాత్రముచేరి 'ఈత' శబ్దము కలిగెననుట తులనాత్మక పరిశీలనవలన స్పష్టము. సోదరభాషారూపము లిట్లున్నవి.

తమి — సీను
కొలామి — ఈన్డ్
కన్న — ఈజు
కోత — సీన్జ్
తొద — సీడ్, సీజ్.

ఈ రూపములను పరిశీలింపగా, సీ/ఈ అనురెండు మూలధాతువులుండెనని తెలియుచున్నది.

ఈవిధముగనే 'ఊత' శబ్దమునకుగూడ మూ.ద్రా. ధాతువు "ఊన్" అని సజాతీయ భాషాపర్యాలోకనవలన తెలియును.

తమి — ఊను
మల — ఊన్నుక
కురుఖ్ — ఊద్
కన్న — ఊఱు
తుళు — ఊన్దుని

"ఊన్" అను మూలధాతువుమీద 'త్' అనుబంధముగాచేరి, దానిపై అకారమే ప్రత్యయముగా వచ్చి ఊంత > ఊత అను రూపము కలిగినదని స్పష్టమగుచున్నది.

"కోయు" ధాతువు మూ ద్రా. రూపము 'కోయ్' అనునది. దానిపై 'త' ప్రత్యయముచేరి, యకారము లోపించుటవలన కోఁత శబ్దము నిష్పన్నమయ్యెనని తులనాత్మక విశ్లేషణము వలన తెలియును.

అట్లే 'పూయు' ధాతువునుండి 'పూఁత' శబ్దము, 'పోయు' ధాతువునుండి 'పోఁత' శబ్దము నిష్పన్నమగును. పొగడ్త, మడత అను రెండుశబ్దములలో బిందురహిత 'త' ప్రత్యయము కన్పించుచున్నది. పొగడు, మడచు ధాతువులపై ఈప్రత్యయము చేరినది. 'పొగడు' ధాతువునకు సోదరద్రావిడ భాషారూపములీక్రిందివిధిగా ఉన్నవి. (D.E.D. 3478)

| | |
|---|---|
| తమి—పుకళి<br>కన్న—పొగిటి | ధాతువులు |
| తమి—పుకటితల్—నామము | |
| కన్న—పొగట్కె, పొగత్తె<br>మల—పుకటి, పుకట్చ | నామములు |

మూ.ద్రా. ధాతువు 'పొక్' దానిపై 'అట్' అనుబంధము చేరగా దాని పరిణామమే 'పొగడు' ధాతువు దీనికి పొగడిత అనురూపాంతరము ప్రయోగములందున్నది.

'మడచు' ధాతువునకు మూ.ద్రా. ప్రకృతి 'మడ్' దానిమీద 'త' ప్రత్యయము చేరి, స్వరాగమముగా అకారము వచ్చుటవలన మడతరూపము కలిగినదని తోచును. దీనికి ఇతర ద్రా. భాషారూపములు ఇట్లున్నవి:-

| | |
|---|---|
| కన్న—మడి, మణి | —ధాతువులు |
| తమి—మటి | |
| గోండీ—మడ్చ | " |
| తుళు—మడియని | |

(D.E.D. 3796)

పొగడ్త, మడత శబ్దములలోనిది బిందురహితమైన 'త' ప్రత్యయము, కాని D.E.D.లో మడఁత, మడత అను రెండు రూపములు చూపబడినవి. (3796). వానిళ్ళ వారి భారతములో నిక్కిందుకప్రయోగమే కన్పట్టుచున్నది.[62]

62. అను. 4-101

మేయు ధాతువు మూ.ద్రా.లోని 'మేయ్' ధాతువుపై ఉకారము చేరగా నేర్పడినది. 'మేయ్' అను దానిపై 'త' ప్రత్యయము చేరి య కారము లోపించుటవలన 'మేఁత' రూపము జనించును. అందువలన ఇది ప్రాథమిక ధాతు నిష్పన్నమని తెలు చున్నది

కన్నడములో 'మే, మేయ్' ధాతువులు, తమిళములో 'మేయ్-న్' ధాతువు కుయిలో 'మే, మెయ్' ధాతువులు దీనికి తుల్యార్థకములు కలవు.

"మ్రోయు" ధాతువు, 'మొర్' అను మూ. ద్రా. ధాతువుపై 'అయ్' అను బంధముగా చేరి, వర్ణ వ్యత్యయము వలన 'ర' ముందుకు రాగా ఏర్పడినదని T.V.B. వలన తెలియు చున్నది. తొలియచ్చు దీర్ఘత్వమును గూడ పొందినది. దీనిపై 'ఁత' ప్రత్యయము చేరి యకారము లోపించి మ్రోఁత శబ్దము జనించినది.

'ఒత్-అయ్' అను మూ.ద్రా. ధాతువు నుండి దంతమూలీయము 'ఱ' త్వమును పొంది వర్ణవ్యత్యయము వలన 'ఱోయ్'గా, తరువాత తెలుగులో రోయు ధాతువుగా రూపొందినది. దానిపై 'ఁత' ప్రత్యయము చేరి యకారము లోపించి 'రోఁత' శబ్దము కలిగినదని చెప్పవచ్చును.

వ్రేఁత శబ్దము వ్రేఁయు ధాతుజన్యము. 'పెర్+అర్' అను మూ. ద్రా. ధాతువునుండి వర్ణవ్యత్యయము వలన రూపొంది 'వ్రేయు' రూపము కలిగినది. ఈ ధాతువును గూర్చి వ్రేటు శబ్దవిచారములో పూర్వము కొంత చర్చించితిని.

"వ్రేయ్" రూపముపై 'ఁత' చేరగా యకారము లోపించి 'వ్రేఁత శబ్దము కలిగెనని తోచుచున్నది.

> "ఒకదిక్కునద్దతిఁ బూన్చియొండు పెనవ్రేయున్ మేను వంచించి వ్రేఁ
> తకుఁ దప్పన్ వడివ్రేయు నొడ్డనమునన్"[68] —అనునది తిక్కన ప్రయో

గము ప్రయోగాంతరము కానరాదు.

---

68. శ. 2-257.

తి :-

పొలఁతి, వలంతి అనురెండు శబ్దములు 'తి' ప్రత్యయాంతములు కన్పట్టుచున్నవి. పొలఁతి శబ్దమును గూర్చి పూర్వప్రకరణములో చర్చించితిని.

'వలంతి' శబ్దమునకు లాక్షణికులు వ్యుత్పత్తిని చెప్పలేదు.

D. E. D. లో - (4187)

తమి — వల్లు, వలిప్పు, వలిత్తు

మల — వల్లుక.

కన్న — బల్, బలి

తెలుగు — బలియు

అను ధాతువులు ఒకే ఆరోపములో చూపబడినవి. సమర్థుడగుట, ధృఢమగుట, పెరుగుట, మొద అర్థములీయబడినవి. వలఁతి శబ్దముకూడ ఈ ఆరోపములోనే పేర్కొనబడినది.

అందువలన మూ ద్రా. లోని 'వళ్' లేక 'వల్' ధాతువుపై 'తి' ప్రత్యయము చేరుటవలన వలంతి శబ్దమేర్పడి యుండునని చెప్పదగును.

"రూపు గనుఁగొంటకుఁ గన్నువలంతి గాదు"[64] అని తిక్కన దీనిని ప్రయోగించినాడు.

దల:—

తాఁకుదల, తీఱుదల, బాదుదల అను మూడు దల ప్రత్యయాంత రూపము లీ భాగములో లభించుచున్నవి.

తాఁకు, తీఱు అను ధాతువులపై 'దల' ప్రత్యయము చేరి, తాఁకుదల, తీఱుదల శబ్దము లేర్పడినవి. తాఁకుదల యనగా = మార్కొనుట, యుద్ధమునందు కలియుట. 'తీఱుదల' శబ్దమునకు ముగింపు, అంతము అని అర్థములు.

"భీమసేనుండు నేఁడు సంగ్రామమునకుఁ

దీఱుదల యగుగా కని"[65]-అని తిక్కన తీఱుదల శబ్దమును ప్రయోగించినాడు.

---

64. అశ్వ. 2-81. 65. భీష్మ-2-208.

'బాడుదల' శబ్దమునకు అవమానించుట, సాహసకృత్యము, అనునవి యర్థములు (శ. చం.). బాడు అను ధాతువు తెలుగులో లేదు. ముసుగు, పరదా అను నర్థములలో నామవాచకముగా ఉన్నది.

కాని తమిళములో 'వాటు', కన్నడములో బాడు, బాడిసు, అను ధాతువులు కష్టబడు, ఎండిపోవు, మాయు, కాంతి హీనమగు అను నర్థములలో నున్నట్లు D.E D తెల్పుచున్నది (4377) తెలుగులో 'వాడు' ధాతువీ ఆరోపమందే ఇవ్వబడినది. 'తుళు' లో కూడ 'బాడుని' ధాతు వీయర్థమందున్నది.

అందువలన 'బాడుదల' శబ్దము కన్నడాది భాషలలో నున్న 'బాడు' క్రియతో సంబంధము కలిగి యున్నదని చెప్పదగును. అవమానించుట అను నర్థము కూడ నరిపోవును. తిక్కన దీనిని 4 చోట్ల 'పట్టు' అను శబ్దముతో కలిపి ప్రయోగించినాడు.

పి:—

'తెఱపి' అనగా దేశ కాలములందు అవకాశము, ఎడము అని యర్థము. ఇది 'తెఱచు' ధాతు జన్యము. (సూ.రా.ని.)

"ఉఱక నరుండు ద్రోణసుతు యుగ్యములన్
వెననొంచె నాతడున్!" వెఱ పియొుఃంత గాంచి" అని అవకాశార్థములో తిక్కన యీ శబ్దమును వాడినాడు.

D.E D. లో గూడ ఈ పదము తెఱచు ధాతువు వద్దనే చూపబడినది. (2667) అందువలన తెఱచు ధాతువునకు మూలమైన 'తెఱ్' అను ధాతువు 'తెఱ్' గా మారిన దశలో దానిపై 'అపి' ప్రత్యయము చేరగా 'తెఱపి' శబ్దము నిష్పన్నమయ్యె ననుట సముచితము. ఈ శబ్దము బహు ప్రయోగములలో కన్పించు చున్నది.

కొందరు వ్యాకర్తలు దీనిని 'పి' ప్రత్యయముగా చెప్పిరి. కాని కృత్తులు సాధారణముగా మూలరూపము పైనే చేరును కనుక తులనాత్మక విశ్లేషణలో 'అపి' ప్రత్యయముగా పేర్కొనుట సముచితము.

---

66. విరా. 5-141.

జడి:—

'అలజడి' శబ్దమును తిక్కన పెక్కుచోట ప్రయోగించినాడు. 'పాటు'తో కలిసి ఒక్క ప్రయోగమును చేసినాడు. ఇది 'అలయు' ధాతువునకు సంబంధించినదిగా D.E.D తెల్పుచున్నది. (200)

సాధారణముగా అలయు + జడి = అలజడి అని విశ్లేషించినచో 'జడి' ప్రత్యయమనవలసి యుండును. కాని తమిళముతో 'అలచు, అలైచు ధాతువులు. మలయాళములో అలసల్ అను నామము, కన్నడములో అలసె శబ్దము, తుళులో 'అలసుని' ధాతువు దీనికి సమానార్థకములుగా కన్పట్టుచున్నవి అందువలన 'అలచు' ధాతుదశలోనే దానిపై 'అడి' ప్రత్యయము చేరగా 'అలజడి' శబ్దమేర్పడి యుండును. అలసట శబ్దమునకు దీనికి సామ్యము స్పష్టముగా తెలియు చున్నది. 'అలజడి'కి మారుగా 'అరజడి', 'అదలడి' అను పాఠాంతరము లున్నవి.

వ:—

కలపంబు, పొలవంబు మురివంబు, మొరపంబు అను నాలుగు శబ్దములలో 'వ' ప్రత్యయము కన్పించుచున్నది. బాలవ్యాకరణము తిరియ్యాదులకు పవర్ణకమును, విధించినది.[67] ఆగమములో కలయు, పొలయు, మరియు ధాతువులు పేర్కొన బడినవి. దాని ప్రకారము 'వ' ప్రత్యయము చేరగా, ధాతువు చివరి 'యు' లోపించి పై రూపములు నిష్పన్నములగును. మొరయు ధాతువు నుండి ఆ విధముగనే మొరపము శబ్దము జనించును. అది గణముతో 'మొరయు'ను గూడ గ్రహింపవచ్చును.

'కలయు' ధాతువునకు మూ.ద్రా. ప్రకృతి 'కల్' తమిళములో 'కలప్పు' అని, కన్నడములో 'కలపు' అని, తుళు లో 'కలప్పు' అని నామ శబ్దములు, నాయికిలో కొలామిలో 'కల్ప్' అను ధాతువు కన్పించుచున్నందున ప్రేరణార్థములో కలుపుట వంటి రూపాలలో పకారము కన్పించుచున్నందున 'కల్' మీద అనుబంధముగా 'అప్' చేరిన 'కలప్' అను ద్వితీయదశ ధాతువు మీద అకారము మాత్రమే ప్రత్యయముగా చేరినదని తులనాత్మక పరిశీలన వలన తెలుచున్నది. కావున భాషాశాస్త్రరీతిలో ఇది 'అ' ప్రత్యయాంత మనుట సముచితము.

---

67. బాల- కృత్ 9.

'మురిప' శబ్దము మూ.ద్రా లోని 'ముత్' అను ధాతువులోని 'త్' 'ఱ'గా మారి ఇకారము దానిపై అనుబంధముగా చేరిన తరువాత 'ప' ప్రత్యయముతో కలిసి నిష్పన్నమైనది. దీనికి 'మురిపెము' అను రూపాంతరము కూడ కలదు.

మొరయు ధాతువు 'మొర్' అను మూ ద్రా ధాతువుపై 'అయ్' అనుబంధము చేరగా ఏర్పడినది. దాని మీద 'ప' ప్రత్యయము వచ్చి 'మొరపము' అను శబ్దము కలిగినది. సోదర ద్రావిడ భాషలలో దీనితో సామ్యము కల నామము కన్పించదు.

'కలపము' అనగా-కలవుట, పరిమళద్రవ్యములు కలిపిన చందనము అని యర్థములున్నవి.

"కలపంబు లభినవ గంధంబులుగఁ గూర్చి
తనువున నలఁదుదు ననువు గాగ"[68]- అని తిక్కన రెండవ అర్థములో ప్రయోగించినాడు.

'పొలప' శబ్దమునకు- వాసన, వ్యాపనము, ప్రకాశము మొదలగు అర్థములున్నవి. తిక్కన 'ప్రకాశ'మను అర్థములో ఈ శబ్దమును ప్రయోగించినాడు.

"అరని కన్గొను నప్పు డయ్యింతి కనుఁగవ
పొలపంబు రాగంబు వొదలఁజేయ"[69]
'మురిప' మనగా గర్వము, విలాసము మొ। అర్థములున్నవి.

'మొరవ' శబ్దమునకు- ధ్వని, గులకరాయి అను నర్థములు కలవు. తిక్కన ధ్వని యను నర్థములో ప్రయోగించినాడు.

మర:—

పడమర, విడుమర శబ్దములలో 'మర' ప్రత్యయమును తిక్కన ప్రయోగించినాడు.

విడుమర, పడమర శబ్దములకు వ్యుత్పత్తిని బాలవ్యాకరణాదులు తెలుపలేదు. పడు ధాతు జన్యముగానే పడమర శబ్దమును చెప్పుట కాధారములున్నవి.

---

68. విరా. 1-106. 69. 1- 48.

D.E.D.లో దీని సజాతీయ భాషా రూపములిట్లు చూపబడినవి (3190).

తమి — పటు ధాతువు.

మల — పటుక, పటుక్క „

కన్న — పడు „

ఈ ధాతువులు అనమించుట, పడుట అను నర్థములను బోధించునని అందు సూచితము. ఈ ఆరోపములోనే తెలుగులోని 'పడమర' శబ్దమును చూపినారు. అందు వలన 'పడమర' శబ్దము 'పడు' ధాతువు మీద 'మర' ప్రత్యయము వచ్చి యేర్పడిన దనుట సంగతమైనది. పడుధాతువులో ఉకారము చేరని 'పడ్' రూపము పైనే 'మర' ప్రత్యయము చేరి స్వరాగమముతో అకారము కలిగి యుండునని తోచుచున్నది.

'విడుమర' అనగా- విడుదల, నివృత్తి అను నర్థము లున్నవి.

ఇది కూడ 'విడుచు' ధాతువు పూర్వరూపమైన 'విడ్' అను మూ.ద్రా. ధాతువు పైనే 'మర' ప్రత్యయము ఏర్పడగా నిష్పన్నమైనదని చెప్పదగును.

కన్నడములో బిడు. తమిళములో విటు, మలయాళములో విటుక, అను ధాతువు లీ యర్థములో కనిపించుచున్నవి. (T.V.B. p.491).

విడుదల, విడుగర, విడుపు వంటి తెలుగు శబ్దాలలో 'విడు' రూపము కన్పించుచున్నది.

"ఒకనాఁ డేమును నాపద
లకు విడుమరఁ గాంచి విప్రులం బుట్టఁ[70]

అని తిక్కన విడుమర శబ్దమును విముక్త్యర్థములో ప్రయోగించినాడు.

---

70. విరా. 1- 9.

వ:—

ఈ క్రింది పదములలో 'వ' ప్రత్యయము కన్పించుచున్నది.

1. ఎగువ
2. కూటువ
3. చేరువ
4. చొరవ
5. తెగువ
6. తెట్టువ
7. విలువ

'వ' ప్రత్యయమును వ్యాకరణకర్తలు చెప్పగా భాషాశాస్త్రజ్ఞులు 'ఉవ' అని విశ్లేషించిరి. 'ఎగు, కూడు' మొద అజంతధాతువులను లాక్షణికులు మూలముగా గ్రహించిరి. హలంత దశలోని మూలధాతువులను గ్రహించి 'ఉవ' అని భాషాశాస్త్రజ్ఞులు విశ్లేషించిరి.

లాక్షణికుల, నిఘంటుకారుల ప్రకారము—ఎగు, చేరు, తెగు, తెట్టు విలుచు, ధాతువులనుండి ఎగువ, చేరువ, తెగువ, తెట్టువ, విలువ-అను రూపములు నిష్పన్నము లైనట్లు చెప్పబడినది. 'కూటువ' శబ్దమునకు వ్యుత్పత్తిని లాక్షణికులు చెప్పినట్లు కన్పించదు. సూ.రా.ని లో మాత్రము 'కూటువ' శబ్దము 'కూడు' ధాతుజన్యమని చూపబడినది.

'ఎక్కు' ధాతువునకు 'ఎగు' ఆదేశమగునని గాణపత వ్యాకరణము.(గాణ-కృత్-27) దానికి 'వ' చేరగా 'ఎగువ' శబ్దము రూపొందెను.

'కూడు'పై 'వ' ప్రత్యయమువలన కూటువ శబ్దమేర్పడినదని సూ.రా.ని. పేర్కొన్నప్పటికి దీనిని 'ఉవ' ప్రత్యయాంతముగా చెప్పుట సముచితమని తోచును. మూ. ద్రా.లో కూణ్ట్, కూట్ట్, అను ధాతువుపై 'ఉవ' ప్రత్యయము చేరి తరువాత ద్విత్వము తొలగినదని భావించుట యుక్తియుక్తముగా నుండును.

'కూటువ' శబ్దము నొక్కచోటనే 'మూక' శబ్దముతో చేర్చి తిక్కన ప్రయోగించినాడు.

కూటువ అనగా గుంపు, రాశి అని, కూటువమూక యనగా-అక్కడక్కడ వెదకి తెచ్చిన విరికిబలము అని సూ.రా ని. వివరించినది.

'చేరువ' శబ్దమును 'చేర్ + ఉవ'గా విశ్లేషించి చూపినారు భద్రిరాజు కృష్ణమూర్తి.[71] అందువలన లాక్షణికుల ప్రకారము 'వ' ప్రత్యయాంతమనుటకంటె ఉవ ప్రత్యయము నొకదానిని కృత్తులలో స్వీకరించుట చాల అవసరము. అప్పుడు పిలువ, నిలువ మొనవి ఉవ ప్రత్యయాంతములుగా నిర్ణయింపవచ్చును.

'చొరవ' శబ్దమును చొచ్చు ధాతుజన్యముగా సూ.రా.ని. తెలిపినది. 'చొచ్చు' నకు ముత్తు పరంబగునప్పుడు 'చొరు' ఆదేశ మగునని బాలవ్యాకరణము (క్రియ. 91) విధించినది. ఇది పెక్కు ప్రయోగములలో కన్పించును.

దీనిని 'అవ' ప్రత్యయాంతముగా పరిగణింపదగును.

'చొచ్చు' ధాతువు అజాది ప్రత్యయమునకు ముందు 'చొర్' అను రూపములో ఉండునని చొర్-అన్‌చొర్-ఉము అని యుదాహరించినారు.[72] కృష్ణమూర్తి. అందువలన 'అవ' అజాది ప్రత్యయము కనుక 'చొర్' పై చేరి 'చొరవ' రూపము కలుగుట యుక్తియుక్తము.

"కలియుగంబు చొరవ యాసన్నంబయ్యె"[73] అను తిక్కన ప్రయోగము ప్రవేశ మను నర్థమును బోధించుచున్నది.

"తెగు" ధాతువుపై 'వ' ప్రత్యయము చేరగా తెగువ శబ్దము నిష్పన్నమగును.

'తెగు' ధాతువు ఇతరార్థములతో పాటు సాహసించుట, మరణించుట- అను నర్థములను గూడ తెలుపును. అందువలన భావార్థములో 'వ' ప్రత్యయము చేరి సాహసము, శక్తి మొ అర్థములను బోధించుచున్నది.

మూ.ద్రా.లో 'తెగ్' అనునది ధాతురూపము. కావున ఇది కూడ 'ఉవ' ప్రత్యయాంతమని తులనాత్మక పరిశీలనవలన తెలియుచున్నది.

'తెట్టు' ధాతువు-'గాలిచే తృణాదికము నీటిపై నొకచోటికి చేరుట' అను నర్థమును బోధించును. (సూ రా.ని.) ఇది నామపదముగా గూడ కన్పించును. పై ధాతువు మీద 'వ' ప్రత్యయము చేరగా 'తెట్టువ' శబ్దము నిష్పన్నమగును. 'తెట్టువ' అనగా సమూహము.

---

71. T.V.B. p. 365 72. T.V.B. p. 369 73. శల్య. 2-305

తిక్కన దీనిని "తెట్టువలు గట్టై" అను రూపములో ఒక్కచోట మాత్రము ప్రయోగించినాడు.[74]

'విలుచు' ధాతువునుండి 'విలువ' శబ్దము జన్యమని నిఘంటుకారులు పేర్కొన్నారు.

కాని నిజమునకు ఇక్కడకూడ 'విల్' అను మూ.ద.ద్రా. ధాతువుపై 'ఉవ' ప్రత్యయముచేరి 'విలువ' శబ్దమేర్పడెనని చెప్పదగును.

కన్నడములో బిల్, బిలి ధాతువులు, తమిళములో 'విల్' ధాతువు క్రయార్థములో కన్పించుచున్నవి (TV.B. 492). అందువలన 'విల్ + ఉవ'=విలువ అని రూపనిష్పత్తి చెప్పదగును.

వడి:-'నడవడి, లేవడి' అను రెండు శబ్దములు వడి ప్రత్యయాంతములు కన్పట్టుచున్నవి నడచు ధాతువునుండి నడవడి; కలుగునకు వ్యతిరేకార్థకమైన 'లే' నుండి 'లేవడి' అను శబ్దములు రూపొందునని లాక్షణికుల కథనము.

సజాతీయ భాషలలో తుల్యార్థక రూపముల నీ విధముగా చూడవచ్చును.

| | | | |
|---|---|---|---|
| కన్నడ | — | నడె, నడి | (ధాతురూపములు) |
| తుళు | — | నడపుని | ( ,, ) |
| తమిళం | — | నట | ( ,, ) |
| బ్రాహు | — | నఙ్ | ( ,, ) |
| కన్నడ | — | నడె, నడి | ( నామశబ్దము) |
| తమిళం | — | నటై | ( ,, ) |
| మల | — | నట, నటప్పు | ( ,, ) |

మూ ద్రా. ధాతువు 'నట్-అ'. దానిపై 'వడి' ప్రత్యయముచేరగా 'నడవడి' శబ్దము ప్రవర్తనార్థములోను, ధర్మము, న్యాయము అను నర్థములలోను ప్రయుక్తమైనది.

74. ద్రో.-4-294

"నడవడి యను మున్నిడిం గడవంబెట్టంగ"[75] (ప్రవర్తనము)

"...............తమకు,

నధిపతియుఁగ నొరు నానపడకయుండి"[76]

నడవడి బహుకారణములఁ జిక్కువడిన (ధర్మము)

'లే' అనునది వ్యతిరేకార్థములోనే కనిపించు క్రియారూపము. దీని ఇతర ద్రా. భా. రూపము లిట్లున్నవి—

| | | |
|---|---|---|
| కన్నడ | —ఇలి | ధాతురూపములు |
| తమిళ | —ఇల్లై | |
| మల | —ఇల్ల | |
| కోత | —ఇల్ | |

వర్ణవ్యత్యయము వలన తెలుగులో 'లే' రూపము కలిగినది.

'లేవడి' శబ్దమును శాంతి పర్వములో ఒక్కచోటనే ప్రయోగించినాడు.

"ఒడఁబడి .........

చెడుగగు దుర్నీతు నెడఁ జిత్తము

కోర్కికి బట్టుసేసి లే

వడి యగు నీచకాంత యెద"[77] అనునది ప్రయోగము.

ఈ పద్యములో లేవడి శబ్దమునకు దరిద్రులు లేక అల్పురాలు- అను నర్థమును చెప్పవలసియున్నది.

వి:—

'వి' ప్రత్యయాంత రూపములు ఈవి, తెల్వి, అను రెండు మాత్రము ఈ భాగములో నూతనముగా లభించినవి.

'ఈగి' యొక్క రూపాంతరము 'ఈవి' శబ్దము. నన్నయ 'ఈగి' రూపము ను ప్రయోగింపగా, తిక్కన వకారయుక్తముగా కూడ వాడినాడు.

ఆం ప్ర. సాహిత్య అకాడమీ వారి ముద్రితప్రతిలో "అపాత్రవు టీవి యొప్పునే" అని వకారయుక్త పాఠము గలదు.

---

75. ఉద్యో-2-39 76. శాం-2-257 77. శాం.3-167

'ఇచ్చు' ధాతువునకు ముత్తు పరమగు నప్పుడు "ఈ" సర్వాదేశమగునని చిన్నయసూరి చెప్పినాడు.(బాల. క్రియా. 82)

కాని తమిళ కన్నడములలో 'ఈ' ధాతువు కొలామీ, నాయికి, గోండీలలో 'సీ' ధాతువు-ఈ యర్థములో కనబడుట వలన, మూ ద్రా. ధాతువు 'చీ'అని T. V. B. పేర్కొన్నది. మొదటి చకారము లోపించగా, దానిపై గి/వి ప్రత్యయము చేరుటవలన ఈగి, ఈవి రూపము లేర్పడెనని తులనాత్మక పరిశీలనవలన తెలియుచున్నది.

'తెల్వి' అనునది తెలివి శబ్దపు రూపాంతరము. ఇది తెలియు ధాతుజన్య మని వ్యాకర్తల మతము.

తులనాత్మక పరిశీలనవలన మూ.ద్రా ధాతువు 'తెళ్' అని తేలుచున్నది. (T.V.B. 891)

కన్నడములో తిళి ధాతువు,-స్పష్టమగుట, ప్రకాశించుట, ఎఱుగుట అను నర్థములను బోధించును.

తమిళములో తెళ్, కోతలో తెయ్ళ్/తెళ్ప్ అను ధాతువులు పై యర్థములోనే కలవు.

'తెళివు' అను నామశబ్దము తమిళ మలయాళములలో-స్పష్టత, ప్రకాశము అను నర్థములలో కలదు. కన్నడములో 'తిళివు' అనురూపము కన్పించును. (D.E.D 2825)

అందువలన 'తెళ్' అను మూలధాతువుమీదనే 'వి' ప్రత్యయముచేరి ళకారము ల త్వమును బొంది తెల్విశబ్దము నిష్పన్నమైనదని తలపవచ్చును. స్వరాగమమువలన ఇకారముచేరి తెలివి రూపమేర్పడినది. తిక్కన యీ రెండు రూపములను గూడ విరివిగా ప్రయోగించినాడు.

జ్ఞానము, వివేకము, నిర్మలత్వము, వికాసము, అంగీకారము మొద॥ అర్థములలో ఈ పదములు ప్రయుక్తము లయినవి.

వు:—ఈ క్రింది పదములు 'వు' ప్రత్యయాంతములుగా తిక్కనరచనలో కాన్పించును.

1. కరువు
2. తెర్వు
3. తనివు
4. నిలువు
5. నెరవు
6. నెంవు
7. నొడువు
8. నొవ్వు, నోవు
9. దిగువు
10. మనువు

ఈ శబ్దములు క్రమముగా కరుగు, తెఱచు, తనియు, నిలుచు, నెరయు, నెంయు, నొడి, నొచ్చు, దిగియు, మను, అను ధాతువులనుండి జనించినట్లు లాక్షణికులు ప్రతిపాదించినారు.

లోహములను కరుగుటకు సాధనమైనది అను నర్థముతో 'కరువు' శబ్దము 'మూస' ను బోధించును.

'కర్' అను మూ.ద్రా. ధాతువుపై 'అంక్' అనుబంధము చేరి కరఁగు ధాతు వేర్పడినదని T.V,B. లో తెలుపబడినది.

'కర్' అను మూలధాతు దశలోనే దానిపై 'ఉవు' ప్రత్యయము చేరి 'కరువు' శబ్దము కలిగెననుట యుక్తిసహముగా కన్పట్టును.

"కరువునఁ[77] బోసిరో విధుని కాంతి సుధాబ్ధితరంగ"- అని తిక్కన ప్రయోగము కలదు.

"తెర్వు" అనునది 'తెరువు' యొక్క రూపాంతరము. 'తెరువు' శబ్దమును నన్నయ ప్రయోగించినాడు.

---

77. అను.1- 188

ఈ శబ్దమునకు గూడ లాక్షణికులు ధాతువును పేర్కొనలేదు. D.E.D. లో కూడ, తమిళ,మలయాళ భాషలలోని 'తెరు' అను నామమును మాత్రము చూపించుట జరిగినది. ధాతురూపము నీయలేదు.

'తెఱచు' ధాతువునకు ప్రకృతి అగు 'తెర్' అను మూ.ద్రా. ధాతువునుండి 'తుళు'లో తెరవు శబ్దము కల్గి ప్రదేశ మను నర్థమును బోధించుచున్నది. 'కొలామీ లో 'తెర్వ్' ధాతువు 'తెరచుట'ను తెలుపుచున్నది. తమిళంలో 'ఓఱవు' అనగా మార్గము. (T.V.B.)

ఈ కారణములవలన తెరువు శబ్దమునకు 'తెర్' అను మూ.ద్రా. ధాతువుతో' 'తెఱచు' ధాతువుతో గూడ తప్పక సంబంధముండదగునని తలచుచున్నాను. ఈ శబ్దము ఒకచోటనే ప్రయోగింపబడినది. (త్రి 1-145)

'నుడువు-నొడువు' అనునవి ఒక శబ్దముయొక్క భిన్నరూపములే. 'నొడువు' ను ధాతువుగా వ్యాకరణకారులు పేర్కొన్నప్పటికి, ద్రావిడభాషలను తులనాత్మకముగా చూచినప్పుడు 'నొడి' లేక 'నుడి' మాత్రమే ధాతురూపమనియు, దానిపై 'వు' ప్రత్యయముచేరగా సమస్వరత విధానమున ఇకార ముత్వమును బొందెనని తెలియును.

తమిళ — నొడి

కన్నడ — నుడి

తుళు — నుడియుని

మల — నొడియుక, నొడిక్క అను ధాతువులు కలవు.

కావున మూ.ద్రా. లోని 'నొట్' అను ధాతువుపై ఇకార మనుబంధముగా చేరిన 'నొడి' అనునదే ధాతువని, 'నొడువు' అను ధాతువు తరువాత ఏర్పడినదని తోచుచున్నది.

దీని యొక్క రూపాంతరమైన నడువు శబ్దమును నన్నయ ప్రయోగించినాడు'

'నొవ్వు, నోవు, శబ్దములు నొచ్చు ధాతుజన్యములని లాక్షణికుల ప్రతిపాదనము.

కాని'నో' అను మూ.ద్రా. ధాతువుపై 'ఉ' ప్రత్యయము చేరి, వకారము ఆగమము కాగా 'నోవు' శబ్దము తొలియచ్చు హ్రస్వముగా మారి, వకారము ద్విత్వము నొందుట వలన 'నొవ్వు' రూపము కలిగెనని తులనాత్మక పరిశీలనలో తెలియుచున్నది.

తమిళములో 'నో, నోయ్' ధాతువులు, నోవు, నొవ్వు శబ్దములు, మలయాళములో 'నొక' ధాతువు 'నోవు' శబ్దము, కన్నడములో-నో,నొయ్యు నోయు ధాతువులు, 'నోవు' అను నామము ఈ యర్థములో D.E.D. లో చూపబడినవి. (8148)

'బిగియు', 'మను' ధాతువులపై 'వు' ప్రత్యయము చేరగా బిగువు, మనువు, శబ్దములు నిష్పన్నమైనవి. 'బిగియు'లో 'యు' లోపించి వకార సాహచర్యమువలన ఇకార ముత్వమును పొందినది. కన్నడములో బిగవు, బిగింపు శబ్దము లీ యర్థ మందున్నవి. 'మనువు' శబ్దనిష్పాదనలో విశేషమేమియు లేదు.

'తనియు' ధాతువునకు మూ.ద.ద్రా. ధాతురూపము 'తణ్'. కన్నడములో తణి, తుళులో తణియుని, తమిళములో తణి అను ధాతురూపములు దీనికి సమానార్థములో కలవు.

కన్నడములో 'తణివు' శబ్దము కలదు. దాని సామ్యము వలన తెలుగులో 'తనివు' శబ్ద మేర్పడియుండును.

"తనివు మొదలైనఁ జగరొత్తు తమకమునకు" అని విరాటపర్వములో ప్రయోగము కలదు. (విరా. 2- 310)

దీని రూపాంతరమగు తనివి శబ్దము కూడ తిక్కనచే ప్రయుక్తమైనది.

'నిలుచు' ధాతు మూలరూపమైన 'నిల్' అను దానిపై న 'వు' ప్రత్యయము చేరి స్వరాగమముతో ఉకారము చేరగా 'నిలువు' శబ్దమేర్పడెనని సజాతీయ భాషా పరిశీలనవలన తెల్లమగును.

"ముదమొదవ రమ్యహర్మ్యము
తుది నిలువునఁ బ్రణయ నఖులతోఁడ"[79]- అని అంతస్తు అను నర్థములో 'నిలువు' శబ్దము ప్రయుక్తమైనది.

వు :-

కృత్తులలో ఎక్కువ రూపములలో కన్పించు ప్రత్యయము 'వు' అనునది' తిక్కన భాగములో గోచరించు 'వు' ప్రత్యయాంతరూపములు ముప్పదిరెండు కలవు.

1. అదలువు, ల్వు
2. అఱవు
3. అలవు
4. ఎలర్వు
5. ఒడువు
6. కలువు
7. కానువు, కాన్వు
8. కినువు
9. కుదువు
10. కూర్వు
11. గెలువు, గెల్వు
12. తన్వు
13. తదువు
14. తలిర్వు
15. తెంవు
16. తెలువు, తెల్వు
17. తోఁవు
18. నడవులు
19. పన్వు
20. పలువు
21. పరవు
22. పొదువు
23. బలువు
24. మనువు
25. మావు
26. మెల్వు
27. మేవు
28. వంవు
29. వగర్వు
30. వలవు
31. విద్వు
32. వెదలువు

---

79. విరా. 1-301.

అదల్పు ధాతువుపై 'పు' ప్రత్యయము చేరి, ధాతువు తుది వర్ణము లోపింపగా అదల్పు, అదలుపు అను రెండు రూపము లేర్పడినవి వీనిలో అదలుపు శబ్దము ఒక్క చోటనే ప్రయోగింపబడగా 'అదల్పు' శబ్దము బహుప్రయోగములందు కాన్పించును. 'అదల్పు' తొలిరూపము కాగా, దానికి స్వరభక్తివలన ఉకార మాగమమై 'అదలుపు' అని తరువాత కల్గిన రూపము కావచ్చును.

'అణుచు' ధాతువువలన 'అణపు, 'అలయు' వలన 'అలపు, 'ఎలర్పు, ఒడియు' ధాతువులనుండి ఎలర్పు, ఒడుపు అను శబ్దములు 'పు' ప్రత్యయాంతములుగా నిష్పన్నమైనవి.

అలపు శబ్దమునకు తమిళములో 'అలుప్పు', మలయాళములో 'అలుప్పు, అలంపు', కన్నడములో 'అలవు' 'అలువు' అని సమానరూపములున్నవి. 'అలయు' ధాతువునకు ద్రావిడ మూల ప్రకృతి 'అల్' అనునది. దానిపై 'పు' ప్రత్యయముచేరి అకార ముచ్చారణ సౌకర్యమునకు రాగా 'అలపు' రూపము కలిగినది. 'అలయు' ధాతువుపై 'పు' ప్రత్యయమని వ్యాకరణకారుల ప్రతిపాదనము.

ఒడియు ధాతువులో చివరి వర్ణము లోపించి ప్రత్యయోకార సాహచర్యము వలన పూర్వాచ్చు ఉకారమై 'ఒడుపు' శబ్దము నిష్పన్నమైనది.

'ఓపు' అనునది ధాతురూపములో, నామరూపములో కూడ కనబడుచున్నది. కాని సోదర ద్రావిడభాషలను చూచినప్పుడు 'ఓయ్, ఒయ్యు' అని కన్నడములోను, 'ఉయ్' అని తమిళములోను, 'ఓయ్, ఓయా', అని గోండీభాషలోను ధాతురూపములు కనబడుచున్నవి. అందువలన 'ఓయ్' అను మూల ధాతువు మీద 'పు' ప్రత్యయము చేరి యకారము లోపించగా 'ఓపు' అను నామము నిష్పన్నమై యుండును. అనంతరకాలములో ప్రత్యయము ధాత్వవయవముగా భావింపబడి దానిపై మరల ప్రత్యయములు చేరినవని తలవవలెను (ఓపమి, ఓపిక మొ ).

కినుపు శబ్దము 'కినియు' ధాతువునుండి పుట్టినది. తమిళ, మలయాళాది ద్రావిడభాషలలో తాలవ్యీకరణము చెందిన చకారాది రూపములు చిన, చినమ్ వంటి

రూపము లీయర్థములో ఉండగా, తెలుగులో తాలవ్యీకరణము చెందని రూపములు నిలిచి యుండుట ప్రత్యేకతగా పేర్కొన వచ్చును.

'కినుపు' శబ్దమును తిక్కన ప్రయోగించినట్లు T. V. B. లో స్పష్టంగా ప్రవర్తితమైనది.[80]

'కుడుచు' ధాతువుపై 'పు' ప్రత్యయము చేరి 'కుడుపు' శబ్దము జనించిన దని వ్యాకరణ ప్రతిపాదనము. 'కుడుపు' అనగా అనుభవించుట, భుజించుట, భోజనము, జీవిక అను నర్థములున్నవి. "నిలిచియుండి కుడువు నింద్యము[81]" కొంచెమైనను దగఁ బంచి కుడువు మేలు"[82] అను ప్రయోగములు క్రమముగా భుజించుట, అనుభవించుట అను నర్థములను తెలుపుచున్నది.

మూ. ద్రా.లో ధాతువు 'కుట్' అనునది. దీనినుండి వచ్చిన సోదర ద్రావిడ భాషల ధాతువులన్నియు త్రాగుట అను నర్థమును బోధించుచుండగా, తెలుగులో మాత్రము "తినుట" అను నర్థము బోధింపబడుట అసాధారణ విషయము.

కన్నడ—కుడి
తుళు—కుడ్పుని
కొడగు—కుడి
తమి—కుడి
మల—కుడిక్క

ఇవన్నియు త్రాగుక్రియను బోధించునవే.

తెలుగులో కూడ 'కుడితి' అను శబ్దములో ఈ ధాతువు పానార్థమును తెలుపుట గమనార్హము. 'కూర్పు' ధాతువునుండి 'కూర్పు' శబ్దము నిష్పన్నమగును. 'కూడు' ధాతువు ప్రేరణార్థక రూపము 'కూర్పు' అనునది. కూడునట్లు చేయుట అని దాని

80. T.V B.p. 830    81. అను. 4. 99    82. ఉద్యో. 2. 47.

కర్మము. 'కూర్' అను ధాతుభాగముపై 'పు' చేరగా 'కూర్పు' శబ్దము కలిగినదని తుల నాత్మక పరిశీలనవలన తేలుచున్నది.

'గెలుచు' ధాతువుపై 'పు' ప్రత్యయమువచ్చి, ధాతువులోని 'చు' లోపింపగా 'గెలుపు' శబ్దము నిష్పన్న మగును. దీనికి గెల్పు' అను రూపాంతరము కూడ కలదు. తిక్కన ఈ రెండింటిని ప్రయోగించినాడు.

మూ. ద్రా.లో 'గెలుచు' ధాతువు ప్రకృతి 'గెల్' అనునది. దానిమీదనే 'పు' చేరి మొదట గెల్పు అను రూపము, తరువాత స్వరభక్తివలన ఉకార మాగమమై 'గెలుపు' శబ్దము జనించినదని చెప్పదగియున్నది.

'తన్పు' అనగా తృప్తి, పితృతర్పణము, చల్లదనము, తడి, సంతోషము అను నర్థము లున్నవి. ఇది 'తనియు' ధాతువుపై 'పు' ప్రత్యయము చేరగా ఏర్పడెనని వ్యాకరణదీపికలో చెప్పబడినది.

'తనియు'నకు మూ.ద్రా. ధాతువు 'తణ్'అనునది. దానిపై 'పు'ప్రత్యయముచేరి 'తన్పు' రూప మేర్పడినది. తరువాత ఉకారముచేరి 'తనపు' అను రూపాంతరము కూడ కలిగినది. తడి శబ్దమునకు దీనికి సంబంధమున్నదని T.V.B. సూచించినది.[83] (376)

తిక్కన 'తన్పు' శబ్దమునొక్కచోటనే ప్రయోగించినాడు.[84] సందర్భమును బట్టి ఆ ప్రయోగమునకు చల్లదనమను నర్థమే సరిపోవును.

'తనుపు' శబ్దమును కూడ తిక్కన శైత్యార్థములోనే మరొకచోట ప్రయోగించినాడు.[85]

'తడుపు' శబ్దమునకు వస్త్రమునకు వస్త్ర మను, నర్థముకూడ కలదు. ఇది తడియు ధాతువునుండి 'పు' ప్రత్యయము చేరగా కలిగినరూపము.

తిక్కన వస్త్ర మను అర్థములోనే 'తడుపు' శబ్దమును ప్రయోగించినాడు.[86]

---

83. T.V B. p. 376
84. శాంతి. 2. 126
85. ఉద్యో. 1. 98
86. శల్య. 2. 160

'తట్' అను మూ. ద్రా. ధాతువుపై ఉకారముచేరి దానిపై 'వు' ప్రత్యయమువచ్చి 'తడువు' రూపము కల్గియుండును.

'తలిర్చు' ధాతువు వలన 'తలిర్పు', 'త్రెంచు' నుండి త్రెంపు, తెలియు నుండి 'తెలుపు' అను శబ్దములు 'వు' ప్రత్యయాంతములుగా జనించినవి. అట్లే 'త్రోచు' నుండి 'తో(పు' శబ్దము, 'నడచు' ధాతువునుండి 'నడవు' శబ్దము నిష్పన్నమైనవి.

'పఱపు, పరువు' అను రెండు రూపములను తిక్కన ప్రయోగించినాడు' 'పఱచు' ధాతువు మీద 'వు' చేరి 'పఱపు' శబ్ద మేర్పడినది. వైశాల్యము, వ్యాప్తి దీని కర్థములు.

'పొడచు' ధాతువుపై 'వు' ప్రత్యయము చేరుటవలన 'పొడుపు' శబ్ద మేర్పడును. దీనికి ఉదయము, పొడసూపుట అను నర్థము లున్నవి.

—o—

# తిక్కన వాడిన తద్ధిత ప్రత్యయములు

—

తిక్కన తన భారతభాగములో తద్ధిత రూపముల నత్యధికముగా ప్రయోగించినాడు. తద్ధిత ప్రత్యయములు కూడ నన్నయభాగములోకంటె ఈయన రచనలోనే ఎక్కువగా కన్పించును. తిక్కన ప్రయోగించిన తద్ధిత ప్రత్యయములు—

ఇవి :-

| | |
|---|---|
| 1. అ. | 14. కత్తియ |
| 2. అద | 15. కాఁడు |
| 3. అడి | 16. టిమి |
| 4. అరి | 17. త |
| 5. అసి | 18. తన |
| 6. ఇ | 19. న |
| 7. ఇక | 20. పాటు |
| 8. ఇఁడి | 21. పోతు |
| 9. ఇద | 22. మడి |
| 10. ఇమి | 23. టిక |
| 11. ఈ | 24. ఱిమి |
| 12 ఉక | 25. వ |
| 13. ఎఁడు | 26. సేవ |

వీనిలో ఆంధ్ర లాక్షణికులు చెప్పినవి కొన్ని, వారు పేర్కొననివి కూడ కొన్ని ఉన్నవి.

1. అ:—

1. మత్వర్థకమైన 'అ' ప్రత్యయాంతము 'చెల్వ' శబ్దమును తిక్కన ప్రయోగించినాడు. సౌందర్యార్థకమైన చెల్వు శబ్దము మత్వర్థములో 'అ' ప్రత్యయము

చేరి ఉకార సంధివలన 'చెల్వ' అను రూపము కల్గును. దీనికి సమానార్థకమగు 'చెలువ' శబ్దమును' నన్నయ ప్రయోగించినాడు. 'చెలువు' శబ్దములోని మధ్య స్వరము లోపించుట వలన 'చెల్వు' శబ్దము జనించినది. 'అ' ప్రత్యయాంతముగా చెప్పదగిన తద్ధితాంతమును క్రొత్తగా తిక్కన ప్రయోగించిన రూప మిది ఒక్కటే.

తమిళములో 'శెల్వి' అను పదము సంపద గల స్త్రీ, లక్ష్మి అను అర్థ ములలో ఉన్నది. కన్నడములో 'చెల్వి', 'చెల్వె', 'చల్వి' అనునవి 'సుందరస్త్రీ' అను అర్థమును బోధించును. తమిళ మళయాళ భాషలలో వరుసగా 'శెల్వమ్' 'చెల్లమ్' అను పదాలకు 'సంపద' అని యర్థము.

2. అద :-

'అది' ప్రత్యయముతో 'ఇల్లదము' అను ప్రయోగమొక్కటి కన్పించు చున్నది. నన్నయ దానిని 'ఇల్లద' అని ప్రయోగించినాడు. ఇక్కడ 'ము' ప్రత్య యము చేరుట విశేషము. ఇల్లద శబ్దవ్యుత్పత్తిని గూర్చి పూర్వప్రకరణములో చర్చించి ఉన్నాను.

3. అడి :-

'సందిడి', 'ఉలవడి' అను రెండు శబ్దములలో అడిప్రత్యయము కనబడు చున్నది. సందు శబ్దముపై అభావార్థములో 'అడి' ప్రత్యయము చేరుటవలన 'సందడి' శబ్దమేర్పడినది. 'సందులేనిది' 'అవకాశము లేనిది' అను వ్యుత్పత్తిలో జనసమ్మర్ద వాచకముగా మొదటవుట్టిన యీ పదము, తరువాత జనసమూహధ్వని, 'అతిశయము' అను అర్థములకు బోధకమైనది.

సూత్రాంధ్రవ్యాకరణములో చిన్నయసూరి, "సందోఽడిః" "వ్యతిరేకే ఇతివర్తతే"[87] అని సూత్రించి సందడి శబ్దమునకు వ్యుత్పత్తిని తెల్పినాడు. కాని బాల వ్యాకరణములో దీని ప్రస్తావన లేదు.

---

87. సూత్రాంధ్రవ్యాకరణము. తద్ధిత. 41.

D. E D.లో, దాని అనుబంధములో గూడ సందడి శబ్దము చూపబడలేదు. సంస్కృతమునకు చెందిన 'శబ్ద' శబ్దమునుండి 'సద్దు' అనునది తద్భవముగా ఏర్పడి నది. ఆ 'సద్దు' శబ్దముతో దీని కేమైన సంబంధముండి యుండునవి, 'సవ్వడి' శబ్దము సామ్యముతో 'సందడి' అనునది ఉత్పన్నమై యుండునని ఊహింపవచ్చును. వెల్లడి శబ్దములోవలె దీనిలో కూడ 'అడి' ప్రత్యయము స్వార్థమునే బోధించుచున్నదనుట సముచితము. సూర్యాస్తమయవర్ణనలో 'సందడుల్ దక్కఁ బురంబు వీధులు" (వి-2-819) అని తిక్కన ప్రయోగము.

'ఉలవడి' శబ్దము ఉరవడి యొక్క రూపాంతరము, 'ఉలవు + వడి = 'ఉలవడి' అని సూర్యరాయ నిఘంటువు తెలిపినది. తిక్కన 'ఉరవడి' అను సాధు రేఫ ఘటిత శబ్దమును గూడ ప్రయోగించినాడు. ఎఱ్ఱన 'ఉలవడి', 'ఉరువడి' అను రెండు రూపములను వాడినాడు. ఎఱ్ఱన భోగమును గూర్చిన ప్రకరణములో దాని వ్యుత్పత్తిని గూర్చి చర్చింపబడినది.

4. అరి :-

'అరి' ప్రత్యయాంతములను తిక్కన 12టిని నూతనముగా ప్రయోగించి నాడు అవి—

| | |
|---|---|
| అనువరి | నేర్పరి |
| కలమరి | పెనుపరి |
| కాలరి | పోటరి |
| చొప్పరి | బొంకరి |
| జూదరి | మతకరి |
| తెరువరి | వెరవరి |

పై శబ్దములలో కొన్నిటికి మత్వర్థములోను, మరికొన్నిటికి తాచ్ఛీల్యార్థము లోను 'అరి' ప్రత్యయము చేరినది.

'అనువు' శబ్దముపై 'అరి' ప్రత్యయముచేరి అనువరి శబ్దమేర్పడినది. అనువు శబ్దమునకు పద్ధతి, ఉపాయము, సామర్థ్యము, అనుకూలము, వశము మొదలగు

నర్థములున్నవి. తిక్కన ఆ యా అర్థములందు అనువు శబ్దమును ప్రయోగించినాడు కూడ.

'అనువరి' శబ్దమునుమాత్ర మొక్కచోటనే ఈతడు ప్రయోగించినాడు.

"......నయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁడెవ్వఁ డింద నువరి యెవ్వఁడంచు నచలాకృతులై నెఱి నూఱకుండఁగన్"[88] అని ఉపాయశాలి అను అర్థములోనే పై ప్రయోగము లభించుచున్నది. ఇతరార్థములలో 'అనువు' శబ్దముపై 'అరి' ప్రత్యయము చేరిన రూపముల నీతడు వాడలేదు.

'కాలరి' శబ్దమునకు— పదాతి, కాలిబంటు, వార్తాహరుడు, దూత అను నర్థములున్నవి. 'కాలు' శబ్దము మీద మత్వర్థములో 'అరి' ప్రత్యయము చేరి ఈ శబ్దము నిష్పన్నమైనది. కాలుకలవాడు అనగా యుద్ధరంగంలో కాని, దూరిగా వెళ్ళుటకు గాని, 'కాలు' ప్రధాన సాధనముగా కలవాడు, ఇతర వాహనములు లేని వాడని యర్థము.

తిక్కన 'కాలరి' శబ్దమును 'దూత' అను నర్థములోనే ప్రయోగించినాడు

"మనము వెనగల కాలరుల వేగంబుచ్చి శల్య, కేకయ, జరాసంధతనయ, దుష్టకేతుప్రభృతులయిన భూపతులకును......నెఱిగించుట కార్యంబు"[89]

'చొప్పు' శబ్దముపై 'అరి' ప్రత్యయముచేరగా "చొప్పరి" రూపము కలిగి నది. "చొప్పు" శబ్దమునకు మార్గము, పద్ధతి, పోలిక, జాడ, చిహ్నము, ధర్మము, అందము మొదలగు నానార్థము లున్నవి.

సీ పూజానమస్కారములకుఁ బాత్రములు................

...................................................................

అమ్మహాత్ములు చొప్పరుల ఖిలమార్గములకు"[90] అను ప్రయోగములో జాడ నెరిగినవారు అను నర్థము గోచరించుచున్నది.

---

88. ఉద్యోగ. 3-285 89. ఉద్యోగ. 1-37 90. అను. 5. 336

'జూదరి' శబ్దము 'జూదము' అను శబ్దముపై 'అరి' ప్రత్యయముచేరి యేర్పడి నది. సంస్కృతద్యూతశబ్దభవము 'జూద' శబ్దము. మత్వర్థకమైన 'అరి' ప్రత్యయమిక్కడ తాచ్ఛీల్యార్థకముగా మారినది. జూదమాడుట స్వభావముగా కలవాడు అను నర్థము నీ శబ్దము బోధించుచున్నది.

'కలమరి' శబ్దము కలము శబ్దముపై 'అరి' ప్రత్యయముచేరగా ఏర్పడినది. కలము శబ్దము దేశ్యము, 'ఓడ'దాని యర్థము. 'కలమరి' అనగా ఓడ కలవాడు-ఓడను నడుపువాడు, లేక ఓడపై ప్రయాణముచేయువాడు అని యర్థము. దీనిని కూడ తిక్కన శాంతిపర్వములో ఒక్కచోటనే ప్రయోగించాడు.

"రథికునకుఁ గలమరికి సారథియు గర్ణధారుడును బోలె"[91] అను పద్యములో 'కలమరి' శబ్దము ఓడపై ప్రయాణము చేయువానిని బోధించుచున్నది. తెరువు శబ్దముపై 'అరి' ప్రత్యయముచేయగా 'తెరువరి'శబ్దము నిష్పన్నమైనది. తెరువు కలవాడు అనగా మార్గములో ప్రయాణముచేయువాడు- 'బాటసారి' అను నర్థమును బోధించును.

నేర్పరి శబ్దము నేర్పు శబ్దముపై 'అరి' ప్రత్యయముచేరి యేర్పడినది.' నేర్పు కలవాడు' అని మత్వర్థమును బోధించుచున్నది. 'నేర్పు'నకు రూపాంతరమైన 'నేరుపు' శబ్దమును తిక్కన ప్రయోగించినప్పటికి, 'నేరుపరి' అను ప్రయోగము నాతడు చేయలేదు.

'పెనుపు' శబ్దముమీద 'అరి' ప్రత్యయమువచ్చి 'పెనుపరి' రూపము కలిగి నది. పెనుపుకలవాడు-వృద్ధికలిగించువాడు అని పైశబ్దమున కర్థము కలుగుచున్నది. తిక్కన, పెనుపరి శబ్దము నొక్కచోటనే ప్రయోగించినాడు. ఆ ప్రయోగ మిది—

"హరి పలికిన విధ మెంతయు
నెరవై యున్నయది వింటె యిమ్మాట తెఱం
గరయుదము తొలుత నా పెను
పరిచందంబెల్ల నెఱుకపడియెడుఁ బిదపన్"[92]

---

91. శాంతి. 5-588 92. ఉద్యోగ. 3-24

దుర్యోధనుడు కృష్ణరాయబారసందర్భములో కర్ణునితో పలికిన ఈ పద్యములో సంద ర్భమునుబట్టి 'పెనువరి' శబ్దమునకు వృద్ధి (మేలు) కలిగించువాడని అర్థము స్ఫురించు చున్నది.

'పోటరి' శబ్దము శూరుడు, యోధుడు అను నర్థములను బోధించును. పొడుచు' ధాతుజన్యమైన పోటుశబ్దముపై 'అరి' ప్రత్యయముచేరగా ఈ శబ్దము నిష్పన్నమైనది. ఈ శబ్దమును బహువచనాంతముగా రెండుచోట్లను, 'తన' ప్రత్య యాంతముగా ఒక్కచోటను తిక్కన వాడినాడు.

"విరటుఁడు చూచుచుండ... ................

..........పోటరులైన భర్తలే

వురు గలరంటి"[93]... అను పద్యములో 'పోటరులు' శబ్దము శూరు లను నర్థమును తెలుపుచున్నది. 'పోటు' శబ్దమునకు శౌర్యము, యుద్ధము మొదలగు నర్థములున్నవి శౌర్యార్థకమైన శబ్దముమీద మత్వర్థములో 'అరి' ప్రత్యయము చేరగా శూరు డను నర్థమును బోధించుచున్నది.

'బొంకు' శబ్దము 'అరి' ప్రత్యయముతోగూడి 'బొంకరి' రూపమేర్పడి నది. బొంకు అనునది ధాతువుగాను, క్రియానామముగాను వ్యవహారములో నున్నది. బొంకుకలవాడు- అసత్యము మాట్లాడుట స్వభావముగా కలవాడు అని తాచ్ఛీల్యార్థక ముగా పరిణమించింది. 'బొంకరి' శబ్దమును తిక్కన రెండుచోట్ల ప్రయోగించినాడు.

'మతకము' అను పదము దేశ్యము. దానికి మాయ, కపటము అను నర్థము లున్నవి. దానిపై మత్వర్థములో 'అరి' ప్రత్యయముచేయగా 'మతకరి' శబ్దము నిష్పన్న మైనది, మాయలమారి, కపటముగలవాడు అని ఈ శబ్దమున కర్థము. ఇది ఒక్క ప్రయోగము మాత్రమే తిక్కన రచనలో కనబడుచున్నది. అక్కడకూడ పాఠాంతర మున్నది.

---

93. విరాట. 2.257

"వార లెఱుంగకుండ నవరకుమారుల కరకు
నేగి మతకరి (ఋతకరి) మాటల మొత్తింబుల"[94]

ఉపాయార్థకమైన 'వెరవు' శబ్దముపై 'అరి' ప్రత్యయము చేరగా 'వెరవరి' పదము నిష్పన్నమగును. 'ఉపాయశాలి' అని దాని కర్థము.

5. అసి :-

'అసి' ప్రత్యయముకూడ మత్వర్థములోనే కనబడుచున్నది. ఒక్క 'రూపసి' శబ్దములోనే ఈ ప్రత్యయము ప్రయుక్తము. తిక్కన ఈ పదమును నాల్గుచోట్ల వాడినాడు. రూపు శబ్దము సంస్కృత 'రూప' శబ్దభవము. రూపసి శబ్దమును ఎఱ్ఱనకూడ ప్రయోగించినాడు

6. ఇ :-

'ఇ' ప్రత్యయాంతములు- కదలి, తమకి అను రెండు ప్రయోగములు తిక్కనలో కలవు. కదలి శబ్దమును నన్నయ బహువచనరూపములో మాత్రము ప్రయోగించగా, తిక్కన సమాసగతముగా మాత్రమే రెండుచోట్ల వాడినాడు. వానిలో—

"పాలకదలి కడలపాటియై యొప్పు న
ప్పాన్పునందు శౌరి పవ్వళించె"[95] అనున దొకటి. కదలి శబ్దమును వ్యస్త పదముగా తిక్కన ప్రయోగించలేదు.

'తమకి' అను ఇప్రత్యయాంతరూపమును తిక్కన వాడినాడు. మోహము, కోరిక, త్వర అను నర్థములుగల 'తమకము' శబ్దముపై మత్వర్థములో 'ఇ'ప్రత్యయము చేరి 'తమకి' రూప మేర్పడినది. మోహము కలవాడు, త్వరకలవాడు అను వాచ్యార్థములను ఇది బోధించును. శాంతిపర్వములో ఒక్క ప్రయోగము మాత్రము దీనికి కలదు.

"పతి ధరణీప్రజమునికి కిందగ నడచునని
తమకి గాకెపుడున్"[96]—అను ప్రయోగములో త్వరకలవాడు కాక అని యర్థము చెప్పిన సరిపోవును.

---

94. అను. 1-297 (ఇతకరి)  95. ఉద్యోగ. 3-244  96. శాంతి. 2-179

7. ఇక :-

'అగ్గల' శబ్దముపై 'ఇక' ప్రత్యయముచేరగా 'అగ్గలిక' రూపము నిష్పన్న మైనది. దీనిని 'ము' ప్రత్యయాంతముగాకూడ తిక్కన వాడినాడు.

"చతురంగబలం మతిసాంద్రతఁ గవిసిన
యగ్గలికమునకు బెగ్గడిలక"[97]

"అనిన నట్లుగాక యని సర్వసేనాధి
పత్యభార పట్టబంధమునకు
నియ్యకొనియె భీష్ము డయ్యగ్గలికఁ గొనియాడె విభుడు"[98] —అను

పద్యములో ముప్రత్యయరహితముగా ప్రయోగింపబడినది.

అగ్గలిక శబ్దమునకు-ఆధిక్యము, అతిశయము, విజృంభణము, పూనిక-అను నర్థము లున్నవి. పై లక్ష్యములలో మొదటిదానిలో 'విజృంభణము', రెండవ దానిలో 'పూనిక' అని అర్థములు చెప్పదగును.

'ఉమ్మలిక' శబ్దముకూడ ఇక ప్రత్యయాంతరూపమే. ఉమ్మల శబ్దముపై 'ఇక' ప్రత్యయము చేరుటవలన 'ఉమ్మలికము' అను రూప మేర్పడును.

8. ఇఁడి :-

'కట్టిఁడి' శబ్దమును సంస్కృత కటుశబ్దజన్యముగా D.E.D.లో చూపినారు. (1962)

తమిళములో 'కటుప్పు' (ధాతువు) కొట్టు, నొప్పించు అను నర్థములను బోధించుచున్నది. కటు శబ్దభవమైన 'కటుకు' శబ్ద మీ భాషలో ఉన్నది. సంస్కృత కటు శబ్దమునకు కారము, కఠినమైనది మొదలగు నర్థములున్నవి.

కడు, కడిఁది, కట్టిఁడి శబ్దములకు D E D. ఒకే ఆరోపములో చూపించుట నహేతుకముగా లేదు. 961 సం కల ఆరోపములో 'కట్టు' శబ్దము తెలుగు, కన్నడ భాషలలో నియమము, కట్టుబాటు అను నర్థములకు బోధకముగా ఉన్నది. 'కట్టద' శబ్దముకూడ పై అర్థములలోనే కాన్పించును. అందువలన 'కట్టు' శబ్దముమీద వ్యతి

97. విరా. 4-62 98. భా. తద్ధిత. 7

రేకార్థములో 'ఇఁడి' ప్రత్యయము చేరి 'కట్టిఁడి' శబ్దము నిష్పన్నమైనదని తలచుటే భాషాశాస్త్రపద్ధతిలో కూడ సమంజసము. 'కట్టిడి' అను బిందురహితరూప మెక్కడను కన్పించదు.

"వీఱిఁడి" శబ్దమునకు అవివేకి, వెఱ్ఱివాడు అను నర్థము లున్నవి. తిక్కన ఈ శబ్దమును విరివిగానే ప్రయోగించినాడు.

"పృథివీపతి వీఱిఁడి జేయు టొప్పునే"[99]
"వీఱిఁడియైన మానిసికి వెండి వివేకము
కల్గనేర్చునే"[100] మొదలగు ప్రయోగములలో "అవివేకి" అను నర్థమే సూచితమగుచున్నది.

శబ్దరత్నాకరము 'వేఱిఁడి' రూపము సాధువని తెలిపినది. బాలవ్యాకరణోద్ద్యోతములో వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రికూడ ఆ రూపమునే సమర్థించినారు. "వీఱు" అను నామము లేదు కనుక 'వీఱిఁడి' రూపము అసాధువని వా రభిప్రాయపడిరి.

సూర్యరాయాంధ్ర నిఘంటువులో 'వీఱిఁడి, వేఱిఁడి' అను రెండు రూపములను చూపినారు.

D E.D. అనుబంధ సంచికలో 'వీఱిఁడి, వేఱిఁడి' శబ్దములు చూపబడినవి. కొండభాషలో 'వెఱి' శబ్దము పిచ్చివానికి బోధకము. 'బ్రాహూయి'లో బిఱ్, బిఱ్ఱీ శబ్దములు కనబడుచున్నవి. వాటికి సిగ్గుగలది, మచ్చికపడనిది, సాగుచేయని నేల అను నర్థములున్నవి. వకార బకారములు పరస్పరము మారుట ఈ భాషలలో సహజము కనుక 'బిఱ్ఱీ' శబ్దము "వీఱిఁడి" శబ్దమునకు సన్నిహితముగా ఉన్నట్లు తోచును.

మూలద్రావిడములోని 'వెఱ్' అను ధాతువునుండి వెఱ్ఱి, వెఱపు, వెఱగు వంటి శబ్దము లన్నియు జనించినవి. తమిళములో 'విఱుంత్' అను ధాతువు భయపడుటను, 'విఱుప్పు' అను నామము భయమును తెలుపుచున్నవి.

---

99. విరాట. 4-200  100. ఉద్యో. 8-107

వెట్టి మొదలగు శబ్దములకు మూలమైన ధాతువు ఇకారముతో కూడి ఉండును. దానినుండి ఏర్పడిన ప్రాచీనరూపము 'వీఁటిఁడి' అనునది; నన్నెచోడుడు మొదలగు కవుల ప్రయోగములలో నిలిచినది. తెలుగులో దాని క్రియారూపముకాని, ఇకారముతో కూడిన ఇతర రూపములు కాని కనిపించవు. 'వీఁటిఁడి' శబ్దమునకు రూపాంతరము "వేఁటిఁడి" అను దానిని నిఘంటుకారులు చూపినారు. అచ్చతెనుగు రామాయణములోని ఒక ప్రయోగము కూడ చూపబడినది.

"అడవిఁ గూరలు.......
తగులఁగట్టిన వేఁటిఁడి తమ్మిచూలి." (అర-80)

మొత్తముమీద 'వీఁటిఁడి' శబ్దవ్యుత్పత్తిని నిశ్చితముగ అసందిగ్ధముగ తెలుపుటకు తగిన ఉపపత్తులు లభించలేదు.

వెరవు శబ్దము మీద "ఇఁడి" ప్రత్యయము చేరుటవలన వెరవిఁడి శబ్దము నిష్పన్నమైనది. వెరవు అనగా- ఉపాయము, విధము, యుక్తము మొదలగు నర్థము లున్నవి. 'వెరవిఁడి' అనగా ఉపాయహీనము, యుక్తముకానిది అను నర్థములు కలవు. తిక్కన ఈ శబ్దమును అయిదుచోట్ల ప్రయోగించినాడు. విరాటపర్వములోని రెండు ప్రయోగములకు వీఁటిఁడి, వెరవరి అను పాఠాంతరము లున్నవి.

"అరయక సభలోన నత్తోయజాక్షి" అను పద్యములో "వెరవిడి వే లేగ విడువుము" అను ప్రయోగము నిర్బిందుకముగా నున్నది.

"వెరవిడి" శబ్దము నిర్బిందుకముగా నిఘంటువులలో చూపబడలేదు. దానికి అర్థము కూడ పై సందర్భములో పొసగదు. అందువలన బిందురహిత ప్రయోగము ప్రామాదికమని చెప్పుటకాని, వెరవు, ఇడి అని వ్యస్తపదములుగా గ్రహించుటకాని సముచితము.

9. ఇద:—

'ఇద' ప్రత్యయాంత రూపములు నాల్గింటిని తిక్కన ప్రయోగించినాడు. అవి—

క్రొవ్విదము
తప్పిదము

పెల్లిదము
బెట్టిదము

క్రొవ్వు, తప్పు, పెల్లు, బెట్టు అను శబ్దములపై స్వార్థములో 'ఇద' ప్రత్యయము చేరి పై రూపము లేర్పడినవి.

వీటిలో మొదటి రెండు ధాతురూపములో, నామరూపములో కూడా ఉన్నవి. కాని పెల్లు, బెట్టు అనునవి ధాతురూపములో లేవు అందువలన వాటిపై చేరు 'ఇద' ప్రత్యయము తద్ధితమనుటలో విప్రతిపత్తి లేదు. 'క్రొవ్వు', తప్పులపై వచ్చినది కృత్తనికాని తద్ధితమని కాని చెప్పవచ్చును. ఒప్పు తప్పు పెల్లులకు ఇదవర్ణకము స్వార్థములో వచ్చునని తద్ధితముగానే పేర్కొన్నాడు. బెట్టు క్రొవ్వులకు మతుబర్థములో వచ్చునని కూడ అచటనే చెప్పినాడు.[101]

పన్నిదము పంది శబ్దములను సాధించుటకు కృత్తులలో 'ఇద' ప్రత్యయము నంగీకరింపక తప్పదు.

తిక్కన 'క్రొవ్విదము'ను ఒక్క చోటనే ప్రయోగించినాడు.

"అలుబిడ్డలు లేని యట్టి త్రిమ్మరియగు ... ...
... ... కుడుచు వారలిట్ట క్రొవ్విదంబులు[102] సేయ"

అను నీ పద్యములో దుష్కార్యములను నర్థములో ఈ శబ్దము ప్రయుక్తము. క్రొవ్వు ధాతువునకు-మదించు, బలియు, వాడియగు అను నర్థము లున్నవి.

అతిశయార్థకమైన 'పెల్లు' పదముపై స్వార్థములో 'ఇద' ప్రత్యయము చేరగా 'పెల్లిదము' అను శబ్దము నిష్పన్నమైనది.

"ఒదవెదు తృష పెల్లిదమున
వదనము వఱువట్లు పట్టె"[103]- అని తిక్కన ఒక్క ప్రయోగములోనే దీని నుపయోగించినాడు.

---

101. ప్రౌఢ-తద్ధిత 10
103. విరా. 2-38

10. ఇమి:—

'మేలిమి, ప్రముచ్చిమి, వాఁడిమి' అను మూడు శబ్దములు 'ఇమి' ప్రత్యయాంతములుగా తిక్కన భాగములో గోచరించును. క్రమముగా మేలు, ప్రముచ్చు, వాఁడి అను శబ్దములపై భావార్థములలో 'ఇమి' ప్రత్యయము చేరగా పై శబ్దములు నిష్పన్నములైనవి. "పేర్వాదులకు"[104] ఇమి వర్ణకము వచ్చునని చెప్పి చిన్నయసూరి పేర్వాదులలో "మేలు, ప్రముచ్చు, వాఁడి" శబ్దములను ప్రదర్శించినాడు.

11. ఈ:—

మత్వర్థములో 'ఈ' ప్రత్యయ మొకటి కలదు. బాలవ్యాకరణము "అట, మటాదులకు మతుబర్థములో 'ఈ' వర్ణకమును చెప్పినది.[105] "బానసీఁడు", "ఉక్కీఁడు" అను రెండు శబ్దములు 'ఈ' ప్రత్యయాంతములుగా తిక్కన రచనలో లభించుచున్నవి. "బానసము" "ఉక్కివము" శబ్దములను అటమటాదులలో చేర్చి, ఉక్కివంబునకు వ కారలోపంబు కూడ కలుగునని చెప్పబడినది. బానసమనగా వంటసాల. అది కలవాడు అనగా వంటలవాడు అని యర్థము. ఉక్కివమనగా కపటము, అది కలవాడు ఉక్కీఁడు. దీనికి ఉక్కివుండను రూపాంతరము కూడ కలదు.

12: ఉక:—

'ఉక' ప్రత్యయము స్వార్థములో చేరు తద్ధితము. దీనితో కూడిన రూపములను నాల్గింటిని తిక్కన ప్రయోగించినాడు.

పొలఁతుక, పడఁతుక, నెలఁతుక, మెలఁతుక. పొలఁతి, వడఁతి, నెలఁత, మెలఁత అను స్త్రీ వాచక శబ్దములమీద స్వార్థములో 'ఉక' ప్రత్యయము చేరి పొలతి + ఉక = పొలఁతుక మొదలగు విధముగా పై రూపములు కలిగినవి.

వీనితో మొదటి రెండు ఇకారాంతరములు కాగా తక్కినవి అకారాంతరములు.

'ఎముక' శబ్దముకూడ ఈ వర్గమునకు చెందినదని చెప్పదగును. 'ఎమ్మ' అను పదముపై స్వార్థములో 'ఉక' ప్రత్యయము రాగా మకార ద్విత్వము తొలగి 'ఎముక' శబ్దము నిష్పన్నమైనది. స్వార్థములో ఉక ప్రత్యయమును చెప్పిన బాలవ్యాకర

---

104. బాల. తద్ధిత-5

105. బాల. తద్ధిత, 15

ణము[106] చిఱుతాదులలో 'ఎమ్ము' శబ్దమును కూడ చేర్చినది. 'ఎమ్ము' శబ్దము మీద 'క' ప్రత్యయముతోనైనా ఈ రూపము నిష్పన్నము కాగలదు కాని స్వార్థములో చిఱు తామల కొరకు 'ఉక' ప్రత్యయము నంగీకరింపక తప్పదు. కనక ప్రత్యేకముగా 'క' ప్రత్యయమును చెప్పుట కంటె 'ఉక' ప్రత్యయమునే చెప్పుట లాఘవము.

ఇవికాక నన్నయ ప్రయోగించిన 'చిఱుతుక' శబ్దమును గూడ తిక్కన వాడినాడు.

13. ఎఁడు:—

పరిమాణార్థకమైన 'ఎఁడు' ప్రత్యయముతో కూడిన దిగువ నాలుగు ప్రయోగములను తిక్కన కావించినాడు—

1. కుంచెఁడు
2. పుడిసెఁడు
3. మానెఁడు
4. మూరెఁడు

కుంచము, పుడిసిలి, మానిక, మూర అను శబ్దములపై 'ఇఁడి' ప్రత్యయము చేరి పై శబ్దము లేర్పడుట వ్యాకరణపద్ధతి.

'కుంచము' ధాన్యపరిమాణ వాచక శబ్దము. "పుడిసిలి" అనగా సగము ముడిచిన వ్రేళ్ళుగల అరచేతిలో ధరించగల పరిమాణము. 'మానిక' శబ్దము కూడ ధాన్యపరిమాణ వాచకమే. 'మూర' శబ్దము మోచేతినుండి చిటికెన వ్రేలు వరకు గల దైర్ఘ్యమును తెలుపు పరిమాణవాచకము.

పై శబ్దములలో "పుడిసిలి" శబ్దమునకు 'ఎఁడు' ప్రత్యయము పరమగు నప్పుడు "ఎఁడు వర్ణకంబు పరంబగునపుడు లివర్ణంబు లోపించును"[107] అను సూత్రము వలన 'లి'వర్ణము లోపించి అపదాదిస్వరసంధివలన "పుడిసెఁడు" అను రూపము నిష్పన్నమగును.

అదే విధముగా 'మూర' శబ్దముపై 'ఎఁడు' ప్రత్యయము చేరినపుడు అప దాది స్వరసంధివలన 'మూరెఁడు' అను రూపము నిష్పన్నమగును. కాని "కుంచెఁడు" శబ్దనిష్పాదనలో "కుంచము"లోని 'అము' లోపించుటకు వ్యాకరణకారులు ఉపపత్తిని చెప్పలేదు.

---

106. బాల. తద్ధిత.10

107. బాల. తద్ధిత. 26

'మానిక' శబ్దము మీద 'ఎఁడు' ప్రత్యయము వచ్చిన యెడల 'మానికెఁడు' అను రూప మేర్పడవలసి యుండెను. 'మానిక'లోని 'ఇక' లోపించుటకు గూడ లాక్షణికులు ఉపపత్తిని చూపలేదు.

కాని, 'మాన' శబ్దము 'మానిక' అను నర్థములో నిఘంటువులలో కనబడుచున్నది. దానిపై పరిమాణార్థములో 'ఎఁడు' ప్రత్యయము చేయగా 'మానెఁడు' అను రూపము సిద్ధించినదని చెప్పుటలో బాధకము లేదు. 'మాన' శబ్దము 'మానిక' అను నర్థములో కొన్ని ప్రాంతములలో ఇప్పుడు కూడ వాడుకలో ఉన్నట్లు తెలియుచున్నది.

14. కత్తియ :-

'కత్తియ' ప్రత్యయము స్త్రీత్వ సూచకముగా స్వార్థములో వచ్చునని వ్యాకరణము తెలుపుచున్నది. 'చెలికత్తియ' అను శబ్దము నొక్కదానిని తిక్కన 'కత్తియ' ప్రత్యయాంతముగా ప్రయోగించినాడు.

"చెలికత్తియలంబుచ్చెఁ బ్రీతి గదలుకొనంగన్"[108] అని భారత ప్రయోగము.

చెలిశబ్దము మిత్రవాచకము. అది స్త్రీ పుంలింగసాధారణము. అందువలన పురుషుని బోధించుటకు 'కాఁడు' ప్రత్యయము, స్త్రీని బోధించుటకు 'కత్తియ' ప్రత్యయము చేరుచుండును.

15. కాఁడు :-

'కాఁడు' ప్రత్యయాంతములను తిక్కన పదునాల్గింటిని ప్రయోగించినాడు. అవి—

| | |
|---|---|
| ఆయతికాఁడు | తీటుకాఁడు |
| ఈఁతకాఁడు | తెక్కలికాఁడు |
| కీలుకాఁడు | త్రిమ్మటకాఁడు |
| చెలికాఁడు | నాడికాఁడు |
| జీతగాండ్రు | మోపుకాఁడు |
| జట్టికాఁడు | విలుకాఁడు |
| తిండికాఁడు | తేరకాఁడు |

108. విరా. 5-888

పై శబ్దములలో 'చెలికాఁడు' అనుచోట స్వార్థములో 'కాఁడు' ప్రత్యయము చేరినది. తిండికాఁడు, ఈఁతకాఁడు, విలుకాఁడు, నాడికాఁడు శబ్దములలో ఈ ప్రత్యయము తాచ్ఛీల్యార్థమును బోధించుచున్నది. 'జీతగాండ్రు' శబ్దములో మత్వర్థమును తెలుపుచున్నది ఒక్క ఈ శబ్దములోనే కకారము సరళముగా మారినది. 'కీలుకాఁడు' ఒక్కమారే ప్రయోగింపబడినది. సూత్రధారుడని దాని కర్థము. 'తెక్కలి' శబ్దము దొంగతనము మొదలగు నర్థములను తెలుపును. దానిపై మత్వర్థములో 'కాఁడు' ప్రత్యయము చేరగా 'తెక్కలికాఁడు' రూపమేర్పడినది. ఈ శబ్దము ఒక్కచోటనే శ్రీపర్వములో ప్రయుక్తమైనది. అక్కడ వంచకుడను నర్థమునే బోధించుచున్నది.

"హితమొనరించెద నంచును
ధృతరాష్ట్రతనూభవునకుఁ దెక్కలికాడై
మృతియొనరించెన్"[109] అని శకుని విషయములో చెప్పబడినది.

దీని బహువచన రూపము — 'తెక్కలికాలు' అనునది మాత్రము నాలుగు చోట్ల కలదు.

'తేరకాఁడు' పదమునకు అన్యుడు, క్రొత్తవాడు సంబంధము లేనివాడు విటుడు మొదలగు అర్థము లున్నవి. తిక్కన ఈ శబ్దమును—

"అతఁడు వేటకై యరిగినచో పుత్రి
దిగ్భ్రాంతి పుట్టించి తేరకాఁడు
ననునట్లు సేయన్"[110] అను పద్యములో అన్యునివలె, క్రొత్తవానివలె అను నర్థములలో ప్రయోగించినాడు. 'తేర' శబ్దమునకు వ్యర్థమను నర్థముకూడ కలదు.

సంచారార్థకమైన త్రిమ్మట శబ్దము మీద కాఁడు ప్రత్యయము వచ్చి త్రిమ్మటకాఁడు' రూపము కలిగినది. తిరుగు స్వభావము కలవాడని యర్థము.

"అతని సుతుడర్ధరథుఁ డా
ధృతవర్మ్ముఁడు విన్నవాఁడు త్రిమ్మటకాఁడై"[111]

---

109. శ్రీ. 2-138 110. అను. 1-287 111. ఉద్యోగ. 4-263

అని తిక్కన ప్రయోగము. ప్రిమ్మట శబ్దమును కూడ ప్రత్యేకముగా ఈ కవి ప్రయోగించినాడు. (విరా. 3_96)

'నుడి'కి రూపాంతరమైన 'నొడి' శబ్దము 'కాఁడు' ప్రత్యయముతో చేరి 'నొడికాఁడు' రూపము కల్గినది. మాటలమారి, ఎక్కువగా మాట్లాడువాడు అని దాని యర్థము.

'మోపుకాఁడు' శబ్దమునకు భారమును మోయువాడని యర్థము. భారార్థకమైన 'మోపు' శబ్దముతో 'కాఁడు' ప్రత్యయము కలిసి పై పదము జనించినది. తిక్కన యీ ప్రయోగము నొక్క చోటనే చేసినాడు. అది—

"నీవేటి మోపుకాఁడవు
నా వెరవున"[112] అనునది తిక్కన చేసిన ప్రయోగము.

ధనుర్వాచకమైన 'విలు' శబ్దముపై 'కాఁడు' ప్రత్యయముచేరి 'విలుకాఁడు' రూపము నిష్పన్నమగును. విల్లుకలవాడు. -అనగా విండిని ధరించువాడు అని ఈ శబ్దమున కర్థము. దీనికి ఏకవచన రూపములు బహు ప్రయోగములలో ఉన్నవి. కాని 'విలుకాండ్రు' అను బహువచన రూపము మాత్రము ఒక్కటి తిక్కన భాగములో కలదు.

'విలుకాఁడు'నకు రూపాంతరమైన 'విల్కాఁడు' శబ్దమును తిక్కన ప్రయోగింపలేదు.

16. టిమి:—

'టిమి' ప్రత్యయాంత రూపము "మగఁటిమి" అనున దొక్కటే తిక్కన భాగములో నున్నది. ఈ శబ్దము ప్రక్రియను గూర్చి నన్నయ భాగములో చూడవచ్చును.

17. త:—

'ఒకత' శబ్దములో స్త్రీ వాచకముగాను, 'పగతుండు' అను శబ్దములో మత్వర్థములోను 'త' ప్రత్యయము కన్పించుచున్నది. 'పగత' అను ప్రాతిపదికముపై 'డు' వచ్చినప్పుడు అకారమున కుత్వము వచ్చినది.

---

112. ఉద్యో- 3-300

18. తన:—

తద్ధిత ప్రత్యయములలో తిక్కన అన్నిటికంటె ఎక్కువగా 'తన' ప్రత్యయమును ప్రయోగించినాడు. ఈ వర్గమునకు చెందిన శబ్దములు డెబ్బదికి మించి యున్నవి.

1. అడియరితనము
2. అలుకఁదనంబు
3. అల్లఁదినంబు
4. అసదతనము
5. ఆఁడుఁదనంబు
6. అలితనంబు
7. ఎఱ్ఱఁదనంబు
8. ఒప్పనితనము
9. కట్టఁడితనము
10. కలితనము
11. కలికి(ల్కి)తనము
12. కేలారితనము
13. గరువంపుఁదనము
14. గఱుపతనము
15. గొల్లతనము
16. చండితనము
17. చక్కఁదనము
18. చిఱుతఁదనము
19. చుంచుతనము
20. చులుకఁదనంబు
21. చెట్టితనంబు
22. తిన్నఁదనము
23. తియ్యఁదనము
24. దండితనము
25. దిట్టతనంబు
26. నున్నఁదనంబు
27. పేడితనము
28. పందతనము
29. పసదనము
30. పెద్దతనంబు
31. పేదతనంబు
32. పొల్లఁదనము
33. ప్రన్నఁదనంబు
34. బిరుదుతనము
35. బీదతనము
36. బెండుతనము
37. బేలతనంబు
38. బేలుఁదనంబు
39. మల్లుతనము
40. మంచితనంబు
41. మగతనంబు
42. ముదుసుఁదనంబు
43. మెత్తఁదనము
44. పోటరితనము

45. వల్లఁదనము
46. దిమ్మరితనము
47. లెన్పఁదనంబు
48. బెడిదంపుఁదనము
49. వరుసఁదనము
50. మాసినితనంబు
51. బిరుసుఁదనంబు
52. అరాతితనము
53. పితిరితనము
54. పెండితనము
55. కొడుకుఁదనము
56. బంటుతనము
57. చుట్టపుఁదనము
58. బెడుంగుదనము
59. ఒజ్జతనము
60. వెఱ్ఱితనము
61. కుమారుతనము
62. లానికితనము
63. వట్రువఁదనము
64. నగువతనము
65. దుర్బుద్ధితనము
66. పౌలుపతనము
67. నీచతనము
68. ప్రేకఁదనంబు
69. తులువతనము
70. వెల్లఁదనము
71. బెట్టిదంపుఁదనము
72. మూలతనంబు]

పై శబ్దములలో చండితనము, అరాతితనము, దుర్బుద్ధితనము, నీచతనము, కలితనము అనునవి సంస్కృత ప్రాతిపదికలమీద 'తన' ప్రత్యయము చేరిన రూపములు. కొన్ని శబ్దములపై అర్ధబిందువు, తకారమునకు దకారాదేశము కల్గినవి అల్లఁదనము, చక్కఁదనము, బిరుసుదనము, మొదలగునవి. ప్రాచీన ప్రకృతి రూపములో అనునాసికాక్షరముండుట దానికి కారణము గావచ్చును.

ఆవియరి, పోటరి, కడ్డిఁడి అనునవి ముందుగానే తద్ధితాంత శబ్దములు. వానిపై మరల 'తన' ప్రత్యయము చేరినది.

'తన' ప్రత్యయము తత్సమ ప్రకృతులమీద గూడ వచ్చునని ప్రాచీన లాక్షణికులు పేర్కొనలేదు. తిక్కనవంటి ప్రామాణికకవిలోని ఈ వైలక్షణ్యమును వ్యాకరణకర్తలు పేర్కొనకపోవుట విచారకరము.

19. న:-

మెత్తన, చిక్కన అను రెండు శబ్దాలలో భావార్థకముగా 'న' ప్రత్యయము కనబడుచున్నది. తుళుభాషలో 'మెత్తెన' శబ్దము, కన్నడములో 'మెత్తనె, మెత్తన్న, మెత్తానె' అను శబ్దములు దీనికి సమానార్థకములుగా కనబడుచున్నవి.

'చిక్క' శబ్దము సంస్కృతభవమని D E D లో తెలుపబడినది. మరాఠీలో 'చీక్' శబ్దముండుట దానికి సమర్థకముగా ఉన్నది. 'చిక్కణం మసృణం స్నిగ్ధమ్' అని అమరకోశము. తెలుగులోని 'జిగురు, జిగట, జిగి' శబ్దాలకుగూడ దీనితో సంబంధమున్నట్లు D.E.D. తెలుపుచున్నది. 'చిక్కని' అను విశేషణరూపము కూడ ప్రయోగములలో ఉన్నది.

20 పాటు:-

అనుబంధముగా చేరిన 'పడు' ధాతువు 'పాటు' ప్రత్యయముగా మారిన రూపములను తిక్కన ఎక్కువగా ప్రయోగించినాడు. ఈ పద్యానుబంధము ధాతువుల మీద, నామములమీద గూడ చేరి శబ్దపల్లవము లేర్పడుచున్నవి. వానిలో ఉత్తరభాగమగు 'పడు' అనునది క్రమముగా ప్రత్యయత్వమును పొంది 'పాటు'గా ఏర్పడినది. ఇది భావార్థమును బోధించుచుండును.

పూర్వభాగము ఎక్కువగా నామపదమై ఉండుటవలన దానిని తద్ధిత ప్రత్యయముగానే పరిగణించి చూపుచున్నాను.

'పాటు' ప్రత్యయాంత శబ్దము లీ భాగములో 40 ఉన్నవి. అవి—

1. అగపాటు
2. అచ్చుపాటు
3. అడచిపాటు
4. అర్థపాటు
5. అలవాటు
6. అచ్చెరుపాటు
7. అచ్చెరువుపాటు
8. ఆనపాటు
9. ఉత్తలపాటు
10. ఎదుర్పాటు
11. ఏటుపాటు
12. ఒదుర్పాటు
13. ఒల్లర్పాటు
14. కష్టపాటు
15. కనుర్పాటు
16. కీడుపాటు
17. కొందలపాటు
18. కోల్పాటు

19. క్రందుపాటు
20. చిడిముడిపాటు
21. చేర్పాటు
22. తొట్రుపాటు
23. తోడుపాటు
24. దైన్యపాటు
25. నగుఁబాటు
26. నివ్వెఱపాటు
27. దుఃఖపాటు
28. ట్రుంగుడుపాటు
29. భంగపాటు
30. మెత్తఁబాటు
31. ప్రమానుపాటు
32. జిచ్చపాటు
33. వెనుఁబాటు, వెంబాటు
34. వేగిరపాటు
35. వెఱగుపాటు
36. వెక్కనపాటు
37. వెల్లఁబాటు
38. వేగపాటు
39. వేర్పాటు
40. సంకటపాటు

పై వాటిలో కొన్ని 'పడు' అనుబంధమును ముందు చేర్చుకొని, తరువాత 'పాటు' రూపమును పొందినవి. మరికొన్ని 'పాటు'ను ప్రత్యయ రూపములోనే స్వీకరించినవి కావు.

ఎదఁబడు, నగుఁబడు, వెల్లఁబడు, కనుఁబడు, అను శబ్ద పల్లవరూపములు కవిప్రయోగములలోగాని, వ్యవహారములోగాని గోచరించవు. అందువలన పై నాలుగు చోట్ల 'పాటు' అనునది ప్రత్యయరూపములోనే చేరినదిగా స్పష్టమగుచున్నది. పై రూపములన్నింటిలో 'పాటు' నకు ముందు బిందు వుండుట గమనార్హము.

'అలపడు' అను శబ్దపల్లవము 'అలవాటు'గా పరివర్తన మందినది. ఇక్కడ 'ప' కారము శిథిలీకరణమును పొంది వకారముగా మారుట ప్రత్యేకత.

తక్కిన రూపములన్నింటిలోను మొదట 'పడు' అనుబంధముగా చేరి, అం తరువాత 'పాటు' ప్రత్యయముగా పరివర్తనము పొందినది. (అగపడు, అప్పు పడు మొ )

ఈ పద్వానుబంధము తత్సమ ప్రాతిపదికములైన 'భంగ, దుఃఖ, దైన్య కష్ట' మొదలగు వాటిపైనకూడ చేరినది కావుననే భంగపాటు మొదలగు శబ్దముల నిష్పన్నములైనవి.

'చేద్పరు' అను శబ్దపల్లవమునకు బాధపడు, చలించు మొదలగు నర్థము లున్నవి. దానినుండి జనించినదే చేవ్పాటు శబ్దము.

21 పోతు :-

'పోతు' ప్రత్యయముతో 'తిండిపోతు' అను శబ్దమొక్కటి తిక్కన భాగములో నూతన ప్రయోగమున్నది. "తిండిపోత నీకు ఖండనం బేటికి" [113] అని తిక్కన ప్రయోగించినాడు. ఈ ప్రత్యయము తాచ్ఛీల్యార్థమును బోధించును.

'పోతు' అను రూపము తిర్యక్కులలో పురుషజాతి వాచకముగా పెక్కు ద్రావిడభాషలలో కలదు.

| | | |
|---|---|---|
| తమి | — | పోత్తు |
| మల | — | పోత్తు |
| కన్న | — | పోత, హోత, హోతు |
| కొడగు | — | పోతు |
| కువి | — | పోతు |
| నాయికి | — | పోత్ |

అను రూపములన్నియు పురుష పశుపక్షులకు బోధకములుగా ఉన్నవి.

ఈ పోతు శబ్దమునకు, తాచ్ఛీల్యార్థకమైన 'పోతు' ప్రత్యయమునకును ఏమైన సంబంధమున్నదేమో భాషాశాస్త్రవేత్తలు కనుగొనవలసియున్నది.

22 మడి :-

'ఇమ్మడి, ఇనుమడి, నలుమడి' అను మూడు రూపములలో 'మడి' అనునది ప్రత్యయముగా కనబడుచున్నది. ఇది 'రెట్టు' అను నర్థమును బోధించు 'మడుగు' శబ్దముయొక్క అవశేషము.

ఇరు, ఇను శబ్దములు ద్విత్వ సంఖ్యను తెలుపును ఇను+మడు(గు> ఇను మడి> ఇమ్మడి అను విధముగా పరిణమించినదని తోచుచున్నది. 'రెట్టించుట' అను నర్థములో కన్నడభాషలో 'మడి' శబ్దము కనిపించుచున్నది. తెలుగులో మాత్రము

113 ద్రోణ.4-229

మడుంగు, మడుగు శబ్దములు ఈ అర్థములో ఉన్నవి. అదియే 'మడి' అను పరిశిష్ట రూపమై ప్రత్యయదశను నంతరించుకొన్నది.

'నలు' అనునది 'నాలుగు' యొక్క ప్రాచీనరూపమని ఇంతకుముందే చెప్పుకున్నాము. నాలుగురెట్లు అను నర్థములో 'నలు' శబ్దముపై 'మడి' ప్రత్యయము చేరగా 'నలుమడి' అను రూపమేర్పడినది.

నన్నయ 'ఇనుమడుంగు' శబ్దమును ప్రయోగించినాడు.

23 టిక :-

భావార్థకమగు 'టిక' ప్రత్యయమును తిక్కన మూడు ప్రయోగములలో వాడినాడు. అవి—.

1. చుట్టటికము. 2. తెప్పటికము. 3. పెద్దటికము అనునవి.

'చుట్టము' శబ్దముపై 'టిక' ప్రత్యయముచేరగా మువర్ణకము లోపించి "చుట్టటికము" అను రూపమేర్పడెనని వ్యాకరణ ప్రక్రియ. మువర్ణకములేకుండ 'చుట్టలు' అని బహువచనరూపము కనబడుచున్నందున ప్రాచీనమైన 'చుట్ట' రూపముపై ననే 'టిక' ప్రత్యయము చేరియుండునని తలపవచ్చును.

24 సేపు :-

'సేపు' ప్రత్యయముతో నన్నయ 'కొంత సేపు' అనుపదమును ప్రయోగింపగా తిక్కన 'ఇంత సేపు' అనుదానిని క్రొత్తగా ప్రయోగించినాడు

25. గురు/వురు :-

సంఖ్యావాచక శబ్దములమీన గురు/వురు అను ప్రత్యయములతో నలుగురు/నలువురు, ముగ్గురు/ముువ్వురు వంటి ప్రయోగములు చాలగలవు. అవికూడ తద్ధితములలోనే చేర్పదగినవి. గకార-వకారములు పరివర్తనమందిన రూపము లివి.

ఇంతవరకు తిక్కన క్రొత్తగా వాడిన ప్రత్యయములను, ప్రయోగములను గూర్చి ముచ్చటించినాను. ఇవికాక నన్నయ వాడిన ప్రత్యయములను, రూపములను కూడ తిక్కన ప్రయోగించినాడు నూతన ప్రయోగములు లభించనందున వాటిని గూర్చి మరల ఈ ప్రకరణములో ప్రస్తావించలేదు.

—o—

# పఞ్చమ ప్రకరణము

## ఎఱ్ఱన భారతములోని కృత్తద్ధితములు

నన్నయకు సుమారు మూడు శతాబ్దముల తరువాత ఎఱ్ఱన అరణ్యపర్వ శేషము పూరించినాడు. అప్పటికే తిక్కన విరాటపర్వము మొదలుకొని 15 పర్వములు రచించి భారతానువాదమును పూర్తిగావించెను. ఏకారణముననోగాని, తిక్కన అరణ్యపర్వ శేషమును విడిచి అనంతర భాగమునే చేపట్టినాడు.

నన్నయ అరణ్యపర్వములో మూడాశ్వాసములమీద 142 పద్యగద్యములను రచించెను ఎఱ్ఱన నాలుగవ ఆశ్వాసము అవశిష్టభాగమును, 5, 6, 7వ ఆశ్వాసములను రచించినాడు. ఈతని రచన మొత్తము 1685 గద్యపద్యము లున్నవి.

భాషాస్వరూపదృష్టితో చూచినప్పుడు, ఎఱ్ఱన భారతము నన్నయతోకంటె తిక్కనతోనే ఎక్కువ సాజాత్యము కలిగియున్నది. నన్నయ రచనలోలేని అనేక పదములు, పదబంధములు అరణ్యశేషములో మనకు కనిపించును. వానిలో అధికభాగము తిక్కన ప్రయోగించినవే. కృత్తద్ధితాంత పదముల విషయములోకూడ పీరిద్దరికిగల సామ్యము స్పష్టముగా గోచరించును.

నన్నయ ప్రయోగించని నూతన కృత్తద్ధితాంత రూపములను-తిక్కన ప్రయోగించినవానిని గూర్చి పూర్వప్రకరణములో చర్చించి యున్నాను. ఇప్పుడు నన్నయ-తిక్కనలిరువురు ప్రయోగించని, ఎఱ్ఱన నూతనముగాచేసిన ప్రయోగముల నీ ప్రకరణములో పర్యాలోకింతును.

ఎఱ్ఱన క్రొత్తగాచేసిన కృత్తద్ధితప్రయోగముల సంఖ్యలో బాల తక్కువగా ఉన్నవి. బాగుగా పరిశీలించినమీదట నా దృష్టికి వచ్చినవి అటువంటివి మొత్తము 17 మాత్రమున్నవి. వానిలో కృదంతరూపములు అయిదు మాత్రమే. తద్ధిత ప్రత్యయాంతములు పది, అస్పష్టవ్యుత్పత్తి కలవి రెండు ఉన్నవి.

ముందుగా కృదంతరూపములనుగూర్చి విమర్శింతును. "దిట్ట, పలుగు, తెగుదల, కాపు, తోఁట" అను అయిదు శబ్దములీ వర్గమువి, ప్రకృతభాగములో లభించు చున్నవి. అవి క్రమముగా-అ, గు, ట, దల, వు ప్రత్యయాంతములు.

1. దిట్టశబ్దమునకు-దార్ఢ్యము, శక్తిదార్ఢ్యముకలవాడు, నేర్పరి మొదలగు నర్థము లున్నవి ఎఱ్ఱన 'దిట్ట' శబ్దమును 'సమర్థు'డను నర్థములో ప్రయోగించినాడు ఆ ప్రయోగమిది—

"వట్టుఁ గల్లరియై పాపములకు నెల్ల
దిట్టయై లోకములచేతఁ దిట్టు 'పడిన"

దిట్ట శబ్దము సంస్కృత ధృష్ట శబ్దభవమని సూర్యారాయనిఘంటువు, ఆంధ్రవాచస్పత్యము కూడ తెలుపుచున్నవి. అయినప్పటికి సాధారణ జన వ్యవహార ములోగూడ ఈ శబ్దము వ్యాపించి ఉన్నందున దీనికి దేశ్యప్రకృతిగూడ ఉండియుండు నని తలపవచ్చును.

దిట, దిటవు, దిటము, దిటవరి, దిటమరి అను శబ్దములు తెలుగు కోశము లలో అర్థసామ్యము కలవి కనబడుచున్నవి. తెలుగులో 'దీటు' ధాతువొకటి 'సరిచేయు, సవరించు' అను నర్థములతో నున్నది. తమిళములో 'తీట్టు, తీట్టి' ధాతువులు పదును పెట్టు, రాతిపై చెక్కు, తీవ్రముగా కొట్టు మొదలగు నర్థములలో కలవు. కన్నడములో 'తీడు' ధాతువు పై యర్థములనే బోధించుచున్నది. తెలుగులోకూడ 'దీటు' ధాతువు 'సరిచేయు' 'సవరించు' అను క్రియలను, తీడు ధాతువు 'పదనుపెట్టు' అను క్రియను బోధించుచున్నవి. ఈ ధాతువులన్నిటికి మూలద్రావిడ భాషలో ప్రకృతి 'తీట్ట్' అనునది

'నేర్పరి, సమర్థుడు' అను నర్థమునకు పై ధాతువుల అర్థమునకు కొంతవరకు సామ్యమున్నది. "కుశాన్ లాతి ఇతి కుశలః" అనుచోట దర్భలను కోయువాడు అని యౌగికార్థముగల కుశలశబ్దము పరంపరా సంబంధమువలన నేర్పరి అని రూఢార్థమును పొందిన విధముగనే సరిచేయు, సవరించు అను క్రియల ద్వారా 'దీటు' ధాతువునుండి నిష్పన్నమైన దిట్ట శబ్దము-సమర్థుడను నర్థమును బోధించుటలో విప్రతిపత్తి లేదు.

---

1. అర. 5-405.

ధాతువు తొలి యచ్చునకు హ్రస్వము, టకారము ద్విత్వమును పొందుట, దానిపై 'అ' ప్రత్యయము చేరుట ఇందలి ప్రక్రియాక్రమము. దీటు + అ> దీట్ + అ> దిట్ + అ> దిట్ట్ + అ = దిట్ట.

2. పలుగు శబ్దము దుష్టమను అర్థములో ప్రయోగింపబడినది.

క॥ వలుకుటయు నలిగి శలుఁడి
పలుగుఁదపసి నంటగట్టి పటుశూలములం
బొలియింపుడు"[2] - అని యెఱ్ఱన ప్రయోగము. ఈ పద్యములో పలుగు శబ్దము సమాసాంతర్గతమై, తపసి శబ్దమునకు విశేషణమై యున్నది. స్వతంత్రనామముగా దానికి ప్రయోగము లేదు. నన్నయకూడ పలుగు శబ్దమును 'తన' ప్రత్యయాంతముగా "పలుగుఁదనంబు" అని ప్రయోగించినారు. వలవు ధాతువునుండి ఈ శబ్దమేర్పడినట్లు తోచును.

3. 'దల' ప్రత్యయాంతము 'తెగుదల' అను ప్రయోగమొక్కటి ఎఱ్ఱన రచనలో లభించుచున్నది.

"రాత్రి, తెగుదల, దిన మేల రాకయుండు
దినము, తెగుదల రాత్రి యేతేర కున్నె"[3]

అని ఒక్క పద్యములోనే ఈ పదము రెండుమార్లు ప్రయుక్తమైనది.

సాహసించు, ముగియు, పూర్తియగు అను నర్థములుకల 'తెగు' ధాతువుపై 'దల' ప్రత్యయముచేరగా ఈ పద ముత్పన్నమైనది.

కన్నడభాషలో తెగె, తెగు ధాతువులు, తుళభాషలో తెక్కుని, మలయాళములో తెకయుక, 'తికెక్క' ధాతువులు, నాయికి భాషలో 'తిక్క' ధాతువు అనునవి తెగు ధాతువునకు సమానార్థకములుగా ఉన్నవి. వీనికి మూలద్రావిడ ప్రకృతి 'తెక్' లేక 'తిక్' అనునది. (T.V.B)

---

2. అర. 4-351 3. అర. 5-341

తిక్కన భారతములో 'తెగుదల' శబ్దమును ప్రయోగించలేదు. కాని నిర్వచనోత్తరరామాయణములో మాత్రము కన్పించుచున్నది.

4. 'వు' ప్రత్యయాంతము 'కావు' శబ్దమొక్కటి ఎఱ్ఱన రచనలో నూతనముగా చోటుచేసుకొన్నది. బిందురహితమైన 'కాచు' ధాతువునకు రక్షించుట మొదలగు నర్థములున్నవి. ఆ ధాతువుపై 'వు' ప్రత్యయముచేరగా అంత్యవర్ణము లోపించి 'కావు' శబ్దము నిష్పన్న మగునని వ్యాకరణపరిభాష. కాచు + వు > కా + వు = కావు.

ఎఱ్ఱన అరణ్యపర్వములో రామాయణ కథాసందర్భమున, "అమ్మగువ కావున్న దనుజాంగనలు త్ర్యక్షియు, లలాటాక్షియు" అని ప్రయోగించినాడు. ఇక్కడ 'కావు' శబ్దమునకు 'రక్షణము' అని భావార్థము స్పష్టము. దీనికి రక్షకుడను కర్త్రర్థము కూడ అన్యత్ర కన్పట్టును.

నన్నయ సబిందుకమైన 'కాఁపు' శబ్దమును ప్రయోగించినాడు. గృహస్థుడు, రైతు, కాపురము అనునవి దానికర్థములు. తిక్కన రచనలో శాంతి పర్వములో ఒక్క చోట (ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన సంశోధిత మహాభారతములో) 'కావు' శబ్దము కన్పించుచున్నది.
ఆ పద్య మిది—

ఆ. విను మహింస[4] విప్రజనులకు నెల్ల భం
గులను వలయుఁ బ్రజలవలనఁ గరుణఁ
గలిగి వారిఁ గీడు గదురక యుండంగఁ
గావు పతికహింసకత్వ మనఘ.

కాని ఈ ప్రతిలోనే దిగువ టిప్పణిలో, పెక్కు ప్రతులందు 'కావు' అను పాఠమున్నట్లు సూచితము. అందువలన పై పద్యములో తిక్కన కాపు శబ్దమును ప్రయోగించినాడని ఖండితముగా చెప్పజాలము. ఇక్కడకాక, 15పర్వముల భాగములో తిక్కన మరెక్కడను

---

4. శాంతి. 5-299

ఈ శబ్దమును ప్రయోగింపకపోవుట గమనార్హము. అందువలన 'కాపు' శబ్దమును 'ఎఱ్ఱన' నూతనముగానే ప్రయోగించినాడని తలచి ఇచ్చట గ్రహించినాను.

తమిళములో 'కాప్పు', 'కావల్' శబ్దాలు, కాపాడుట, రక్షించుట అను నర్థములలో ఉన్నవి. మలయాళములో కూడ కావ్వు శబ్దమున్నది. కన్నడములో కాపు, కాహు శబ్దములు దీనికి సమానార్థకాలు. మూలద్రావిడభాషలో 'కా' అనునది దీనికి ప్రకృతి రూపము. దీనిమీద 'చు' అనుబంధముగాచేరి 'కాచు' అను ద్వితీయ దశధాతు వేర్పడినది. కాపరి, కాపుదలవంటి శబ్దము లీ ధాతువునుండి జనించినవే.

6. 'తోఁట' శబ్దముద్యానవన మను నర్థములో ఎఱ్ఱన రచనలో ప్రయుక్తమైనది. ఇది నన్నయ భాగములో కనబడదు. తిక్కన పదప్రయోగకోశములో, తోఁట శబ్దమును చూపలేదు. తిక్కన భారతమును నేను పరిశీలించిన మేర కీ శబ్దము దృష్టికి రాలేదు.

తెలుగులో 'తోఁడు'ధాతువునకు-"పైకితీయు""నీటిని బావినుండివేరుచేయు అను నర్థములున్నవి. ఆ ధాతువు మీద 'ట' ప్రత్యయము చేరుటవలన 'తోఁట' శబ్దము నిష్పన్న మగునని వ్యాకరణపరిభాషలో చెప్పవచ్చును. దేనికొరకు బావినుండి నీరు తోడబడునో అది 'తోఁట' అని వ్యుత్పత్త్యర్థము చెప్పవలసియుండును.

తమిళములో 'తోట్టు', తోణ్డు' అను ధాతువులు, 'తోట్టమ్' అను నామము, కన్నడములో 'తోడు' ధాతువు, 'తోట', 'తోణ' అను నామములు, కొడగులో 'తొడ్', 'తొడి' ధాతువులు, తుళులో తోట శబ్దము-దీనికి సమానార్థకములుగా కన్పించుచున్నవి. అందువలన 'తోఁట' శబ్దమును కృదంత రూపముగా గ్రహించుట సోపపత్తికము.

## తద్ధిత ప్రత్యయములు

ఎఱ్ఱన రచనాభాగములో-ఒఱపలతనము, కల్లరి, టక్కరి, తూమేఁడు, పుట్టెఁడు, మొక్కలుఁడు, కింకిరిపాటు, తక్కువపాటు, ప్రేఁకప-అను తొమ్మిది తద్ధిత ప్రయోగము లున్నవి. వీనిలో అరి, ఎఁడు, అ, పాటు, న అను ప్రత్యయము లున్నవి.

1 అరి :- మత్వర్థకమైన 'అరి' ప్రత్యయాంత శబ్దములు రెండు, కల్లరి టక్కరి అనునవి ఈ భాగములో కలవు. నన్నయ తిక్కన లీ పదములను ప్రయోగించలేదు.

కల్ల, టక్కు శబ్దములమీద 'అరి' ప్రత్యయముచేరి కల్ల + అరి = కల్లరి, టక్కు + అరి = టక్కరి అను రూపములు కలిగినవి. కల్లలాడు స్వభావము కలవాడు, వంచనచేయు స్వభావము కలవాడని ఈ శబ్దముల కర్థము. మొదట మత్వర్థకముగా, నుండిన 'అరి' ప్రత్యయము తరువాత క్రమముగా తాచ్ఛీల్యార్థకముగ పరిణమించినది.

2 అ :- 'మొక్కలుఁడు' అను శబ్దము మత్వర్థకమగు 'అ' ప్రత్యయాంతముగా చెప్పవలసియుండును. ఇది ముష్కర శబ్దభవమగు 'మొక్కలము' అను శబ్దముపై 'అ' ప్రత్యయముచేరగా పుంవాచకమగుటవలన 'మొక్కలుఁడు' అను రూపమును పొందినది. మొక్కల శబ్దమునకు ముష్కరత్వము ఔద్ధత్యము, శౌర్యము, ఉత్సాహము మొదలగు నర్థము లున్నవి. దుడుకఁడు, చెడుగఁడు, వంటి శబ్దములలోను, 'అదప' శబ్దములోను 'అ' ప్రత్యయము మత్వర్థ బోధకముగా ప్రసిద్ధమే.

కం। నలువురు పార్థుల నత్యు
జ్జ్వల శరవర్షముల ముంచి జలధరము క్రియం
బెలుచన గర్జిల్లుచు మొ
క్కలుఁడయి తన విక్రమంబు గడఁకయుఁ జూపెన్."[5]

అను పద్యములో ఎఱ్ఱన మొక్కలుఁడను శబ్దమును ప్రయోగించెను. సందర్భమునుబట్టి ఇక్కడ ఈ శబ్దమునకు ఉత్సాహము లేక ఔద్ధత్యము కలవాడై అని యర్థముచెప్ప దగియున్నది.

ముష్కర శబ్దమునుండి నేరుగా 'మొక్కలుఁడ'ను తద్భవము ఏర్పడెనని కూడ చెప్పవచ్చును. ఆ పక్షమున తద్ధిత ప్రసక్తి ఉండదు.

---

5. అర.5_425

ముష్కర శబ్దములోని ఉకారము ఒకారముగా మారుట, హల్పమీకరణము వలన షకారమునకు కకారమాదేశమగుట, రేఫకు లకారము వచ్చుట, ఇందలి ప్రక్రియా దశలు.

8 ఎఁడు :— పరిమాణార్థకమగు 'ఎఁడు' ప్రత్యయములో తూమెఁడు, పుట్టెఁడు అను రెండు శబ్దముల నెఱ్ఱన సూతినముగా ప్రయోగించినాడు. ధాన్యపరిమాణ వాచకములగు తూము, పుట్టి శబ్దములపై 'ఎఁడు' ప్రత్యయము చేరి పై శబ్దములు నిష్పన్నములైనవి. ఇక్కడ 'తూము' 'పుట్టి' శబ్దములు పరిమాణమును బోధింపగా, ఎఁడు ప్రత్యయము ఆ పరిమాణముచేత పరిమేయమగు ధాన్యాదులను బోధించును.

తమిళములో తూమ్బు, ఁఁమ్ శబ్దములు, 'పర్జి'లో తూము శబ్దము' పరిమాణ వాచకములుగా కన్పించుచున్నవి. పుట్టి శబ్దముకూడ తమిళభాషలో పరిమాణ బోధకముగా ఉన్నది.

4 తన :— తన ప్రత్యయము భావార్థకము. ఈ ప్రత్యయములో "ఒఱవతనము" అను శబ్దమొక్కటి ఈ భాగములో కనబడుచున్నది. ఒఱవ శబ్దమును నన్నయ తిక్కన లిరువురు ప్రయోగించియున్నారు. కాని 'తన' ప్రత్యయాంతముగా ఎఱ్ఱన మాత్రము వాడినాడు.

ఒఱగు ధాతువుపై 'వ' ప్రత్యయము చేరుటవలన ఒఱవ శబ్దమేర్పడినది. వంకరైనది అని దాని కర్థము. ఒఱవతన మనగా వక్రత, కాపట్యము అని ఫలితార్థము

"పిటికితనము, నేమరుటయు సొఱవతనము"

మెత్తఁబాటునఁగార్యంబు నతెఱంగు"[6]—అను పద్యములో ఈ శబ్దమునకు కుటిలవర్తనము నర్థము చెప్పదగియున్నది. ఇదికాక, తులువతనము, బేలతనము, పిటికితనము మొదలగు మరికొన్ని తన ప్రత్యయాంతముల నెఱ్ఱన ప్రయోగించినాడు. అవి తిక్కన ప్రకరణములో గతార్థములే.

---

6. అర. 6-34

5 న - న' ప్రత్యయము భావార్థక తద్ధితము చుర్కన, మెత్తన మొదలగు పదములు వ్యవహారరూఢములు ప్రేకన శబ్ద మొక్కటి ప్రకృతభాగములో కన్పించుచున్నది ప్రేఁగు ధాతువు మీద క ప్రత్యయము చేయగా ప్రేక శబ్దము జనించినది ప్రేక అనగా బరువైనదని యర్థము- ఆ శబ్దముపై మరల భావార్థములో న ప్రత్యయము చేరుటవలన ప్రేకన శబ్దముత్పన్నమైనది

చ విని మగఁడంగివాఁడు పృథివీపతిఁ జూచి ధరిత్రికంటె ప్రేఁ
కనయగుదాని నాకసము కంటెఁ గడుం బొడవైనదాని [7]

అని ఎఱ్ఱన ప్రయోగించినాడు

తిక్కన 'ప్రేఁకదనంబు' అను శబ్దమును ప్రయోగించినాడు

6 పాటు - పడు ధాతువు కొన్ని శబ్దములపై అనుబంధముగా చేరి శబ్ద పల్లవములుగా నేర్పడును కొందలపడు తొట్రుపడు కింకిరిపడు మొదలగునవి అట్టివి. దానిలో అనుబంధముగా చేరిన పడు ధాతువు పాటు రూపమును పొంది క్రమముగా ప్రత్యయత్వమును సంతరించుకున్నది.

ఎఱ్ఱన అటువంటి శబ్దములలో కిరికిరిపాటు తక్కువపాటు అను రెండింటిని క్రొత్తగా ప్రయోగించినాడు వీనిలో కింకిరిపడు అను శబ్దపల్లవము ప్రయోగములో నున్నది దానిలో పద్యానుబంధము పాటు ప్రత్యయముగా రూపొంది కింకిరిపాటు శబ్దము సిద్ధించినది కింకిరిశబ్దమునకు కోపము, రోఁత అను నర్థము లున్నవి కింకిరిపాటు అనగా కోపపడుట, రోఁతపడుట అని యర్థము, ఇక్కడ పాటు అనునది భావార్థక ప్రత్యయముగా నెలకొన్నది

సీ॥ నగుమొగంబుల కాని నలినాక్షి నీ వెనఁ
బతులకుఁ గింకిరిపాటు లేదు [8] అని ఎఱ్ఱన సత్యాద్రౌపదీ సంవాదములో ప్రయోగించినాడు ఇక్కడ కోప మను నర్థము స్పష్టము

---

7 అర 7-438 8. అర 5-291

ఇటువంటిదే తక్కువపాటు అను పదియొక్క శబ్దమీ భాగములో గోచరించును తక్కువపడు అను శబ్దవల్లపరూపము కవిప్రయోగ ప్రసిద్ధముకాదు అందువలన ఇక్కడ తక్కువ శబ్దము మీద ప్రత్యయముగా రూఢమైన పాటు చేరగా తక్కువపాటు అను రూపము కలిగినది నన్నయ తిక్కన లిరువురును తక్కువ శబ్దమును ప్రయోగించినప్పటికి పాటు ప్రత్యయాంతముగా వారు చేపట్టలేదు

ఈ పాటు ప్రత్యయము కింకిరి తక్కువ అను నామశబ్దములపై చేరినందున దీనిని తద్ధిత ప్రత్యయముగా పరిగణింపవలని ఉండును పాటు ప్రత్యయాంత శబ్దములను తిక్కన అధికముగా ప్రయోగింపగా నన్నయ భారతభాగములో ఒక్క ప్రయోగము కూడ కనరాదు

7 -ఇక ఉరువడి కూకటులు అను రెండు శబ్దముల వ్యుత్పత్తి కొంత అస్పష్టముగా ఉన్నది

ఎఱ్ఱన ఉరవడి ఉరువడి' అను రెండు శబ్దములను ప్రయోగించినాడు తిక్కన కవితలో 'ఉరవడి అను రూప మున్నది ఎఱ్ఱన మాత్రమే ఉకారమధ్య రూపమును ప్రయోగించినాడు

ఉరువడి శబ్దము ఉరవడి యొక్క రూపాంతరమనియు ఉరవు + వడి = ఉరవడి యగుననియు నిఘంటుకారుల కథనము ఉరవు శబ్దమునకు తగినది అధికము అను నర్థము లున్నవి.

ఉరు అనువైకృతాకర్మ క్రియ ఒకటి కలదని, దానినుండియే ఉరవు అను నామవాచక మేర్పడినదనియు ఆంధ్రవాచస్పత్యము తెలుపుచున్నది కావున 'ఉరు' ధాతువుపై వడి ప్రత్యయముచేరి ఉరువడి శబ్దమేర్పడినదని చెప్పదగును.

"ఉరువడి వర్థిల్లుచున్న జలంబుచేఁ
బొంగారి దెసలెల్ల ప్రింగికొనుచు ⁹

అను పద్యములో సందర్భమునుబట్టి ఉరువడి శబ్దమునకు అధికవేగముతో అని యర్థము స్పష్టము

---

9. అరణ్య 4-228

"పడి ప్రభృతులు నిర్లెఖుంగునది" అని చిన్నయసూరి విధించిన పడి ప్రత్యయము ధాతువుమీదనే చేరునని కాలువడి, గెలువడి నడవడి మొదలైన ఉదాహరణముంద్వారా స్పష్టము అందువలన అధికమగు' అను నర్థము గల ఉరు ధాతువుపై కృత్ ప్రత్యయమగు పడి' ప్రత్యయముచేరి ఉరువడి శబ్దము నిష్పన్నమయ్యెనని చెప్పుట సముచితముగా నుండును. ఇక్కడ పడి ప్రత్యయము భావార్థములో వచ్చినది కనుక పై పద్యములో అధిక్యము అను అర్థముకూడ కుదురుచున్నది

కన్నడభాషలో ఉరువణి ఉరుఃజె అను రూపములు వేగము విజృంభిణము అను నర్థములలో నున్నవి తమిళములో ఉర అను ధాతువు ఉరప్పు అను నామముకూడ దీనికి సమానార్థకములుగా కన్పించుచున్నవి

కూకటి శబ్దము వైకృతమని అది సంస్కృతములోని కూటక శబ్దము నుండి జనించినదనియు సూర్యరాయాంధ్ర నిఘంటువు ఆంధ్రవాచస్పత్యము కూడ తెల్పుచున్నవి కూటక శబ్దము వర్ణవ్యత్యయమువలన కూకటగా మారుట కవకాశమున్నది కాని పదమధ్యములో అర్ధబిందు వేర్పడుటకు కారణము కనబడదు చివరి అకారము ఇకారముగా మారుటకూడ కుదరదు కనుక దీనిని దేశ్యముగానే సాధింపవలసియుండును.

మాల్తో భాషలో తల అనే అర్థములో కుకు' అను శబ్దము కురుఖ్ భాషలో కుక్క్ అను శబ్దము కలవు దానికి మూలద్రావిడ భాషలో కూక్క్/కూన్క్ అను రూపము లుండియుండును 'కూన్క్ అను ప్రకృతిపై అటి ప్రత్యయముచేరుట వలన కూన్కటి> కూఁకటి శబ్దముగా ఏర్పడు నవకాశము కలదు కన్నడములో కుక్కటి శబ్దము ఒక పక్షివాచకముగా ఉన్నది తెలుగులోకూడ 'కూకటిమగ అని భరద్వాజపక్షికి పేరున్నది దానివి పోలియున్నందున పిల్లజుట్టునకు కూఁకటి యను పేరు కలిగియుండును.

"వాడియైన కత్తివాతి యమ్మునఁ గొని
పగతు శిరము చెక్కలెగయ గొట్టిగి
పరులకెల్ల జూడ నవ్వగునట్లుగాఁ
గలయ నైదు గూఁకటుల నొనర్చె"

అర 6-250

అని ఎఱ్ఱన ప్రయోగము. ఈ పద్యములో కూఁకటి శబ్దమునకు చిన్నజుట్టు అను నర్థము చెప్పవలసియున్నది

ఎఱ్ఱన భారతములో ముప్పది పైగా కృత్తులను సుమారు ఇరువది తద్ధిత ప్రత్యయములను ప్రయోగించినాడు. కృత్తులలో వు వు ప్రత్యయాంత శబ్దము లెక్కువగా ఉన్నవి దల ప్రత్యయముతో తెగుదల నలి తో ముదునలి గి తో 'ఈగి' కని తో కనుకని సేవు తో కొంతసేపు అని ప్రత్యయముతో రూపని -అని ఈ విధముగా ఆ యా ప్రత్యయముల కేకమాత్ర లక్ష్యములున్నవి

కొన్నిచోట్ల ఆ యా ప్రత్యయముల కర్థభేదము కూడ కనిపించుచున్నది కలిమి శబ్దము చాల చోట్ల ఉండుట అను నర్థములోనే పయుక్తమైనది ఒకటి రెండుచోట్ల మాత్రము సంపద అను నర్థము కూడ కలదు.

తెలివి శబ్దమును నన్నయ ప్రకాశము స్వచ్ఛత అను నర్థములలో ఎక్కువగా ప్రయోగింపగా ఎఱ్ఱన చైతన్యము జ్ఞానము అనువానికి వాచకముగా వాడెను

ధాతురూపము మాత్రము మిగిలి నామార్థమును బోధించు శబ్దములు—ఉబ్బు ఒప్పు త్రుప్పు, పొందు పొగడు పలుకు బొంకు మెచ్చు వెలుగువంటివి ఎఱ్ఱన రచనలో ఎక్కువగానే లభించును నిజమునకు ఇటువంటి రూపము లన్నియు మూల ద్రావిడ ధాతువులపై ఏదో ఒక అనుబంధముచేరి ఏర్పడిన ద్వితీయదశ ధాతువులు అందువలన అవి నామార్థమును గూడ బోధింపగల్గుచున్నవి

పూరణార్థక ప్రత్యయముల నెఱ్ఱన రెండగు రెండవు, మూఁడగు మూఁడవు అను రీతిగా రెండువిధముల ప్రయోగించినాడు.

పదమధ్యస్వరము లోపించుటవలన వ్యైరూప్యమును పొందిన శబ్దములనీ క్రిందివానిని ఎఱ్ఱన రచనలో చూడగలము

ఉనికి—ఉన్కి
కలిమి—కల్మి
కినుక—కిన్క కింక
కూరిమి—కూర్మి
చెలిమి—చెల్మి
చెయిది—చెయ్ది
చెలువు—చెల్వు
తాలిమి—తాల్మి
నగవు—నవ్వు
నేరువు—నేర్పు
పసువు—పస్పు—పంపు
పొలుపు—పొల్పు
పెనువు—పెంపు
పలుకు—పల్కు
పెండిలి—పెండ్లి
వేడుక—వేడ్క
చెలువలు—చెల్వంబు

అంత్యస్వరము మార్పునొందిన శబ్దములు రెండు—

అలవి—అలవు

తెలివి—తెలివు అనునవి ఎఱ్ఱన ప్రయుక్తములైనవి.

"వలవదు సంభ్రమంబు....................
.......................నమకట్టి క్రమ్మఱుం
దలవునం దున్కిపై వుండు..."[10] అను పద్యములో 'అలవు' రూపము ప్రయోగింపబడెనని సుస్పష్టము. ఇకారాంతమగు 'అలవి' శబ్ద ప్రయోగములు బహుళ సంఖ్యలో ఉన్నవి. వర్ణవ్యత్యయమువలన రూపొందిన 'లావు' శబ్దమునుగూడ ఎఱ్ఱన ప్రయోగించినాడు.

'తెలివు' శబ్దమును "అనినం దెలివొంది మందోదరీసుందరుండు" అను వచనములో తెలివు + ఒంది అని విడదీయవలసియున్నందున ఇది ఉకారాంత శబ్దమను నది నిశ్చితము.

"వదనలంబుల (దెలివియుం గర

వదరుచియున్"[11] —అను పద్యములో ఇకారాంతమగు తెలివి శబ్దమును చూడగలము. ఇక్కడ ప్రకాశము అను నర్థము వాచ్య మగుచున్నది.

మన్కి, వేల్పు, పేర్మి, కోర్కి- శబ్దములు మాత్రము మధ్యస్వరలోపముగల ఏకరూపముతోనే ప్రయుక్తములైనవి. బలిమి, చెలువ, అలుక, అను శబ్దములలో మధ్యాచ్చులోపించని రూపములే లభించుచున్నవి.

సన్నయభాగములో దీర్ఘముతో మొదలగు పదములో సాధారణముగా మధ్యాచ్చు లోపించిన రూపములే కనబడును. కూర్మి, నేర్పు, పేర్మి మొదలగునవి. 'వేడుక, వేలుపు' శబ్దాలలో మాత్రము రెండు రూపములున్నవి. హ్రస్వాది పదములలో (కలిమి, చెలిమి మొ॥) సాధారణముగా స్వరలోపము కలవి, లేనివి—రెండు రూపములు కనిపించును.

ఎఱ్ఱన రచనలో దీర్ఘాది పదములలో గూడ ఉభయ రూపములను చూడగలము వేరుపు-నేర్పు, తాలిమి-తాల్మి మొదలగునవి.

---

10. అర. 5-271 11. అర. 7-112

పఱువు శబ్దమును నన్నయ శకటరేఫముతోనే ప్రయోగింపగా తిక్కన ఎఱ్ఱనలు రేఫద్వయముతో ప్రయోగించినారు అటువంటి ప్రయోగములు ప్రాసస్థానములో నుండుటవలన ఉభయరేఫ ఘటితము అని అసందిగ్ధముగా తెలియుచున్నది

కృత్తులలో కడ వ, అక మొదలగు ప్రత్యయములు తద్ధితములలో ఱిక కా కత్తియ ఒంది కార మొదలగు ప్రత్యయములు ఎఱ్ఱనభారతములో మనకు కనిపించవు

ఈ విధముగా నన్నయ రచించి విడిచిన అరణ్యపర్వమును పూరించిన ఎఱ్ఱనరచనలో భాషావిషయములో తిక్కనతో సాజాత్య మెక్కువగా కన్పించుచున్నది తిక్కనతో కాలసామీప్యము, నివాసప్రాంత సన్నిహితమగుట కూడ దానికి కారణములుగా చెప్పవచ్చును.

నన్నయ మూడు పర్వములు పూర్తిగా రచించెననియు, ఎఱ్ఱన శిథిలభాగములనుమాత్రము పూరించెననియు ఒక వాద ముండెడిది నా యీ కృత్తద్ధిత పదపరిశీలనద్వారా కృత్తులు, తద్ధితాలు కూడ నన్నయరచలో లేనివి ఎన్నో ఈ భాగములో ఉండుట గమనింపబడినది అటువంటి పదములున్న చోట్లన్నియు శిథిలమైన భాగములే యని చెప్పుట నయుక్తికము కాదు కనుక, శిథిలపూరణవాదము సరియైనది కాదనుటకు ఇదికూడ ఒక ఉపపత్తి కాగలదని తలచుచున్నాను ఎఱ్ఱన అరణ్యశేషమును పూర్తిగా స్వరచనతోనే పూరించెననుట బహువిధముల సమంజసము

# సింహావలోకనము

మహాభారతాంధ్రీకరణ కర్తలలో మొదటివాడగు నన్నయ లాక్షణికులు ప్రతి పాదించిన కృత్తులను ఇరువదిరెండింటిని మాత్రము ప్రయోగించినాడు. ఇవి కాక పది కృత్తులను పూర్వలాక్షణికులు చెప్పనివాటిని ప్రయోగించినాడు అవి—

| | |
|---|---|
| (1) అటు | (6) కు |
| (2) ఇద | (7) కోలు |
| (3) ఇది | (8) గి |
| (4) ఇవ | (9) ము |
| (5) కని | (10) నలి |

ఈ ప్రత్యయములలో కొన్నింటిని అధునిక వ్యాకరణకర్తలు పేర్కొన్నారు.

నన్నయ-చూపటు(అటు) పన్నిదము (ఇద) చెయిది (ఇది) ఉక్కివము (ఇవ) కసుకని (కని), వీకు(కు) వేడికోలు(కోలు) ఈగి(గి) నోము(ము) ముదు సలి(నలి) శబ్దములను ప్రయోగించినప్పటికి బాలవ్యాకరణాదులు పై 0 ప్రత్యయములను ప్రతిపాదించకపోవుట కొరతగానే ఉన్నది

ఈయన తద్ధిత ప్రత్యయములను పదునాల్గింటిని వాడినాడు ఇవియన్నియు లాక్షణికులచే పేర్కొనబడినవే వీనిలో 'సేవు' ప్రత్యయమును ఇతర లాక్షణికు లెవ్వరును చెప్పకపోగా త్రిలింగశబ్దానుశాసనము మాత్రమే పేర్కొన్నది

నన్నయ ఇంచుమించు నూటయేబది కృదంత ప్రయోగములను చేసి కేవలము ఇరువదినాలుగు తద్ధిత ప్రయోగములనుచేయుట గమనింపదగియున్నది

డా బూదరాజు రాధాకృష్ణ 'పొదటు శబ్దములోని టు స్వార్థక ప్రత్యయమని తెలిపిరి- పగటు' శబ్దముకూడ అటువంటిదిగనే కన్పట్టుచున్నది పగటు

శబ్దమును నన్నయ ప్రయోగించినాడు కూతులు లోని ప్రత్యయముకూడ ఇదే అని తోచును కాని ఒకటి బహువచనముకాగా వేరొకటి ఏకవచనము కూతులు శబ్దము ప్రాచీనశాసనములలో శకట రేఫలోనే కనబడుచున్నది

నన్నయ పన్నిదంబు శబ్దమును ప్రయోగించినాడు దానిని తద్ధితముగా పరిగణించుట కవకాశము లేదు కృత్తుగానే చెప్పవలసియుండును కాని వ్యాకర్తలెవ్వరును కృత్తులలో 'ఇద' ప్రత్యయమును పేర్కొనలేదు

నన్నయ భాగములో ఈ క్రింది ప్రసిద్ధ పదములు కన్పించవు

1 కినుక కిన్క 4 అదరువ

2 తిండి 5 తెగువ

3 నమ్మిక

ఈ శబ్దములకు సంబంధించిన క్రియాపదములను మన మీ భాగములో చూడగలము

తద్ధితములలో తన ఱిక ప్రత్యయాంతము లొక్కొక్కటి మాత్రము కన్పట్టుచున్నవి పాటు ప్రత్యయాంతమొక్కటికూడ ఈభాగములో లేదు పూరణార్థకమగు ఎ(డు వ్యతిరేకార్థకమగు ఇడి ప్రత్యయము నన్నయ భాగములో లేవు

తిక్కనభారతభాగములో ఏబది కి పైగా కృత్ ప్రత్యయములు ముప్పది తద్ధిత ప్రత్యయములు లభించుచున్నవి

నన్నయకంటె అధికముగా ఇతడు ప్రయోగించిన కృత్తులు ఇరువది ఎనిమిది వరకున్నవి వీనిలో లాక్షణికులు ప్రతిపాదింపని ప్రత్యయములు—

1 అర 5 (అ)పి

2 ఎ 6 మర

3. గర 7. ఇడి

4 తి

కృత్ ప్రత్యయములలో అరి ప్రత్యయమును 'ప్రేలరి' శబ్దములో ప్రయోగించినాడు తిక్కన. చిన్నయసూరి తత్పూర్వులు కృత్తులలో 'అరి' ప్రత్యయమును చెప్పలేదు. పాపట శబ్దములోని 'అట' కృత్తని, అంగీకరించక తప్పదు. కినుక, వంటకము, ఓపిక, పూనిక, కోరికవంటి ప్రసిద్ధ పదాలను నన్నయభాగములో లేని వానిని ఈ భాగములో చూడగలము.

తునుకు, పోకు, తొడకు శబ్దముల ప్రయోగము 'కు' ప్రత్యయము నంగీకరింపవలసిన ఆవసరమును నొక్కిచెప్పుచున్నవి.

కోలు, పాటు, వు, తన ప్రత్యయాంత రూపము లీభాగములో అత్యధికముగా కన్పించుచున్నవి.

ఈగి శబ్దమును నన్నయ, ఎఱ్ఱనలు ప్రయోగించగా 'దాని రూపాంతరమైన 'ఈవి' శబ్దముకూడ తిక్కన రచనలో లభించును. అదేవిధముగా ముదుసలి శబ్దమును నన్నయ, ఎఱ్ఱనలు ప్రయోగించగా తిక్కనభాగములో ఆ పదము కాన్పించదు.

నన్నయ శకటరేఫముతో ప్రయోగించిన 'వఱవు' వంటి కొన్ని శబ్దములను తిక్కన ఉభయరేఫములతో ప్రయోగించినాడు.

కుయ్యి, కూయి

చెయి, చేయి

మనికి, మన్కి

వినికి, విన్కి

చెయిది, చెయ్ది

కూరిమి, కూర్మి

వంటి జంట రూపములుగల శబ్దములను తిక్కన అధికముగా ప్రయోగించియున్నాడు.

కినుపు, విడుగర, విడుమర, కింక, గెల్పుకోలు, నిట్ట, విద్పు, తదుపు, నతవు, పీఱిండి, పేదఱిమివంటి విశిష్టప్రయోగములు తిక్కన రచనలో గోచరమగును.

ఒక్క 'తన' ప్రత్యయముతో తిక్కన దెబ్బదికిపైగా రూపములను ప్రయోగించినాడు నన్నయ 'పలుగు దనంబు' అను ఒక్క శబ్దమునే వాడినాడు

పదునైదు పర్వముల విస్తృత భాగములో కేవలము ఒక్క ప్రయోగము మాత్రమే కలవి పెక్కు కలవు వానిలో కొన్నింటిని చూపుచున్నాను

1) అగ్గలికము
2) అనుపరి
3) అలవు
4) అలికిడి
5) ఈత
6) ఉఱవడి
7) ఎలసము
8) ఓపిక
9) కనుకలి
10) కలమరి
11) పిడుగర
12) విలువ
13) తెర్వు

ఇటువంటి శబ్దము లింకను చాల లభించును పీనిలో పాఠభేదములు కొన్ని ఉండుటవలన ఆ ఏక ప్రయోగశబ్దములలోను కొన్నింటిని తిక్కన ప్రయోగించి యుండకపోవచ్చునని తలచుట కవకాశమున్నది

అలుక అలమట ఆకలి ఈగి ఊత ఒప్పిదము కూర్మి కనుకని చెలువము చెయ్ది తలంపు, తెలివు నగవు పనువు మురిమి వేడుక సొంపు మొదలగు శబ్దములు కవిత్రయము వారిచే ప్రయోగింపబడియున్నవి

తిక్కన రచనలో తెలుగు పలుకుబడి ఎక్కువగా నుండుటవలన ఈ భాగములోనే ప్రయోగము లత్యధికముగా లభించినవి

ఎఱ్ఱన తన భాగములో అయిదు కృదంత రూపములను మాత్రము క్రొత్తగా ప్రయోగించినాడు 'తెగుదల' శబ్దము వానిలో ఒకటి కావు శబ్దము నిర్బంధకముగ రక్షణార్థములో ఎఱ్ఱన భాగములోనే కన్పించును

తద్ధిత ప్రయోగములను తొమ్మిదింటిని ఎఱ్ఱన క్రొత్తగా చేసినాడు కల్లరి టక్కరి శబ్దముల నితడు మాత్రమే వాడియున్నాడు పాటు ప్రత్యయాంతములు రెండు ఎ డు ప్రత్యయాంతములు రెండు కలవు ఒఱవరనము' అనునదొక్కటే తన ప్రత్యయయుక్త రూప మీ భాగములో కలదు

ఎఱ్ఱన రచనలోని తక్కిన ప్రయోగములలో తిక్కనతో సామ్యమెక్కువగా కనబడును నన్నయ ప్రయోగించని అనేక శబ్దముల నితడు ప్రయోగించినాడు కలిమి-కల్మి కూరిమి-కూర్మి వంటి జంట రూపముల ప్రయోగము ఎఱ్ఱన రచనలో అధికముగా నున్నది.

కడ, ప అక వంటి కొన్ని కృత్తులు టిక కాఁడు కత్తియ, బంటి కార అను తద్ధితములు ఎఱ్ఱన భాగములో మనకు కాన్పించవు

బండి కొలది మారి, దారు గొట్టు కోరువంటి తద్ధితాలు మతి సు ఉడు వర వంటి కృత్తులు (ఆధునిక లాక్షణికులు చెప్పినవి కవిత్రయ రచనలో కాన్పించవు

అ అట, అరి, ఇ ఇక ఇద త వ అనునవి కృత్తులలో తద్ధితాలలోగూడ చేర్పదగినవిగా ప్రయోగములందున్నవి

కవిత్రయ మహాభారతములోని కృత్తద్ధిత ప్రయోగముల విశ్లేషణవలన ఈ క్రింది విషయములు స్థిరపరచబడినవి

1. కృత్తులలో అట' ప్రత్యయమును ప్రాచీనులు, ఆధునికులుకూడ లాక్ష ణికు లెవ్వరును చెప్పలేదు తిక్కన పాపట' శబ్దమును ప్రయోగించినందున దీనిని కృదంతముగా పేర్కొనక తీరనందున కృత్తులలో అట ప్రత్యయము నంగీకరింప వలసియుండును.

2. కృత్తులలో 'అరి' ప్రత్యయమును బాలవ్యాకరణాదులు ప్రతిపాదించ లేదు. వ్యా.బా. వ్యాకరణము పేర్కొన్నప్పటికి 'కాచు, దాచు, చూచు'లకు మాత్రమే విధించినది. తిక్కన 'ప్రేలరి' శబ్దమును ప్రయోగించినాడు. ఇది కృదంతమనక తప్పదు. కావున 'అరి' ప్రత్యయమును కృత్తులలో అంగీకరింపవలసియుండును.

3. 'ఉవ' ప్రత్యయమును వ్యాకరణకర్తలు ప్రతిపాదింపలేదు. కాని డా॥ భద్రిరాజు కృష్ణమూర్తి 'చేరువ' శబ్దమును 'చేర్ + ఉవ' అని విశ్లేషించినట్లు కృత్తులలో 'ఉవ' ప్రత్యయమును ఆమోదింపదగును. అప్పుడు కూటువ, విలువ, చేరువ, తెరువ, దిగువ మొదలగు శబ్దములను 'ఉవ' ప్రత్యయాంతములుగా స్వీకరించుట సముచితము. చేవ, త్రోవ వంటి శబ్దాలలో మాత్రము 'వ' ప్రత్యయము చెప్పదగును.

4. 'తెలివి' శబ్దము తిక్కన భారతములో కలదు. దానిని 'అవి' ప్రత్యయాంతముగా విశ్లేషించతగును. మూ.ద్రా. ధాతువగు తెల్, తెళ్‌గా మారిన తరువాత 'అవి' ప్రత్యయముచేరగా తెలివి రూపమేర్పడును. ఏ లాక్షణికుడును 'అవి' ప్రత్యయమును పేర్కొనలేదు. కొందరు 'వి' ప్రత్యయమును చెప్పినారు. కాని 'అవి'ని స్వీకరించుట సముచితము.

5. 'చొరవ' శబ్దము తిక్కన రచనలో పెక్కుచోట్ల కలదు. దీనిని 'అవ' ప్రత్యయాంత మనుటే యుక్తము. చిన్నయసూరి ప్రకారమైనను చొచ్చునకు 'చొరు' ఆదేశమగును. కనుక చొరు + అవ = చొరవ అనియే చెప్పవలసియుండును. కావున కృత్తులలో 'అవ' ప్రత్యయమును తప్పక అంగీకరింపవలెను.

6. కవిత్రయము ప్రయోగించిన కనుకని, ఈగి, కదమ శబ్దములలోని "కని, గి, మ" అను ప్రత్యయములను వ్యాకరణములలో చేర్చుట అత్యావశ్యకము.

7. 'కు' ప్రత్యయాంత రూపములు కొన్ని నన్నయ, తిక్కన రచనలలో లభించుచున్నవి. తొడకు. పోకు మొద॥. అందువలన కృత్తులలో 'కు' ప్రత్యయమును చెప్పవలసిన అవసరమున్నది.

8 ముదునలి' శబ్దమును నన్నయ-ఎఱ్ఱన లిరువురును ప్రయోగించినందువ నలి' కృత్ ప్రత్యయముగా నిర్దేశించుట లాక్షణికుల కర్తవ్యము

9 కౌగిలి వాకిలి లోగిలి – వంటి శబ్దములలో కిలి ప్రత్యయము భాసించుచున్నది కౌగిలి శబ్దవ్యుత్పత్తి అస్పష్టముగా ఉన్నప్పటికిని కిలి ప్రత్యయమును తప్పక ఆమోదించవలసిన అవసరమెంతో కలదు

.0 అడఇడి, అలఇడి అను పాఠభేదములతో ఒక్కటే ప్రయోగము కన్పించుచున్నది రెండింటిలోను ఇడి రూపమున్నది అందువలన ఇడిని ప్రత్యయముగా స్వీకరింపదగును

11 ఇద ప్రత్యయమును వ్యాకరణకారు లందరును తద్ధితములలోనే పేర్కొనిరి కాని వన్నిదము అను నన్నయ ప్రయోగములోని ఇద కృత్తుగా స్వీకరింపక తప్పనందున కృత్తులలో ఇద ప్రత్యయమును చేర్పవలెను

12 పడ అనుబంధము పాటుగా రూపొంది ప్రత్యయత్వమును సంతరించుకున్నది వ్యాకరణకారులు పాటును ప్రత్యయముగా పేర్కొనలేదు కాని దానిని తద్ధిత ప్రత్యయముగా పరిగణించుట ఆవశ్యకము

—o—

# అనుబంధము-1

## కవిత్రయము ఉపయోగించిన 'కృత్' ప్రత్యయముల పట్టిక

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. అ | - | న | - | తి | - | ఎ |
| 2. అక | - | - | - | తి | - | - |
| 3. అట | - | - | - | తి | - | - |
| 4. అటి | - | - | - | తి | - | - |
| 5. అడ | - | న | - | తి | - | - |
| 6. అమి | - | న | - | తి | - | ఎ |
| 7. అర | - | న | - | తి | - | ఎ |
| 8. అఱ | - | - | - | తి | - | ఎ |
| 9. అరి | - | - | - | తి | - | - |
| 10. అల | - | - | - | తి | - | - |
| 11. అలి | - | న | - | తి | - | ఎ |
| 12. అవు | - | న | - | తి | - | ఎ |
| 13. ఆర | - | - | - | తి | - | ఎ |
| 14. ఇ | - | న | - | తి | - | ఎ |
| 15. ఇక | - | న | - | తి | - | ఎ |
| 16. (ఇ)కి | - | న | - | తి | - | ఎ |
| 17. ఇడి | - | న | - | తి | - | ఎ |
| 18. ఇత | - | న | - | తి | - | ఎ |

19. ఇద - న - తి - ఎ

20. ఇవి - న - తి - ఎ

21. (ఇ)మి - న - తి - ఎ

22. ఇలి - న - తి - ఎ

23. ఇప - న - తి - ఎ

24. ఉ - న - తి - ఎ

25. ఎ - - - తి - -

26. ఎన - - - తి - -

27. క - న - తి - ఎ

28. కద - న - తి - -

29. గద - న - తి - -

30. కని - న - - - ఎ

31. కలి - - - తి - -

32. కు - న - తి - ఎ

33. కువ - న - తి - ఎ

34. కోలు - న - తి - -

35. గర - - - తి - -

36. గి - న - తి - ఎ

37. గు - న - తి - ఎ

38. ట - న - తి - ఎ

39. టు - న - తి - ఎ

40. డు - న - తి - ఎ

41. త - న - తి - ఎ

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 42 | తి | - | న | - | తి | - | ఎ |
| 43 | ద | - | న | - | తి | - | ఎ |
| 44 | దం | - | - | - | తి | - | ఎ |
| 45 | (అ)న | - | న | - | తి | - | ఎ |
| 46 | ప | - | న | - | తి | - | - |
| 47 | పి | - | - | - | తి | - | ఎ |
| 48 | పు | - | న | - | తి | - | ఎ |
| 49 | పుర | - | - | - | తి | - | - |
| 50. | బడి | - | - | - | తి | - | - |
| 5 | మ | - | న | - | తి | - | ఎ |
| 52. | మర | - | - | - | తి | - | - |
| 53 | ము | - | న | - | - | - | - |
| 54 | వ | - | న | - | తి | - | ఎ |
| 55 | వడి | - | న | - | తి | - | ఎ |
| 56. | వి | - | న | - | తి | - | ఎ |
| 57. | వు | - | న | - | తి | - | ఎ |
| 58 | సరి | - | న | - | - | - | ఎ |

---

న = నన్నయ

తి = తిక్కన

ఎ = ఎఱ్ఱన

# అనుబంధము-2

## కవిత్రయము ప్రయోగించిన తద్ధిత ప్రత్యయములు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | అ | - | న | - | తి | - | ఎ |
| 2 | అడ | - | న | - | తి | - | ఎ |
| 3 | అడి | - | - | - | తి | - | - |
| 4 | అద | - | - | - | తి | - | - |
| 5 | అరి | - | న | - | తి | - | ఎ |
| 6 | అసి | - | - | - | తి | - | ఎ |
| 7 | ఆడు | - | - | - | - | - | ఎ |
| 8 | ఇ | - | న | - | తి | - | ఎ |
| 9 | ఇక | - | న | - | తి | - | ఎ |
| 10 | ఇడి | - | - | - | తి | - | ఎ |
| 11 | ఇద | - | న | - | తి | - | ఎ |
| 12 | ఇంది | - | న | - | తి | - | ఎ |
| 3 | ఇమి | - | న | - | తి | - | ఎ |
| 14 | ఈ | - | - | - | తి | - | - |
| 15. | ఉక | - | న | - | తి | - | ఎ |
| 16 | ఎడు | - | - | - | తి | - | ఎ |
| 17 | క | - | - | - | తి | - | ఎ |
| 18 | కత్తియ | - | - | - | తి | - | - |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 19 | కాఁడు | - | న | - | తి | - | - |
| 20 | టిమి | - | న | - | తి | - | - |
| 21 | త | - | న | - | తి | - | ఎ |
| 22. | తన | - | న | - | తి | - | ఎ |
| 23. | న | - | - | - | తి | - | ఎ |
| 24 | ప | - | - | - | తి | - | - |
| 25 | పల | - | న | - | తి | - | ఎ |
| 26 | పాటు | - | - | - | తి | - | ఎ |
| 27 | పోతు | - | - | - | తి | - | - |
| 28 | మడి | - | - | - | తి | - | - |
| 29 | వ | - | న | - | తి | - | ఎ |
| 30 | టిక | - | న | - | తి | - | - |
| 31 | టిక్ష | - | - | - | తి | - | - |
| 32. | సేవు | - | న | - | తి | - | ఎ |

# అనుబంధము-3

## కవిత్రయ ప్రయుక్తములలో లాక్షణికులు చెప్పని కృత్తద్ధితములు

1 కృత్తులు -

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. అట | - | - | - | తి | - | - |
| 2. అడ | - | న | - | తి | - | ఎ |
| 3. ఇడ | - | న | - | తి | - | - |
| 4 కని | - | న | - | - | - | - |
| 5 కు | - | న | - | తి | - | ఎ |
| 6 గర | - | - | - | తి | - | ఎ |
| 7 గి | - | న | - | తి | - | ఎ |
| 8 గు | - | న | - | తి | - | ఎ |
| 9. డ | - | న | - | తి | - | ఎ |
| 10 వి | - | - | - | తి | - | ఎ |
| 1 . మ | - | న | - | తి | - | ఏ |
| 12 మర | - | - | - | తి | - | ఏ |
| 13 ము | - | న | - | తి | - | ఎ |
| 14. నలి | - | న | - | - | - | ఎ |

2 తద్ధితములు :-

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 ఇది | - | న | - | తి | - | ఎ |
| 2 వ | - | - | - | తి | - | - |
| 3. పాటు | - | - | - | తి | - | ఎ |
| 4. మడి | - | - | - | తి | - | - |
| 5 వ | - | న | - | తి | - | ఎ |

| | | |
|---|---|---|
| 16 | తెలుగు వ్యాకరణ వికాసము | 2 భాగములు- బొడ్డుపల్లి పురుషోత్తము గిరిజా ప్రచురణలు గుంటూరు 969 |
| 17. | తెలుగు భాషాచరిత్ర | భద్రిరాజు కృష్ణమూర్తి ఆం ప్ర సా అకాడమి 1979 |
| 18 | తెలుగు వ్యుత్పత్తికోశము | 1 2 3 భాగములు ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రచురణ |
| 19 | ద్రావిడభాషలు | పి యస్ సుబ్రహ్మణ్యం |
| 20 | నన్నయ పదప్రయోగకోశము | ఆం ప్ర సాహిత్య అకాడమి ప్రచురణ |
| 2 | నారాయణీయాంధ్ర వ్యాకరణము | చర్ల నారాయణశాస్త్రి లలితా ప్రెస్ హైదరాబాదు 1969 |
| 22 | పద్యాంధ్ర వ్యాకరణము | చిన్నయసూరి. ఆంధ్రసాహిత్య పరిషత్తు కాకినాడ 193 |
| 23 | ప్రౌఢ వ్యాకరణము | బ సీతారామాచార్యులు వావిళ్ళముద్రణ 1962 |
| 24 | బాలవ్యాకరణము | పరవస్తు చిన్నయసూరి |
| 25 | బాలవ్యాకరణోద్ద్యోతము | పిఝ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి 1977 ముద్రణ |
| 26 | బాలవ్యాకరణ సారస్య సర్వస్వపేటిక | దూసి రామమూర్తి శాస్త్రి |
| 27 | బాలసరస్వతీయము | ఎలకూచి బాలసరస్వతి ఆంధ్రసాహిత్య పరిషత్తు కాకినాడ 1932 |
| 28 | బాలప్రౌఢ వ్యాకరణ సర్వస్వము | టి భాస్కరరావు |
| 29 | భారతి సంపుటములు | |
| 30 | ముక్తలక్షణకౌముది | వంతరాం రామకృష్ణరావు |

31 రమణీయము — దువ్వూరి వెంకటరమణశాస్త్రి.
ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వాల్తేరు 1967

32 లఘువ్యాకరణము — వేదం వెంకటరమణశాస్త్రి

33 వృత్తివిచారము — పేరి సూర్యనారాయణశాస్త్రి

34 వైయాకరణపారిజాతము — వఝల చిన సీతారామస్వామిశాస్త్రి - 1967
ముద్రణ

35 వ్యావహారికభాషా వ్యాకరణము — పద్మమూడి గోపాలకృష్ణయ్య

36 శబ్దరత్నాకరము — బి. సీతారామాచార్యులు దేశభాషాగ్రంథ
కరణసభ చెన్నపట్టణం 96[illegible]

37 శబ్దలక్షణసంగ్రహము — చిన్నయసూరి కొండపీటి వెంకటకవి
ప్రచురణ 968

38. శబ్దార్థచంద్రిక — మహాకవి సుబ్బరాయుడు 1969

39 సర్వలక్షణసారసంగ్రహము — కూచిమంచి తిమ్మకవి–మంజువాణీప్రెస్
ఏలూరు 1901

40 సులభవ్యాకరణము — వావిలకొలను సుబ్బారావు

41 సూర్యరాయాంధ్రనిఘంటువు — 8 సంపుటములు ఆంధ్రప్రదేశ్ సాహిత్య
అకాదమీ 1979

—o—

## ENGLISH BOOKS

1 A Comparat ve Grammar of the D av d an Languages

-Rt Rev Robert Ca dwe 1913

2 A Comparat ve Study of Drav d an Noun Der vat ves

Ga Sambas va Rao 1973

3 A Drav d an Etymo og ca D ct onary

T Burrow and M B Emeneau

Oxford Un vers ty Press 1360

4 A Drav d an Etymo og ca D ct onary Supp ement 1968

5 Techn ca Terms and Techn que of Sanskr t Grammar

K C Chatte

6. Te ugu Ve ba Bases

-Bh Kr shna Mu thy Mot a Banars dass 1972

—o—

# శోధన పత్రిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 1 | తేషా | తేషాం |
| 3 | 22 | (3) | (3) తిజ్ కృత్తద్ధిత చతుష్టయ సమాసాః వాజన-ప్రాతిశాఖ్యమ్ |
| 4 | 16 | తో | లో |
| 5 | 10 | ష్ఠా | స్థా |
| 7 | 3 | వర్థా | వర్గా |
| 9 | 15 | అ | లి |
| 19 | 18 | గవ్యమ్ | గవ్యమ్, గోమయమ్ |
| 20 | 23 | వృత్తుం | కృత్తుం |
| 26 | 17 | బడిన | బడినవి |
| 27 | 1 | భేరము | భేదము |
| 29 | 14 | కృదస్తా | కృదన్తా |
| 32 | 23 | విశ్వాశము | విశ్వానము |
| 40 | 8 | తెరవింది | వెరవింది |
| 46 | 14 | రూష | రూప |
| 48 | 24 | వ్యాకకణ | వ్యాకరణ |
| 53 | 21 | కరణార్థమే | కరణార్థకమే |
| 56 | 7 | పఠిష్ట | పఠిష్థ |
| 59 | 17 | యపని | యతని |
| 59 | 4 | శానము | శాసనము |
| 60 | 16 | —— | కాశికాంతం 4-90 |
| 63 | 14 | ప్రత్నయ | ప్రత్యయ |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 64 | 6 | ఇమి, వ | ఇమి, వ |
| 75 | 21 | ఏఱు | ఏఱు |
| 78 | 7 | అఱ్ | అట్ |
| 81 | 22 | నాఱ్ | నాట్ |
| 88 | 13 | అఱు | అఱు |
| 90 | 15 | 18 | 14 |
| " | 16 | అ, అరి | అ, అవ, అరి |
| 100 | 7 | కోం | కోలు |
| 100 | 14 | అర | అస |
| 102 | 22 | పదము | పదములు |
| 104 | 11 | పర్ | పఱ్ |
| 104 | 16 | T.V.B | T.V.B p 426 |
| 106 | 18 | దంపక | దంపక |
| 106 | 19 | ఇర్ | ఇఱ్ |
| 107 | 18 | జానద | జావద |
| 115 | 10 | పద్యములలో | పద్యములో |
| 118 | 4 | ర్ | ఱ్ |
| 122 | 8 | T.V B. | T V B. p. 434, 443 |
| 123 | 17 | ఒఱ్ | ఒట్ |
| 123 | 8 | అ | ఱ |
| 123 | 20 | అటిల్ | అడిల్ |
| 125 | 8 | 81 | 33 |
| 127 | 8 | T.V.B. | T.V.B. p. 382 |
| 130 | 12 | వ్రేంగడిరి | వ్రేగడరి |
| 130 | 20 | ఏర్ | ఏఱ్ |
| 130 | 23 | ఎనె, ఎనక | ఎనె, ఎనక |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 131 | 2 | తెలుపుచున్నది | తెలుపుచున్నవి. p. 310 |
| 132 | 3 | వ్రాసినారు. | వ్రాసినారు. p. 473, 474 |
| 132 | 24 | సూచించినది. | సూచించినది. p 326 |
| 135 | 9 | పెలంగు | మెలంగు |
| 137 | 3 | 27. కోలు | 21. కోలు |
| ,, | 4 | ప్రత్యయముకు | ప్రత్యయత్వము |
| 138 | 8 | ఓ. | 22. ట |
| 139 | 18 | పైప్రత్యయ | పైఁట' ప్రత్యయ |
| 141 | 2 | తెల్పుచున్నది. | తెల్పుచున్నది p. 398 |
| ,, | 23 | ఐడినది | ఐడినది. p. 424, 425 |
| 143 | 1 | ఓక్/ఓఙ్ | ఊఁక్/ఊఁఙ్ |
| ,, | 10 | టు | 23; టు |
| 146 | ,, | డు | 24; డు |
| 147 | 8 | ఁత,-త | 25; ఁత,-త |
| ,, | 16 | పూయు | పూయు |
| 149 | 14 | అఙ్ | అచ్ |
| 150 | 12 | తరువాక | తరువాత |
| 151 | 1 | తి | 26. తి |
| ,, | 17 | దల | 27. దల |
| 153 | 2 | చోట | చోట్ల |
| ,, | 7 | అలినల్ | అలినల్ |
| ,, | 15 | మరియు | మురియు |
| 154 | 1 | మూగ్ | ముత్ |
| ,, | 24 | 69 1-48 | 69. అను-1-48 |
| 157 | 16 | ఇతరార్థములలో | ఇతరార్థములలో |
| ,, | 19 | తెర్ | తెక్ |
| 161 | 7 | మునువు | మనువు |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 161 | 14 | ఐడినది. | ఐడినది. p. 325 |
| | 21 | —— | 18. అను.1-163 |
| 162 | 7 | T V. B. | T. V. B. p. 390 |
| " | 21 | నడువు | వడువు |
| 164 | 10 | పలువు | వలవు |
| 167 | 20 | వస్త్రమునకువస్త్రమను | వస్త్రమను |
| 168 | 6 | పరువు | పరవు |
| " | 9 | పొదచు | పొడుచు |
| 171 | 11 | భోగము | భాగము |
| 176 | 25 | 98. బా. తద్ధిత-7 | 98. ఉద్యో-4. 55 |
| " | 2 | శబ్దిములకు | శబ్దములను |
| 179 | 7 | క్రొవు | క్రొవ్వు |
| 180 | 21 | ఏనితో | పినిలో |
| 184 | 10 | నావెరవున | నా వెరవున |
| 185 | 16 | 12 కేలారితినము | 12 కిలారితనము |
| 186 | 14 | బెడుంగుదనము | బెడంగుదనము |
| 190 | 9 | మీన | మీద |
| 192 | 8 | క్రమముగా-అ, గు | క్రమముగా-అ,గు |
| " | 7 | వృట్టుఁగల్గరి | వుట్టుఁగల్గరి |
| 195 | 22 | T V. B. | T- V. B. P |
| 195 | 23 | ప్రేకవ | ప్రేకన |
| 97 | 18 | నౌఅపతనము | నౌఅవతనము |
| 198 | 14 | కింకిరి | కింకిరి |
| 200 | 2 | కాలువడి | కొలువడి |
| 202 | 19 | చెలువలు | చెలువము |
| " | 22 | తెనివి | తెలివి |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 204 | 8 | | 1. భీష్మ-2-84<br>2. ఉద్యో-1-93<br>3. అర-4-400 |
| ,, | 9 | ప్రాంతసన్నిహిత | ప్రాంతము సన్నిహిత |
| 208 | 21 | కాఁవు | కావు |
| 209 | 11 | బండి | బంటి |
| 2 | 8 | కౌగిలి | కౌఁగిలి |
| ,, | 12 | వర | పదు |
| 2 2 | 6 | 4. అట | 4. అర |
| ,, | 7 | 5. అర | 5. అది |
| ,, | 10 | 8. అఱ | 8. అఱు-న |
| 217 | 20 | 1. ఇడ | 1. ఇద |
| 2 9 | 9 | భాకములు | భాగములు |

## గ్రంథకర్త పరిచయము

జననం ప్రమో[illegible] జ్యేష్ఠము-జూన్ 1940

జన్మస్థ[illegible] భ[illegible]రం, సూర్యాపేట తాలూకా, నల్గొండ [illegible]ల్లా

విద్యాభ్యాసం యాదగిరి దేవస్థానం, వేదాంత వర్ధినీ సంస్కృ[illegible] కళాశాల, సీతారాంబాగ్.

విద్యార్హతలు : వ్యాకరణ విద్యాప్రవీణ (ఆంధ్ర)
ఎమ్.ఏ; పి. హెచ్.డి (తెలుగు, ఉస్మానియా) బి.ఎడ్.

ఉద్యోగం : సంస్కృతోపన్యాసకుడు.
ఆంధ్రసారస్వత పరిషత్ ప్రాచ్య క[illegible]శాల, హైదరాబాద్

అభిరుచులు : సంస్కృత భాషా ప్రచారం, పరీక్షల [illegible]ర్వహణ, గ్రంథపఠన

ఇతర రచనలు : 1. సంస్కృత క్రియలు-
ఆం॥ ప్ర॥ సాహిత్య అకాడమీ ప్రచురణ
2. సంస్కృత పాఠవల్లరి
ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ
3. శుకనాసోపదేశము
సాహితీ సన్మాన సమితి,
పాలెంవారి ప్రచురణ.

